శ్రీః

# ఆంధ్రభాషార్ణవము.

అచ్చ తెనుఁగు నిఘంటువు

కోటి. వెంకనార్యకృతము.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

చెన్నపురి :

1912.

[వెల 12 అణాలు

# ఆంధ్రభాషార్ణవము.

## పీఠిక.

శా. శ్రీమాతృప్రకటీకృతాంగరుచి సారెన్ జూచి భావింపుచో
నామే యైన త్రిలోకమాత యగుటన్ వైశ్యాంగనం దల్లి యై
ప్రేమన్ బ్రోచుట చూడ వింతయె యనన్ శ్రీమాతృభూతేశ్వరుం
డామోదంబునఁ బ్రోచుఁ గాత రఘునాథాధీశచూడామణిన్. 1

చ. తనధనురాలయమ్ములను దాఁచితివే యని యాటలట్ల కై
కను సడలించి చన్నుఁగవ గ్రక్కునఁ బట్టఁగ నెఱచునాయకుఁ
గనినసుగంధికుంతలమొగంబునఁ దోఁచినచిన్నినవ్వు కో
రినవర మిచ్చి ప్రోవుతను శ్రీరఘునాథనృపాలచంద్రునిన్. 2

ఉ. అంబరకేశముఖ్యవిబుధావలిగర్భములం దడంగ వ
య్యంబుజసంభవాండనివహమ్ము లటంచని వాని నుంచ దోఁ
రంబుగఁ జేయురీతి నుదరంబును బెంచినగుజ్జువేల్పు ని
త్యంబుగ మామకీనకృతి ధారుణిలోనఁ జెలంగఁజేయుతన్. 3

తే. జడమతులచేత నిందింపఁబడినకృతుల, నుత్తమము లంచు సత్కవు లొప్పుకొంద్రు
శునకదంష్ట్రల రాచినవెనుకఁగాదె, పసిఁడిసొమ్ములు దాల్తురు ప్రభువు లెల్ల. 4

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవికుకవిపురస్కారతిరస్కారంబులునుం జేయు
నవసరంబున. 5

సీ. శ్రీమదింద్రాన్వయక్షీరవారిధి, చంద్రుఁ డాశ్రితచేలాంచలామరమణి
కవిజనమందిరాంగణపారిజాతంబు, బాంధవకరగతస్వర్ణశిఖరి
యాచకజనగోష్ఠఖేచరనైచికి, వైదికచిరజప్తకాదివిద్య
పదనతసామంతబహుజన్మసుకృతంబు, దృప్యద్విరోధితృతీయగురుఁడు
పాండ్యమహీమండలాధ్యక్షుబాహుదండ, కలితతేజితచకచకత్కారకృపాణి
దానవిద్యాసశిష్యసంతానపాణి, రంజితజనాళి రఘునాథరాజమౌళి. 6

వ. ఒక్కశుభదినంబున వివిధకవిబుధసముదయనిరంతరసమాగమంబున నైఋయ నుఱుము
చినుకుమొగిలుతెగ లన సబ్బంపితమదమదావళరాజి రాజిల్ల ఖచరపురవరస్థితు

రంగంబే నేన యని యభినయించురీతిని గైజామోరలు చేయునిరాఘాటధాటీసమాటకఘోటీపటలంబు జటిలం బగుచునుండ వేల్పుల కిక్కయు నవ్వృతంబు చుక్కయు నిడుటకు నమందానందంబుఁ జెందుమేరుమందరంబులకు సముదభ్రభ్రగజంబుల నెసంగ నధివసించి తదీయదానంబునం బొఁగడువడువున భూరిభేరుల గంభీరభాంకారంబులు చెలంగఁ గవిజనదారిద్ర్యంబులు నిరాకరించుచందంబున నిందువదనాకరారవిందసముత్సారితంబు లగుచామరంబు లోలయ నిరంతరశ్రీమంతు లగు[illegible]మంతులును రూపజితమారు లగురాజకుమారులును గుణసింధువు లగుబంధువులును, సలలితతంత్రు లగుమంత్రులును సకలవిద్యాసరోజినీరవు లగుకవులును వాదైకధుర్యు లగుశాస్త్రివర్యులును నాదసుఖసంధాయకు లగుగాయకులును భరతకళారహస్యోత్కటు లగునటులును శృంగారకణిక లగుగణికలును గొలువ సభాంతరాళంబునఁ గొలువుండి నన్ను రప్పించి సన్మానంబు సేయుచు వినయంబున. 7

క. ఖచరీకచకుచవిచల, ద్విచికిలహారస్రవన్నవీనమరంద
ప్రచురరుచిఁ బెనఁగొనుఁ గచ్చా, కచిగా నీకవిత లెన్నఁ గవివెంకన్నా. 8

తే. ఆంధ్రగీర్వాణకవనంబులందు నీకుఁ, గలుగుజ్ఞానం బ దేరికిఁ గలుగ నేర్చు
నాశ్రితుఁడ వంచు నుతియించు నట్టు గాదు, గాని యవి యిపు డేల వెంకనకవీంద్ర,

తే. దేవతలభాష గావునఁ దెల్గుకన్న, సంస్కృతము మిన్న యాయుక్తి సరియె తెలిసి
రసికుఁడగువాఁడు తనదుజాలుసికలోనఁ, దులసి నే యిడుకొనునో జాదుల నెయిదునొ.

తే. కాన యీయాంధ్రకృతులందుఁ గలుగునట్టి, పదములకు నెల్ల నర్థ మేర్పడెడురీతి
నద్భుతంబుగఁ గృతిని జేయంగవలయు, నర్థమైన రసస్ఫూర్తి యగుట యరుదె. 11

తే. కృతికి నాయకు మాతృభూతేశుఁ జేయ, వలయు నన నేను నట్టకాఁ దలఁచితి నసఁ
బసిఁడిబొమ్మలు సేయించి వంటరాళ్ళఁ, జెక్కినను మేలె రత్నముల్ చెక్కకున్న.

వ. అనిన నేనుం దదీయపరమేశ్వరచరణారవిందభక్తికి మెచ్చుచు సత్కులప్రసూతుండ వగునీకు నేతాదృశమనీషావిశేషం బరుదే యని తత్కులప్రశంస సేయం దలంచి. 13

సీ. రంభాదినైలింపకుంభస్తనీమణుల్, బానిస లగుచును బనులు సేయఁ
గకుబంతముల నేలఁ గలవేల్పుగమి కొంచు, సమయము లేక మోసలను గాయఁ
గులధరాధరములు చలనంబులను మాని, యెచటఁ దార్కిల్చెనో యచట నుండ
గర్వధూర్వహు లైన నశ్వరీచరవరుల్, నిలువఁ గూడక రసాతలము సొరఁగఁ
గల్ప[illegible]నీడ వినుక[illegible]కగట్టుతలఁపు, మానికపుఁదిన్నెఁ గిన్నరీగానఫణితి
నాలకించుచు నానంద మనుభవించు, నల్లదేవేంద్రుఁ డలవియె యతనిఁ బొగడ.

క. అత్తఁ డొకనాఁ డొకమానవ, సతిని వరించెను దదీయసౌందర్యం బ
ద్భుత మగుఁ గద యాయింతికి, సుతు లంతటఁ గలిగి రతులసుగుణాన్వితు లై. 15

క. ఆయన్వవాయమందలి, రాయక్షితిపాలమౌళి రాజిల్లె యశ
శ్శ్రీయు క్తిని బ్రహ్మాండం, బొయెడ నాపాల్కడవయట్లు చెలంగెన్. 16

క. ఆరాయనృపతి గాంచెఁ గు, మారుల రఘునాథరాయమహిపతి నమన
క్ష్మారమణుఁడు నచ్చన హం, వీరుఁడు బేరమవిభుఁడన వీరలలోనన్. 17

క. ఆరఘునాథనృపాలుఁడు, ధారణి నేలంగఁ దొడఁగె దైవతయువతీ
హారపటీరతుషారశ, తారసుధారసవిధాముధాకృతికీర్తిన్. 18

ఉ. ఆరఘునాథభూపతి మహాద్భుతచర్యుఁ డటంచు నిచ్చలున్
ధీరజనంబు లెల్ల వినుతింపఁగ ధారణి నేలెఁ గాని యా
పేరుకుఁ దగ్గకార్యములు పెక్కువిధంబులు దెల్ప శక్య మె
వ్వారికి శైవధర్మపరిపాలన మొక్కటి యెక్కుడై తగున్. 19

తే. అతఁడు గాంచెను బెద్దరాయక్షితీంద్రు, భుజబలవిహారు శ్రీముద్దువిజయధీరు
ధర్మగుణశీలుఁ దిరుమలధరణిపాలు, రవితులితదేహవిభునిఁ జిన్నాయవిభు ని. 20

క. వారలలోపలఁ దిరుమల, భూరమణుఁడు ఖ్యాతిఁ గాంచె భుజబలదృప్య
ద్ఘోరాహితవారాహిత, సారాహితతీవ్రదీప్తశరజాలుండై. 21

చ. తిరుమలరాయశేఖరవితీర్ణి యుఁ బెక్కువిధంబు లొటఁ ద
త్స్ఫురణముచేతఁ జుమ్ము హరిపొక్కిలిఁ జేరె హిరణ్యగర్భుఁ డా
హరియు నభోమణిం గదిసె నల్లనభోమణి యుండసాగె నం
బరమున నంబరంబు గనుపట్టనిదయ్యె విచిత్రరీతిగన్. 22

తే. అతఁడు గాంచెను శ్రీవిజయరఘునాథ, నరపతిశిరోమణిని ముద్దునరసవిభుని
రాజగోపాలధీరుఁ దిర్మలవజీరు, మఱియు రణభాషికాఖ్యుఁ గ్రమంబుతోడ. 23

తే. ఆకుమారులందు. 24

తే. హరినిఁ దలఁపనియట్టి దిక్కరుల రోసి, గండములు గల్గుగిరులను గిడకుఁ ద్రోచి
ధారుణీకాంత వరియించెఁ దనకుఁదాన, విజయరఘునాథు జయభార్గవీసనాథు. 25

సీ. త్రిశిరఃపురీపరివృఢమనోనలినికి, బాలవిభాకరులీలఁ దోఁచి
చోళరాజాస్థానకేళీగృహంబున, మణిదీపికావళిమాడ్కిఁ దనరి
మహిసూరినరపాలమానసాంభోధికి, బాడబంబో యనుపగిది వెలసి
తత్ప్రియాన్యతుమాధవశుష్కవనులకు, దావపావకమనుదారి నెగడి
త్రిపురదైతేయహరణసంకుపితనిటల, నయన నయన నట[illegible]నంజయజయావ
హంబు శ్రీవిజయరఘునాథావనీంద్రు, సత్ప్రతాపంబు గనుపట్టు సంతతంబు. 26

తే. దక్షిణామూర్తిసేవానిచక్షణుండు, సంతతాద్వైతవేదాంతసక్తచిత్తుఁ
డతడు తద్గర్భజలధిహిమాంశుఁ డీవు, రాయరఘునాథనృపచంద్ర రణమృగేంద్ర. 27

ఉ. శ్రీరఘునాథరాయనృపశేఖర నీదుకరాసి భీమకా
ళోరగతుల్య మౌటను రణోర్విని దుర్మదమత్తచిత్తులౌ
వీరులప్రాణవాయువులు పీల్చుట యుక్త మిదెంతవింత య
య్యారె సముద్రమయ్యును రవంతయు భంగముఁ గాంచ దెప్పుడున్. 28

చ. కడెములు బాహుపుర్లు పతకంబులు పోఁగులజోడు లుంగరా
లడుగఁగ వచ్చు భూషణము లౌటఁ దదంగము లిమ్మటంచుఁ గో
రెడిభవదీయసాయక మరిప్రతతిన్ ఘనమార్గణాళి కీ
నడతలు యుక్త మౌనె రఘునాథమహీప దిలీపవిక్రమా. 29

ఉ. శ్రీరమణీమణీచరణశింజసమంజసరత్నపుంజమం
జీరనినాదవద్గృహవిశేషుఁడ వౌచు సపుత్త్రపౌత్త్రకన్
ధారుణి నేలు సౌభరివిధమ్మున సర్వమహీపతుల్ నినున్
సారెకుఁ గొల్చు లీల రఘునాథనృపాల విశాలవైభవా. 30

మ. హృదయావాలముచక్కి భక్తిరసవారిన్ జ్ఞానబీజంబులో
నుదయం బంది ప్రరూఢపాద మగుచున్ గోకర్ణనాథాభిధ
త్రిదశానోకహసంగతిన్ దనరుచున్ శ్రీమద్బృహన్నాయికా
ఖ్యఁ దగున్ గల్పకవల్లి రాయరఘునాథాధీశునిం బ్రోవుతన్. 31

వ. అని తలంచి నాకార్యంబు నాశీర్వాదపూర్వకంబుగా నెరవేర్చి మహారాజనియుక్త
ప్రకారంబున. 32

## షష్ఠ్యంతములు,

క. శ్రీపతిముఖనిఖిలశుభ, ప్రాపకసంభాషణునకు వరాంతర్లోక
ప్రేమపదాటోపకథా, లాపభిదారోషణునకుఁ గళాభూషణునన్. 33

క. శరణాగతహృదయతమ, స్తరణికి సంసారజలధితరణికి దైతో
త్కరశిక్షణసురరక్షణ, కరవీక్షణఘృణికిఁ జంద్రికాసమఘృణికిన్. 34

క. శ్రీమత్సుగంధికబరీ, కామికిని మునీంద్రహృదయగామికిని క్షమా
భూమికిని మాతృభూత, స్వామికిని నమస్కరించి సద్భక్తి మెయిన్. 35

వ. అంకితంబుగా నాయొనర్పం బూనినయాంధ్రభాషార్ణవం బనుమహాకృతికి సందర్భం
బనినంత స్సకలాంతర్వ్యాప్తికగావునఁ బ్రత్యక్షం బయి యెట్టులని యడిగినట్టులతోఁచె
వినుము వివరించెద. 36

ఆంధ్రభాషార్ణవము.

ప్రథమ కాండము.

స్వర్గవర్గము.

సీ. కట్టులయెకిమీఁడు గన్నవాల్గంటిని, జెట్టపట్టుక యేలినట్టిదిట్ట
మున్నీటిరాచూలిముక్కఁ గెంజడలోనఁ, గ్రొవ్విరిగాఁ దాల్చుకొన్న మేటి
గబ్బుచెంకమెకంబు గట్టికళవసఁబు, కుబుసంబుగాఁ జేసికొన్నదంట
ప్రాఁబల్కుగుబ్బముల్ పన్ని సిస్తగునట్టి, పుడమితేరెక్కినపోటుగాఁడు
జమునతుఁడు బూచులదొర జంగమయ్య, మినుసికాఁగలాఁడు ముక్కంటి యనఁగ నిట్లు
యౌగికంబులు భవదాఖ్య లలరి యుండు, ధాతృనుతపదజలజాత మాతృభూత. 37

క. వెన్నుండు కట్టినెచ్చెలి, క్రొన్ననవిలుకానితండ్రి గుడుసుటడిదపుఱ్
మన్నెదొర లచ్చిమగఁ డన, నన్నలినాక్షునకుఁ బేరు లగును మహేశా. 38

ఆ. పలుకువెలఁదిమగఁడు బంగారుకడుపువాఁ, డంచతేజి నెక్కునట్టిరౌతు
బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగినుఁ, డనఁగ బ్రహ్మపేరు లబ్జమౌళి. 39

ఆ. గట్లఱేనిబిడ్డ కఱకంఠునిల్లాలు, కొదమసింగ మెక్కుకొన్నజంత
సత్తి సామితల్లి చండి యమ్మిక దుగ్గ, యనఁగ నీసెలంత యలరు నభవ. 40

క. వలరాజుతల్లి కలుముల, చెలి కలువలఱేనితోఁడు సిరి లచ్చి యనన్
వెలయును లక్ష్మీనామ, మ్ములి వెల్లను జూడఁ జంద్రభూషితచూడా. 41

క. పలుకుఁజెలి లచ్చికోడలు, కలనితబిసితల్లి తూఁటిగాసపుఁదేజీ
గలబోటి యనఁగ భాషా, జలజాక్షికిఁ బేరు లౌ నిశాకరభూషా. 42

తే. గుజ్జువేలుపు పిళ్ళారి కొక్కురౌతు, బొజ్జదేవర యేనుఁగుమొగముసామి
పనిచెఱుపువాఁడు వెనకయ్య యన వినాయ, కునకుఁ బేళ్ళొప్పును సుగంధికుంతలేశ.

చ. కొమరుఁడు సామి కొంచమలగొట్టినజాణఁడు విప్పుగన్నమొ
త్తముపడవాలు ముద్దుగలతల్లులబిడ్డఁడు తీఁగపేరిక
ల్కమగఁడు టెల్లుచూలి నెమిలింబయికొన్నమనీఁడు బారకే
ళ్ళమరినవాఁడు నా నగు గుహాఖ్యలు శ్రీత్రిశిరఃపురీశ్వరా. 44

సీ. కండచక్కెరదిండికత్తలానివజీరుఁ, డలరువిల్కాఁడు పూవులవిలుతుఁడు
చెఱకువిల్కాఁడు క్రొంజిగురులవిల్కాఁడు, తలిరువిల్తుండు కన్నులవిలుతుఁడు
పచ్చవిల్తుఁడు చావంచతూఁపులజోదు, కమ్మవిల్కాఁడు డెందమ్ము చూలి
తియ్యవిల్తుఁడు గాలితేరెక్కుమన్నీఁడు, చక్కెరవిల్కాఁడు చక్కనయ్య
తుంటవిల్కాఁడు మరుఁ డించువింటివాఁడు, దీఁగవిలుకాఁడు వలరాజు తేఁటియల్లె
వింటిదొర నెలయల్లుఁడు వెడవిలుతుఁడు, నాఁగ మరునాఖ్య లగు శేషనాగభూష.

క. కరిజేజెయన్న విసుప్రోల్, దొర చౌదంతియెకిమీఁడు తు రపుదొర కు-
బ్బురవుతు వేగంటి యనన్, సురనాథునిపేళ్లు చెల్లు సూర్యశతంసా. 46

క. దుగమోములయ్యా వేల్పుల, మొగ మంటనివేల్పు మబ్బువూనిసు వనంగాఁ
దగు నగ్ని దేవతాఖ్యలు, నగజాచిత్తాబ్జతోష నాగవిభూషా. 47

తే. అగ్గియనఁగి త్తనంగఁ జిచ్చనఁగ వెలయుఁ, జేతనాచేతనాగ్ని నీర్చిచ్చనంగఁ
బొలుచు బడబాగ్ని బూది విబూదియనఁగ, భూతి దనరారు శ్రీమాతృభూతలింగ.

తే. వెలిమ్మడియు ననఁగా భస్మభేద మెసఁగుఁ, గందు నారాట మారట కాక పరుగు
డుడుకు సెగ తెర్లు నాఁగఁ జెస్నొందుఁ దాప, మునకు నామంబులైమాతృభూతలింగ.

తే. జముఁడు గుదెదాల్పు పోతుగుఱ్ఱముగలాఁడు
దక్కినపుఱేఁడన యమాఖ్య దనరుఁ బొలసు
దిండి రక్కసి రాతిరిఁ దిరుగుమేటి
యనఁగ నైరృతి దగు నుమాప్రాణనాథ. 50

తే. వానవెచ్చెలి పడమటివంకఱేఁడు, వల్లెత్రాడు గలాఁ, డన వరుణుఁ డొప్పు
లిబ్బిదొర జక్కులకుఱేఁడు గిబ్బరౌతు, సకుఁడు వానిఁ డనంగ నీసఖుఁడు శర్వ.

తే. లచ్చిదొరబూరగొమ్ము వలమురి యనఁగఁ, బాంచజన్యంబు దనరు వేయంచులలుగు
చుట్టుకైదువు గుడుసువా ల్పొడియడిదము, బటువుకత్తి నాఁ జక్రవాానిటలనయన.

క. గరుటాలువుంతుఁ డనఁగను, గరుడి యనన్ బొల్లిసెమ్మొగముపిట్ట యనన్
గరుటామంతుం డనఁగను, గరుడునిపే ళ్ళొప్పుఁ జాలఁ గంఠేకాలా. 53

క. శూలము వెలయును ముమ్మొన, వాలనఁ దెలిగిబ్బ యనఁగఁ బరఁగుచు నుండున్
శూలధరుఁ డెక్కువృషభము, శీలవదాశయనివేశ చెప్పందీశా. 54

క. తనరును వేల్పులయి ల్లనఁ, గసు వేవన్నెలపసిండిగ ట్టనఁగా మే
రునగము దగుఁ దెలియే అన, వినువాఁ కన సౌరగంగ వృషభతురంగా. 55

తే. దైవతమదావళంబు చాదంతి యనఁగఁ, దెల్ల యేనుఁగు నాగను దేజరిల్లు
దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి, నిక్కుచీనుల జక్కి నా నీలకంఠ. 56

క. వెలిగిడ్డి వింటిపసి వెలి, కిలఁబడుతొడు కనఁగఁ బరఁగు ఖేచరగవియా
వులమాను తెల్లమా ననఁ, జెలఁగును గల్పకసమాఖ్య చెప్పందీశా. 57

క. తలఁపురతనం బనన్ జే, జెలమానిక మనఁగ వెలయుఁ జింతామణి వే
ల్పులకూ డన నమృతాభిధ, చెలఁగును సద్గుణనివేశ చెప్పందీశా. 58

తే. గాడ్పు కరువలి వినుచూలి గాలి వలపు, మోపరి చిలువమేఁ తనఁ బొలుచుఁ బవనుఁ
డెసఁగుఁ దెమ్మెర యనఁగఁ బయ్యెర యనంగ, మందమారుతసంజ్ఞలు మాతృభూత.

తే. ఊఁదయున్న నీఁదర యనంగ నెసఁగు శీత, వాయు వూపిరి యూర్పు నా శ్వాస మలరు
నొప్పు నది దీర్ఘమైన నిట్టూర్పనంగ,నధిక మగునది రోఁజు రొ ప్పనఁ దగు హర.

తే. ఉసులు నాఁగను బ్రాణాఖ్య యొప్పుచుండు, నదియ యొకచోట జీవాఖ్య యై చెలంగు
నాయురభిధానముగ నదె యలరుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 61

సురలకు వేల్పులు జేజేల్, తెలుగంటులు బాసవాలుదిట్ట లనం బే
ర్మీర వగు సురవేశ్యల క, చ్చర లనఁ బేళ్లొప్పు బాలచంద్రవతంసా. 62

ఆ. సొలసుదిండ్లు రక్కసులు తొలివేలుపు, లనఁగ నసురసంజ్ఞ లలరు బూచి
గామిసోఁకు సత్తి గాలి దయ్యము బూత, మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ. 63

తే. నీటిదయ్యంబు నెగడునా నివ్వటిల్లు, బొమ్మరక్కసి యనఁగను బొలుచు బ్రహ్మ
రాక్షసుని పేరుగాఁ బోతురా జనుగతిఁ, దద్విశేషంబు లై కొన్ని తనరు నభవ. 64

తే. ఉద్దవిడి యురవడి హుటాహుటి చుఱు కన, జఱజఱన దడదడనఁగఁ జెఱచెఱ యనఁ
దీవరము సుళ్వు వైళము తివురు తివుట, వేగిరము తుఱు తన శీఘ్రము మా గిరీశ. 65

తే. పరఁగును సతంబు నిచ్చ లప్పసము నిచ్చ, యనఁగ మిక్కిలి మిక్కుటం బగ్గలంబు
ఔట్టు నిబ్బరము దిటము బిట్టు గాట, మనఁగ నతిశయ మగును సూర్యావతంస. 66

తే. కలిమి సిరి పదవి యనఁగఁ జెలఁగు భూతి, పొలుచు నిక్షేపనామంబు పూడు పనఁగఁ
దనరు లిబ్బి యనంగ నిధానసంజ్ఞ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 67

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ స్వర్గవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 68

---

## వ్యోమ వర్గము.

ఆ. చదలు నింగి యాకసము మబ్బుత్రోవ యు, ప్పరము విన్ను మిన్ను బయలు వెన్ను
నడుగు రిక్కదారి యన నభం బై తగు, ఖ్యాతగుణసమేత మాతృభూత. 69

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ వ్యోమవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 70

---

## దిగ్వర్గము.

సీ. ఆస యంచనఁ గడ యంచన దెస యనఁ, దేజరిల్లుచు నుండు దిక్సమాఖ్య
తూరు పనంగను దొలిదెస యనఁగను, బ్రాగ్దిశసంజ్ఞ యై పరఁగుచుండుఁ
దనరు దక్షిణసంజ్ఞ దక్కినం బన వల, కడ యనఁ బ్రత్యక్కు పడమర యన
నడరు నుదక్కు డాకడ యన మిసిల్లు, నటి యన వెలయు నభ్యంతరంబు

మాలయనరోకయనఁగోణమొప్పు మొయిలు, మొగులు మబ్బన మేఘాఖ్యలగును మోడ
మనఁగ మందార మనఁగ మేఘావృతి దగుఁ బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

క. మెఱుఁ గన మెఱు పన మించనఁ, బరఁగును విద్యుత్తు స్తనితవాచక మౌఁగా
యుఱు మనఁగ నశనిఁ బిడు గం, ధురుఁ కొర డన రోహితంబు దోఁచుఁ బురారీ.

క. ఆడెలన నాగడప లన, నాడెబ లన మొగిలుదొంతి కలరును జేళ్ళ
మూఁడును వడగం డ్లంచును, వాడుదురు కవు ల్కరకల వాగీశనుతా. 73

క. వఱ పన నవగ్రహంబై, పరఁగు సురేంద్రధను రాఖ్య భాసిల్లుచునుం
డు రతనపువి ల్లనంగను, స్ఫురితగుణావేశ మాతృభూతమహేశా. 74

సీ. వాన యనంగను వర్షాఖ్య యగు నది, విడువక పట్టిన జడి యనఁ దగుఁ
బసపస యను నది ముసు రనంగను మీఱు, నల్పవర్షము సోన యనఁగఁ దనరుఁ
దూర జల్లనఁగను ధారాభిధానమౌఁ, దనువైన నదియనూచిను కనఁదగు
జలబిందునామంబు వెలయు బొట్టు లనఁ దుంపర లన నల్పశీకరము లెసఁగుఁ
దుట్రయన మంచుఁ బోలిన తూఱవాన, వాన వెలిసియుఁ జూరునఁ బడిననీరు
బొట్లు వంగుళ్లు నాఁగ నట్లొట్లు నాఁగఁ, బేరులు వహించు నౌర కర్పూరగౌర. 75

తే. అడ్డి యడ్డము మూయి కప్పడ్డపాటు, పఱుఁగు చాటోల మోలిమి మాటు మూఁత
యనఁగ వ్యవధానమౌఁగడియన గడెంబు, నాఁగను ఘటాదికపిధానమౌ గిరీశ. 76

చ. నెల రెయివెల్గు చెంగలువనెచ్చెలి వెన్నెలగుత్తి చందు జా
బిలి చలివెల్గు చందురుఁడు వెన్నెలరాయఁడు చందమామ రే
పొలఁతిమగండు వేలుపులబోనము పుట్టుకచల్వజోతి చు
క్కలదొర లచ్చితోఁ నెడమక న్ననఁ జంద్రుఁ డగు న్మహేశ్వరా. 77

తే. బిల్ల బిల్లిక యనఁగను బింబ మొప్పు. సగము సాఁబాలు సావాలు సవము సా వ
ర యనఁగాను సమాంశంబు ప్రణుతి కెక్కు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

ఆ. తోఁచు శకలసంజ్ఞ తునక తుండెము తుండె, తుండు తుంట పఱియ తునియ ముక్క
వ్రయ్య వ్రక్క వ్రప్ప బ్రద్ద బ్రద్దర పత్రి, యన సుగంధికుంత లాంబికేశ.

సీ. వెన్నెల *రేయెండ యన్నఁ జంద్రిక యొప్పు, దగు సుషమాభిద జిగి యనంగ
సిరి చెల్వు చెలువము చెన్ను సొం పొప్పు, సోయగము చాయ యనంగ నలరుఁ గాంతి
తే టనఁ దే టన మీఱుఁ బ్రసన్నత, గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె
లక్కనం బనఁగఁ గళం కానవా లడియాలమై బచ్చెన యనఁగఁ జిహ్న

---

*ప్రాచీనప్రబంధములందు రేయెండపదము బాలాతపార్థమున నే చూపట్టుచున్నది.

మలరు మం చనఁగాఁ దుషారాఖ్య చెలఁగు, జల్లన యిఁకం బిగం బీము చలిమిరి చలి
జలుబు సీ తివతాళింపు చలువ యినక, యనఁగ శీతంబు గుణి గుణాఖ్యలఁ దగు హర.
తే. చాయ పెనిమిటి జముతండ్రి జగము కన్ను, తమ్మిచుట్టము మినురతనమ్ము ప్రొద్దు
ప్రాఁబలుకు టెంకి పచ్చగుఱ్ఱములరౌతు, వేవెలుం గన సూర్యుఁడౌ విధువతంస. 81
సీ. పరివేషనామంబు భాసిల్లుచుండును, గుడి యనఁ బరిదినా గుడుసు నాఁగ
మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ, గిరణనామంబు లై కెరలుచుండు
మెఱుఁగు డా ల్మెఱుఁ గనఁ బరఁగును బ్రభ, తగు దురవలోక్యప్రభ మిఱిమిడి యన
వెలయుఁ బ్రకాశంబు వెలుఁగు జోతి యనంగ నది మించునైన జగ్గనఁగ నొప్పు
నాతపాభిధ యెండ యం చనఁగ నెసఁగు, నలర నీరెండ యీరెండ యనఁగఁ గించి
దాతపం బగు మృగతృష్ణ లగుచునుండు, నెండమావు లనంగ బాలేందుమౌళి. 82
ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన, నుష్ణసంజ్ఞ దగుఁ గదుష్ణనామ
మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన సుగంధికుంతలాంబికేశ. 83
తే. కఱు కనంగను రుట మనఁ జూఱు కనంగఁ, దీండ్రమన్నఁ దీండ్ర యనఁగను దీక్ష్ణనామ
ధేయములు గాను జగతిని దేజరిల్లు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 84
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగను దిగ్వర్గ మిట్లు
నైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 85

---

## కాల వర్గము.

సీ. తటి తతి పదను హదను సావి యదను నాఁ, గాలాభిధానంబు గాఁ జెలంగు
నాయతి కారు కందాయ మనంగ జ్యే, ష్ఠాదిమాసచతుష్టయంబు దనరుఁ
గారు చిత్తడి తొలికారు తొలికరి నా, వర్షర్తుసంజ్ఞయై పరఁగుచుండు
మంచుకా రనఁగ హేమంతర్తు దగు, శిశిరర్తు వౌను జలికా రని యనంగ
నామని యనంగను వసంత మలరుచుండు, వెలయు గ్రీష్మర్తు వేసవి వేసఁగి యనఁ
గవిజనదయాంతరంగ పుంగవతురంగ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 86
తే. ఉమ్మలిక యుమ్మలిం పుబ్బ నుమ్మ యుక్క,యుమ్మదం బావి యావిరి యుమ్మలిక య
నంగ నూష్మాఖ్యలౌ నూట నా ద్రవోష్మ, పొలుచును వినంగ శ్రీమాతృభూతలింగ.
తే. ప్రతిపదాదితిథుల్ నాల్గు పాడ్యమి విడి, య తదియ చవుతి యనఁగఁ జెన్నలరుచుండు
బారసి యనంగ ద్వాదశి పరఁగు బూదె, యనఁ జతుర్దశి వెలయు సూర్యావతంస.
తే. పున్నమ యనంగఁ బూర్ణిమ పొలిచియుండు, నమవస యమాస యం చన నలరియుండు
దర్శనామంబుగాఁ బ్రమథాధినేత, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 89

తే. ఒద్దనఁగ నాఁ డనంగను బ్రొద్దు నాఁగఁ, బొదలుచుండును దినము నాఁటిది యనంగ
దినభవముపేరు గాఁగను దేజరిల్లు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 90

క. ఎల్లి యన రే పనం దగు, నెల్లికి నావలిది వెలయు నెల్లుండియు నా
నెల్లుండి కవలి దావలి, యెల్లుండి యనంగఁ దనరు నిందువతంసా. 91

క. నిన్నన మొన్నన నావలి, మొన్ననఁ బ్రకృతతిథియందు మూఁడు వరుసగా
నెన్నఁగ సరిపడి వచ్చును, బన్నగకృతహార భక్తభావ్యశరీరా. 92

తే. పగ లనంగను బవ లనఁ బరఁగు నహము, పట్టపగ లన మధ్యాహ్నవాచక మగు
నాహ్నికాభిధ పగటిది యనఁగ నొప్పు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 93

సీ. సంధ్య యొప్పుచునుండు సం జనఁ బూఁ టనఁ, బుంటయంచనఁగఁబురంట యనఁగ
సాయంసమాఖ్యమై చనుచుండు మా పన, మునిమా పనఁ బ్రదోష మొప్పుచుండు
రెయి రేయి రాతిరి రేతి రనంగను, రజని పొల్చును నడిరాతిరి యన
నడిరేయి యనఁగఁ గాందారి మాందారిప్రా, ద్దన సరిప్రొద్దన నర్ధమురెయి
యన నిశీథాఖ్య దగుఁ బ్రభాతాఖ్య దనరు, వేకువ యనంగ వేపినా వేగు నాఁగఁ
దెల్లవాఱఁగ ననుమాట తేజరిల్లు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 94

తే. గడె గడియనాఁగ ఘటికయౌ నడరు జాము, నాఁగ యామము దగునెలనాఁగమాస
మెసఁగు వత్సర మేఁడాది యేఁడు నాఁగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 95

తే. నిరుడు నాఁగఁ బరుత్సంజ్ఞ పరఁగుచుండు, మీఁఱు మున్నేఁడు నాఁగఁ బరారినామ
మలరు నియ్యేఁడునా నైషమాఖ్య మగుచు, నాద్యసమమగు నేఁడునా నబ్దమాడ.

తే. అన్యదినసంజ్ఞ యొక్కనాఁ డనఁగ వెలయు, దానిమును వెన్కదినములుదనరునుదొలి
నాఁ డనంగను మఱునాఁ డనంగ వరుస, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 97

సీ. ధుమగతి కేతునా ధూమకేతువు దోఁచు, వెలయుఁ బ్రదుంగు డనంగఁ బ్రళయసంజ్ఞ
దోస మనంగను దొసఁగు దొసంగునాఁ, గసటునాఁ బాపంబుగాఁ దనర్చు
దమ్మ మం చనఁగను ధర్మంబు విలసిల్లు, హర్షాభిధ చెలంగు నరుస మనఁగ
సంతసమం చన సంతోసమం చన, నలరు సంతోషంబు వెలయు సుగము
హాయి సుకము సుమాళమం చనఁగసుఖము, క్షేమ మగు లగ్గ లెస్స మే ల్సేమ మనఁగ
సకినమనఁగను విలసిల్లు శకునసంజ్ఞ, గొన మనంగను గుణముగాఁ దనరు నభవ. 98

తే. చేటు చేట్పాటు గీడ్పాటు చెట్ట కీడు, సేగి చెడిది సిలుగునాఁగఁ జెలఁగు నశుభ
మలరుఁ గట్టిఁడి బవిసి దమ్ముష్మ్ము బైసి, కట్టడి యనంగ నియతిగాఁ గాలకంఠ. 99

ఆ. ఒప్పువాప్పుదయసంజ్ఞ యుల్లంబు మది డెంద, మెడఁద యెడ్ద యాద యెదమనసనఁ
బుట్టు పుట్టువ యనఁ బొలుచు జన్మము సుహృ,ద్దయము నెమ్మదియనఁదగు మహేశ.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగఁ గాలవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 101

---

## ధీ వర్గము.

తే. బుద్ధియం చన వెలయును బుద్ధిసంజ్ఞ, తెలివి యనఁగ నెఱుక యనఁ దెలివిడి యనఁ
బరఁగు జ్ఞానంబు వగపన వగయనఁ దల, పోఁత యనఁ జింత యగు మాతృభూతలింగ.
సీ. అతివిచారణసంజ్ఞ యలరు నెవ్వగ యన, ననుమాన మొప్పగు నంచన యనఁ
దారకాణ యనంగఁ దనరుఁ బ్రమాణంబు, తరకటిం పనఁగను దర్క మెసఁగు
సందియమం చన సందేహమై తోఁచు, బరఁగు సంకేతంబు బస యనంగ
దిట్టమం చనఁగఁ గన్నట్టి నిర్ణయముగ, బవిరి బమ్మెర యన భ్రాంతి చెలఁగుఁ
బంత మనఁగను బద్ధు నాఁ బ్రతిన యనఁగ, నలరును బ్రతిజ్ఞవిన్నాణ మనఁగ నేరు
పనఁగ విలసిల్లు విజ్ఞానమగు నెఱుంగ, మి యన నజ్ఞానమద్భుతమిహిరభూప. 103
సీ. ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు, మేకోలు సమకోలు మేము డొడఁబ
డిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు, సమ్మతిపేరు గోచరము వెలయు
నగ్గమం చనఁగను నగపా టనంగను, గోచరత్వంబుగాఁ దోఁచియుండు
నొగ రనఁ దొగ రనఁ దగును గషాయంబు, చనుఁ దీపు తియ్యన యన మధురము
లవణ మి ప్పుప్పన యనఁ జెలంగుఁ గాటు, కార మొట్టోట్టన యనంగఁ గటువు వెలయు
నమ్లరుఁ దిక్తము చేఁదన నామ మొప్పుఁ, బులుసు పుల్లన యన మాతృభూతలింగ.
క. ఉప్పిడి యనఁ జప్పిడి యనఁ, జప్పన యన నలవణాఖ్య చను రసనామం
బొప్పుఁ జవి చవు రనంగఁ గ, కుప్పాలక భావ్యదేహ గోపతివాహ. 105
ఆ. కంపు గబ్బు గవులు గందంబు వల పన, గంధ మొప్పు సురభి కమ్మన యన
నడరుఁదావి యనఁగ నామోదమై తోఁచుఁ, గలుము నాఁగఁ గలుషగంధి మభవ.
ఆ. వెగటు వేదు నాఁగ వికటగంధం బొప్పుఁ, బుస్తు బూజు నాఁగఁ బూతిగంధ
మలరు గదుర నాఁగ నగును విస్రాఖ్యయై, మహితగుణసమేత మాతృభూత. 107
సీ. వన్నె వన్నియ యన వర్ణంబు విలసిల్లుఁ, దెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల
వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు, చామనచాయ నా శ్యామ మొప్పుఁ
గటి కట్టి కాటియ కటియ నల్లన నల్పు, కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ
వర్ణంబు పచ్చన పచ్చ పసిమి నాఁగఁ, బీతవర్ణం బగు వెలయు నళిది
యన హరిద్రాభపాటలాఖ్యలు చెలంగుఁ, బల్ల యనఁ బస్సెయనఁగను బయ్యెరయనఁగఁ
గావి జా జెఱ్ఱన యెఱుపు జేవురు తొవ, రనఁగ రక్తాఖ్య వెలయు నూర్యావతంస.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగను దీర్ఘ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 109

---

## వాగ్వర్గము.

తే. వాణినా భాషయా నలువమ్మ తెనుఁగు, కన్నడంబన మఱి యిట్లు కొన్ని దేశ
భాషలై యొప్పుఁ గలదనాఁ బలుకు నాఁగఁ, బొల్చు భాషితమై మాతృభూతలింగ.

సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు, నొడి నొడికారము నొడుగు నాఁగఁ
బద మొవ్వ మాటన వాక్యమై యెసఁగు వా, కొనుటయం చనఁగ వాక్రుచ్చుట యన
వచనంబు విలసిల్లుఁ బలుకరింత, యనంగ వాచకసంజ్ఞయై వఱలుచుండు
మినుకు నాఁగను సూక్తి దనరును జదువునా, విద్యాభిధానంబు వెలయుచుండుఁ
బ్రాఁజదువు ప్రామిఱుకు నాఁగఁ బరఁగు వేద, మట్టునఁ గాండసంజ్ఞయై యలరుచుండుఁ
బన్న మనఁ బ్రశ్నమై తగుఁ బనసి యనఁగఁ, బొల్చును దదంశమై మాతృభూతలింగ.

సీ. వక్కాణ వక్కణ వైన మనంగను, వ్యాఖ్యానసంజ్ఞయై వఱలుచుంగుఁ
గత యన కథతోఁచు గాథయౌ జోలినాఁ, గబ్బ మనంగను గావ్య మెసఁగుఁ
సందర్భసంజ్ఞయై చనును గైకట్టన, సమసక మన సమాసంబు చెలఁగు
నానుడి నాఁగను నానుడీ నాఁగను, సుబ్బు నాఁగను జనశ్రుతి దనర్చుఁ
బొలుచుఁ దద్భేదమై పొక్కు పోవడి యన, వార్త సుద్ది యనంగను బరఁగుచుండుఁ
బేరునా నామ మలరును బిలుపు చీరు, డనఁగ నాహ్వాన మమరు సూర్యావతంస.

సీ. పేర్కొనుట యనంగ వెలయు నామగ్రహ, ణంబు వాదనఁగ వాదంబు చెలఁగు
వావా దనంగను బరఁగు నుపన్యాస, మెత్తు జిత్తనఁగ నింపెసఁగు యుక్తి
మందటు యనఁగను మందలింపనఁగను, వ్యవహారసంజ్ఞయై పరఁగుచుండుఁ
జాటువ యనఁగను జను నుదాహరణంబు, తిట్టునా శాపంబు తేజరిల్లు
నొట్టు నాఁగను శపథాఖ్య యొప్పుచుండు, దీవన యనంగ నాశీస్సుగా వెలుంగు
నడుగుట యనంగఁ బ్రశ్నయై యలరుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ.

సీ. మాఱుమా టనఁగను మఱుమాట యనఁగను, బదులుమా టనఁ బ్రతివాక్య మొప్పు
మిథ్యాభియోగంబు మీఱును వఱు కనఁ, బొలుచుఁ బ్రణాదంబు బొబ్బరింత
యనఁగ బొబ్బట్టు నాఁగను బొబ్బ యనఁగను, యశము విరాజిల్లు నసమునంగ
నగ్గింపనం గొనియాడుట యనఁగను, గైవార మనఁగఁ బొగడ్త యనఁగఁ
బొగడితయనంగఁ బొగడునాఁ బొగడికయన, మెప్పునా మెచ్చునాఁగను మీఱువినుతి
గోసన యనంగ గోసునా ఘోషణ మగుఁ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

సీ. రట్టు రట్టడి రవ్వ రద్ది ర ద్దుప్పత, రంతు గోహారు గోరపన వెలయు
నాఘోషణసమాఖ్య యాడిక యేవ మీ, సడ మీసడింపు తెగడు తెగడిక
యాఱడి యవసడి యగ డౌరు దూఱు దూ, ఱు దిసంతు సడి రోయి రోఁత రోచ్చ
సేగింపు సెగ్గము సెగ్గవగింపు నా, నపవాదసంజ్ఞలై యలరుచుండు
మొఱ్ఱయన మొఱయనఁగ వాపోక యనఁగఁ, గూయి నాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు
గొసరు నా ననులాప ముల్లసిలుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 115

సీ. రోఁజుసు రొంజుడు రొడ్డుడు రొండుడు, రొల్లుడు రజ్జు ప్రేలుడు పలుము ప
లవరింపు పైజు ప్రల్లదము వదరు వదా, వళి బజారము నాఁగఁ జెలఁగనోఁ బ్ర
లాపాభిధ బతిమాలడ మన మిడు కన, వన రన వస పన వనట యనఁగ
వాచారపం బన వాచరం బనఁగను, దేవురిం పనఁగను దేవు రనఁగఁ
బరఁగుఁ బరిదేవనము కచ్చె పగటు కంట, సమ్ము నాఁగను విప్రలాపమ్ము చెలఁగు
నటమట యనంగ నపలాప మలరుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

సీ. తనరు దెల్పనఁగఁ గృతప్రశంసాభిధఁ, మెసగెఁ గుసగుస ముచ్చట యన
సల్లాపసంజ్ఞలై యుల్లసిల్లుచునుండు, నెగ్గునా రుశతి పేరెసఁగుచుండు
సాంత్వనసంజ్ఞమై చనుఁ దీయ మనఁగను, నిష్టోక్తి భాసిల్లు నిచ్చక మనఁ
గరుకు కరుసు కారు కారొడ్డెము పరుసు, పరుసన యనఁగ నిష్ఠురము వెలయుఁ
దొచ్చెము తుటార మనఁగను దుచ్ఛవచన, మొప్పు గెంటిస మన స్ఖలితోక్తి సంజ్ఞ
ద్రాబా యనఁగ నసారోక్తి దనరుచుండుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

సీ. ఒడ్డారమం చన నొరగొడ్డె మనఁగను, సడుగునా వక్రోక్తి యడరుచుండుఁ
జతురోక్తిసంజ్ఞమై చనుఁ జదురం చనఁ, ద్వరితోక్తి వెలయును బదర నంగ
గ్రచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు, సోల్లుంఠనం బొప్పు నుల్లస మన
బూతు నా బూమె నా బూకనా బూటక, మ్మనఁగను లెడబ మనఁగఁ గొడిమె
యనఁగను నబద్ధసంజ్ఞమై యలరుచుండు నిజ మనఁగ నిక్కువం బన నిక్కమనఁగ
నేటు నాఁగను సత్యంబు నెగడుచుండు, మాతృభూత జగత్త్రయీమాతృభూత.

ఆ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల, డబ్బు తక్కుటక్కు ఠవళి తవళి
తసుకు నసుకు దుద్దు తటవట ఠవఠవ, సట హుళిక్కి నా నసత్య మభవ. 119

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగను వాగ్వర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 120

## శబ్దాదివర్గము.

సీ. మ్రోఁత నాదు రవళి మ్రోఁగుడు వాఁగుడు, స ద్దులి వలికిడి చప్పు డలుక
డనఁగ శబ్దం బొప్పు నతిదారుణధ్వని, యంపన అంత్రన అంపి యనఁగఁ
గ్రందన విలసిల్లు గలకలధ్వని దోఁచు, నలబలం బన హాళాహళి యనంగ
గొల్లన గొల్లకన గెల్లన రొద యనఁ, దనరు దిముకునా మృదంగరవము
వెలయు నార్తారవంబు గీపెట్టు నాఁగఁ, గంతనినదాఖ్య మెలుఁగు నాఁగను జెలంగు
నదియ సూక్ష్మతరంబు గా సైనఁ బరఁగు, నీరెలుం గటం చనఁగ బాలేందుమౌళి. 121

సీ. ఆర్తకంఠరవాఖ్య యలరు నేడు పనంగ వెలయు ఖేదధ్వని ములుగు నాఁగ
గగ్గునా వెలయు గద్గదిక డగ్గుత్తిక, యనఁగ గద్గదకంఠ మలరుచుండుఁ
దత్సాధుకృద్ధ్వని దనరును గ్రేటన, యంకెనా వృషభవిరావ మొప్పు
నఱపు నాఁగఁ బశుకంఠారవంబు చెలంగు, శునకారవము మొఱుగనఁ దనర్చు
నూళ యన జంబుకధ్వని యొప్పు నీల, యనఁగఁ దస్కరసంకేతనినద మెసఁగు
జలవిహ్వతికాలశబ్దంబు వెఱయు నోల, యనఁ బ్రతిధ్వనిము బ్రోఁత యనఁదగు భవ.

తే. పాట యనఁగను గానాఖ్య పరఁగుచుండు, నాలతి యనంగ నాలప్తి యలరుచుండుఁ
దద్విశేషాభిధానముల్ దనరు నేల, జోల సువ్వాల యనఁగను సోమభూష. 123

క. చరచర యన బిరబిర యన, జరజర యన నిట్లు కొన్ని శబ్దానుకృతుల్
పరఁగుచు నుండును జగతిని, స్ఫురితగుణావేశ మాతృభూతమహేశా. 124

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగుచుండును శబ్దాదివర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 125

---

## నాట్యవర్గము.

సీ. వీణె వీణియ యన వీణాఖ్య రాజిల్లు, వాయింపు వా దన వాదన మగుఁ
గొడుపునా విలసిల్లుఁ గోణాభిధానమై, యొళవు నాఁగఁ బ్రవాళ మొప్పుచుండుఁ
గలివెయం చనఁగను గకుభంబు విలసిల్లుఁ, దంతి యనంగను దంత్రి వెలయు
నలరును గుబ్బకాయయన నలాబువు, బవిసిన మనఁగఁ దద్బంధన మగుఁ
బరగు నుపవాహ నామంబు బిరడ యనఁగ, సారె మెట్లన సోపానసంజ్ఞ దనరు
మేరు వనఁగను విలసిల్లు మేరుసంజ్ఞ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 126

సీ. దండె దగ్గడియ యన దండవాద్యం బొప్పు, దంబురా యనఁగను దుంబుర దగు
డక్క డక్కి యనంగ ఢక్క విరాజిల్లు, నావజం బన నొప్పు నావజంబు

డవిణ యం చనఁగ నల్లసిలు డిండిమసంజ్ఞ, డమరుగం బనఁగను డమరు వెసఁగుఁ
దమ్మటం బనఁగను దమటం బనంగను దమతాభిధానంబు దనరుచుండుఁ
దుదు మనంగను దముకునా గిడ్డియ యనఁగ, నరగజం బనఁ దద్భేదనామము లగు
డోలు నాఁగను విలసిల్లు డోలపేరు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 127

సీ. డుబుడక్క యనఁగ బుడుబుడుక్క యనఁగ హు, డుకునాఁ దనర్చు హుడుక్క పేరు
గుమ్మెత యనఁగను గుంభవాద్యము దోఁచు, మద్దెల యనఁ దగు మర్దళంబు
జమిళిగ యం చన యమళిక విలసిల్లుఁ, బంబ యం చనఁగను బణవ మెసఁగుఁ
బరఁగుచునుండు డంగుర మన రుంజనా, వీరాణ మనఁగను వీరణంబు
కవడె యన నురుమ యనఁగఁ గరిదియనఁగఁ, దప్పెటయనంగవాద్యభేదములు చెలఁగుఁ
దనరుఁ జుయ్యంకి కైముడి యనఁగఁ దాళ, ముజ్జ్వలతరాంగ శ్రీమాతృభూతలింగ.

సీ. చిటితాళ మనఁగను జెంగునా జేగంట, యన వాద్యభేదంబు లలరుచుండుఁ
గాళె కాళె యనంగఁ గాహళి విలసిల్లు, బూరుగ యం చన బూరువనఁగఁ
గాహళీభేదముల్ గ్రాలుఁ బిల్లనగ్రోవి, వాసెగ్రో లనఁగను వంశనాళ
మలరు నాగస్వరం బగు నాగసర మన, గంట యనంగను ఘంట యొప్పు
నుతియనఁగఁ దిత్తియనఁగను శ్రుతిదనర్చు, నాటకత్తెయనంగను నాటరియనఁ
బాతర యనంగ నర్తకి పరఁగుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 129

సీ. ఆటయం చనఁగ నాట్యం బొప్పుఁ గోలాట, మనఁగ హల్లీసకం బలరుచుండు
నాట్యభేదంబుల నామము ల్దనరు జక్కిణి గుజరాతి పేరణు లనంగఁ
గంటయం చనఁగను గట్టర మనఁగను, నాట్యబంధం బొప్పు నాట్యయోగ్య
శబ్దసంతతి పేరఁ జను జతులం చన, సుగ్గళిం పనఁగఁ దదుక్తి వెలయుఁ
గోపు లన సాము లనఁ దీరుకు లన వెలయు, నాట్యగతిభేదములపేళ్లు నాగవాస
మనఁగ భోగపుచెలువగుం పైనమేళ, జతకుఁ బేరై చెలఁగును జంద్రచూడ. 130

సీ. మాతంగనాట్యనామం బగుఁ జిందునా, దరు వనంగను ధ్రువ దనరుచుండు
గరగరిక యన సింగార మనంగను, శృంగారనామంబు చెలఁగుచుండు
బీర మనంగను వీరము విలసిల్లు, నక్కటికం బన నక్కస మన
నిబ్బరిక మనఁ గనికరంబనంగను, గారుణ్యసంజ్ఞ యై మీఱుచుండు
నగవు నవ్వు కేరింతనాఁ దగును హాస, ముఱితినగ వన లేనగ వన ముసిముసి
నగ వన ముసినగ వనఁ జిర్నగ వన నెల, నగ వన స్మితంబు రాజిల్లు నాగభూష. 131

సీ. వెక్కురు నాఁగను వికృతంబు విలసిల్లు, నాశ్చర్యసంజ్ఞ యై యలరు సోద్య
మచ్చెరు వక్కజ మబ్బురపాటు బ్రబ, మరు దరిది వెగడు వెఱగు సోద్దె

ము తటకాపాటునాఁ బొలుపారుచుండును, నిర్భరాశ్చర్యంబు నివ్వెఱనఁగ
ఘోరాభిధానంబు గోర మనంగను, బెట్టిదం బనఁగను వెలయుచుండు
గోరగింత యనంగను ఘోరత దగు, సిగ్గనా లజ్జ యనఁగను సిబ్బితి యన
నాన యనఁ బుచ్చడీ కనఁగాను లజ్జ బొలుచుఁగడధర్మియానొక్కపొంతనభవ.

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు, జళుకు జంకెన జంకు జడుపు జాలి
పుయిలోటు జలదరింపు దిగులు వెఱ పఱ్ఱు, వెఱ యుత్తలము బీతు బెదరు బెగ్గి
లుటు యంజిక యుదిల యటన నధృతి యగు, ముఖభీతి దగు మొగమోటనంగ
నద రన భయచలనాఖ్యలై విలసిల్లు, గరువము పొగరు కావరము గెబ్బ
ట్రుళ్ళు క్రొవ్వు తిమురు ట్రుక్కు మల్లరమ్మ,పోతరం బేపునా గర్వ మొప్పుచుండు
నాము నాఁగ విరాజిలు నాకరంబు,పుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 133

సీ. మన్నన మన్నిక మన్నింపనంగను, బహుమానసంజ్ఞ యై పరఁగుచుండు
నలు చన నెల్లిద మనఁ జౌక యనఁ దిర,స్కారంబు రాజిలు నోరు పనఁగ
సైరణ యనఁగను సైఁపు డనంగను, దాలిమి యనఁగను దాల్మి యనఁగఁ
దాళిక యన క్షాంతి దనరారు నోర్వమి, యన నీరసం బన నీరస యన
నీసునా నూదనాఁ దగు నీర్ష్య వేర, మనఁగఁ బగ టన నొంటమి యనఁ బగయన
నొప్పమి యనంగఁ గంటునా నొప్పు వైర, ముద్ధృతకురంగ శ్రీమాతృభూతలింగ. 134

సీ. ప్రతివైరనామంబు పరఁగు నూ డనఁగను, గరకరి చలము మచ్చర మనంగ
మాత్సర్యసంజ్ఞలై మనుఁ జుమ్మకుడ జాలి, చూపరుక స్తినా శోక మొప్పఁ
గన లన బైడాల మనఁగను గను పనఁ, గినుక యనంగను గిన్క యనఁగ
నలుక యనంగఁ జిం దనఁగఁ గాంతాళ మ్మ,నఁగ రోస మనఁగఁ జిందఱ యనంగఁ
గన రనంగను గస రనఁ దనరుఁ గోప, మదియె చుఱుకైన రవరవ యనఁగ వెలయుఁ
బ్రణయకోపంబు పొలయల్కయనఁదనర్చు,మోఁడియనఁగోపమానంబుపొలుచు నభవ.

సీ. తనరు వేళాకోళ మనఁగఁ ద్రిక్క యనంగ, రిమ్మ యనంగను రింబ యనఁగ
వెఱ్ఱి యనంగను బిచ్చి యనంగ ను,న్మాద మనంగ నున్మాదసంజ్ఞ
యాలుడి యనఁగను శీలంబు విలసిల్లు, బత్తి యనంగను భక్తి చెలఁగు
నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన, రెలమి మే ల్కూరిమి చెలిమి యరితి
బాళి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ, బ్రేమ దోఁచును దీరని ప్రేమ యైన
మరులనఁగఁ జెల్లువలపునాఁబరఁగుచుండు, యువయువతిసంభృతప్రేమ యుగ్రమూర్తి.

సీ. అర్మిలి యంచన నరులు నా నర్లన, వాత్సల్యసంజ్ఞ యై పరఁగుచుండు
నిచ్చ కాయువు కోర్కి యేఁకట కోరిక, యాస ఘుంచనఁగఁ జెన్నలరుఁ గాంక్ష

యర్ధాశ విలసిల్లు నడియాస యనఁగను, నంగలార్పం చన నంగద యన
నెంజిలి యనఁగ మనికితం బనఁగఁ దుండుడు కనం దగు మనోవ్యథకు సమాఖ్య
తలఁ పనంగను స్మృతిపేరు దనరుచుండు, స్మృతివిశేషంబునా దెనాఁ జెలఁగు మఱపు
మఱపువ యనంగ విస్మృతి పరఁగుచుండు, నగ్గలిక యన నుత్కర యలరు నభవ.

సీ. హాళి జతన మన నడరు నుత్సాహంబు, కపటాఖ్య విలసిల్లు గబ్బిగారు
గబుసు కైపు కిటుకు కొడు డబ్బు కవుడు, డంబనంగ నపదేశంబు వెలయు
నెపము నెవ మనంగ నిష్కపటాభిధ, నిక్కపు డంచన నెగడుచుండు
నేమఱుపా టన నేమఱిక యన మోన మనఁ బరా కనఁ జనుఁ బ్రమాద
మెచ్చరిక యెచ్చరిం పేవ యేద పదిల, ము హావణిక పోణిమి యన నొప్పు నవధాన
మలరు వేడ్కన వేడుక యనఁగ వెంట, మనఁగను గుతూహలంబు సూర్యావతంస.

సీ. బిత్తరము కులుకు బెడకు వెళుకు గుసుపు గొనబు మురిపము మురువు సొగసు
నిక్క మిటారింపు నీటు మిటారము, టెక్కు తెక్కర మెప్పె టెక్కు టీకు
హూరఁగు చెన్నె పొర పొయ్యారము బులుపు, హొయలనఁగ విలాస మొప్పుచుండు
నవ్యయ మై యేతదర్థంబునందలి, లలి యన నొకశబ్ద మలరుచుండు
శ్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన, గేలియన మేలమన మందె మేల మనఁగ
నాట యనఁ ద్రస్తరి యనఁగ హాళి యనఁగఁ, బొలుచుఁ బరిహాసములుమాతృభూతలికఁ.

సీ. త్రుళ్ళాట గొండ్లినాఁ దోఁచును క్రీడాఖ్య, యదిమించఁ దగుఁ జెరలాట మనఁగఁ
జను సహక్రీడాఖ్య సయ్యాట మనఁగ సుయ్యాట యనంగ సైయాట యనఁగఁ
జెమరునాఁ జెమటనా స్వేదంబు విలసిల్లుఁ, బరఁగుఁ గ్గొం చనఁగను ముఱికి చెమట
తిచ్చపా టనఁగను తిచ్చనాఁ బ్రళయమౌ, నొప్పు సంభ్రమసంజ్ఞ యుత్తలంబు
తమకము తహతహ తమి తత్తఱము చిడిము, డి తరితీపు త్తలమ్ము చిడిముడిపాటు
నాఁగఁ దనరారు హిక్కకు నామ మగుచు, వెక్కనంగ వెక్కిలియనఁ వేదవేద్య.

సీ. పులక లనంగను బులకర మనఁగను, గగ్గు రనంగను గగు రనంగ
గరుదా ల్పనంగను బరఁగు రోమాంచంబు, గొఱలు రోదన మేడ్పు గోడునాఁగ
నావలింత యనంగ నావులింత యనంగ, జృంభణసంజ్ఞయై చెలఁగుచుండు
గాత్రవినామంబు గనుపట్టు నీల్గనఁ, దుమ్ము నా క్షుత్సంజ్ఞ దోఁచుచుండుఁ
జనుఁ బడక పవ్వళిం పనఁగను శయనము, నెగడుఁ గూర్కన నిదుర నా నిద్దురనఁగఁ
గరు కనఁగ నిద్ర తూఁగు తందర యనంగ, మనును నిద్రావిశేషంబు మాతృభూత.

సీ. గుఱక యనంగను గుఱుపెట్టనంగను, శోభిలుచుండును సుప్తరవము
కల యన స్వప్నాఖ్య వెలయు నిక్కలయన, నిశ్చయస్వప్నంబు నివ్వటిల్లుఁ

గలవరిం పనఁగను గలవరింత యనంగఁ, గలవర మనఁగను గళవళ మన
స్వప్నభాషణముగా జరుగుచుండును మేలుకొంట యనఁగ మేలుకంట యనఁగ
మేలుకాంచుట యనఁగను మెలఁకువయన, నుపవడమనంగ నవబోధ మొప్పు భ్రుకుటి
యలరు బొమముడి యన స్వభావాఖ్య చెలఁగు, స్వాజ మోజ యనంగను జంద్రచూడ.

సీ. జీరుకు నాఁగను జీరుకుపాటు నాఁ, దొట్రుపాటనఁగను దొట్రు నాఁగఁ
దొట్రిలుట యనంగఁ దొట్రుగిల్లుట యన, స్ఖలనసమాఖ్యయై వెలయుచుండు
జాఱుడు జరుగుడు జాఱుపుంజా, అన గళనంబు దనరును వలి వలిపిరి
వడఁ కనఁ గంపాఖ్య యడరును వడవడఁ, కన నతికంపంబు దనరుచుండుఁ
బరఁగుఁ బబ్బము పండుగ పండు వనఁగ, నుత్సవము తద్విశేషంబు లొప్పుఁ దేవ
తంతు సాకము సంపు జాతర కొలు వన, వెలయు సివమన దేవతావేశ మభవ. 143

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయు కతనఁ, బరఁగు శాశ్వతముగ నాట్యవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 144

---

## పాతాళభోగివర్గము.

సీ. పాతాళనామంబు పాఁపజగ మనంగ, నేలయడుగనంగ నెగడుచుండు
బిలనామధేయంబు బెల మనంగ సొరంగ, మనఁగ సొరంగయం చనఁగ నొప్పుఁ
దూము తూటనఁగను దూపర మనఁగను, దొండి నాఁ జిల్లినాఁ దొలి యనంగఁ
గన్న మనంగను గనుమ యనంగను, గ్రంత యనందగుఁ గందరంబు
సరియ యన గండి యనఁగను సరెయనంగ, బడిలియన దుంక మన రంధ్రమ్మడరు లాఁగ
బొఱియ బొత్తి కలుఁగు బొక్క బొంద యనఁగఁ, బొలుచు గర్తంబు శ్రీమాతృభూతలింగ.

సీ. గాతము గవి యన ఖాతంబు కంటకావరణఖాతము తగు వది యనంగ
లొట్టి లొటారము లొత్తయం చనఁగను, శోభిల్లుచుండును సుషిరసంజ్ఞ
చీఁకటి యిరులు నాఁ జెలువొందు సంధకారముపేరుగా నంధతమససంజ్ఞ
కటికిచీఁకటి యనఁగను దనరారును, జిమ్మచీఁకటి మునిచీఁకటి ముఱి
చీఁకటి మసక ముఱిముఱిచీఁకటి యన, నవతమసనామధేయ మై యలరుచుండు
నాగములపేరు వెలయును నాగు లనఁగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 146

సీ. తగు సిదరపుపెద్ద తడవులనిడుపడు, పాపఱేఁ డన శేషఫణికి సంజ్ఞ
కొండచిలువ యన గోనసం బగుఁ బెను, బాము నా నజగరాహ్వయము వెలయు
నీరుపా మనఁగను నీరుకట్టె యనంగ, జలభుజంగముపేరు చెలఁగును మను
దిండియం చనఁగను డుండుభం బగు నాగుఁ, బామనఁ ద్రాఁచన ఫణి దనర్చుఁ
జెల్లఁగు సర్పభేదంబులు జెట్టి పెంజ, ర పసిరికపా మనంగ క్షుద్రాహిసంజ్ఞ
తుట్టెపురువనిపల్లఁగఁ దోఁచియుండుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

సీ. పడగదాలు పసంగఁ బా మన విసదారి, యన గాలిదిండియనం చనఁగఁ జిలువ
యనఁగ సర్పసమాఖ్య లలరు నాహేయమౌఁ, బాముది యనగను బాఁపది యనఁ
గుప్పస మనఁగను గుబుసం బనంగను, గంచుకనామంబు గాఁ జెలంగుఁ
బడిగెనాఁ బడగనా స్ఫటి ధనగారు వి,సమునాఁగఁ జిలు మనఁ జను విషంబు
వ్యాళసంగ్రాహినామమై వఱలుఁ గార, డీఁ డనంగను బాములవాఁ డనంగ
గారడి యనంగ హస్తసంగతకురంగ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 148
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగుఁబోతాళపన్నగవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 149

---

## నరక వర్గము.

సీ. బిద్దె బిస్త యనంగ వెలయు దుర్గతి వంత, గాసి వెతౌరము కారియ వెత
బాలి నొగులు నొప్పి బాద నెగులు నొవ్వి, వందురు దురపిల్లు కొందలంబు
సలుపు నొవి యనంగఁ జను వ్యథయేపసా, నదనంబు దగుఁ గుక్కు డదుము డొత్త
డ ముత్తు నాఁ బీడనమ్ము విరాజిల్లు, వెట్టి యనంగను విష్టి దోఁచుఁ
జోద పల్లట వల్లట చోడువ బడ, ప యిడు మగబాటు బా మనఁ బరఁగుఁ గష్ట
మామనస్యంబు బిడ్డకు ట్టనఁ దగు దిను, కనఁగ గుదవేదనంబుగాఁ దనరు నభవ. 150
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు నిచ్చలును నరకవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 151

---

## వారి వర్గము.

క. వననిధి యొప్పును బ్రౌయే, అన మున్నీ రనఁగఁ గడలి యన సంద్ర మనం
గను బాలవెల్లి యనఁగా, వినఁబడు నౌ క్షీరజలధి వృషభతురంగా. 152
తే. మొగులువిరి నీరు నాఁగను దగు జలంబు, మీఱును హిమాంబుసంజ్ఞ పన్నీ రనంగఁ
పచనయోగ్యజలాభిధ పరఁగుచుండు, నెస రనంగ నఖాంకవక్రేందుచూడ. 153
సీ. కర డనఁ గడ లనఁ గర యనంగఁ దరంగ, యనఁ దరఁగయనంగ నల యనంగఁ
దెర యనంగను వీచి పరఁగును సుడి యన, నావర్తసంజ్ఞ యై యలరు బుగ్గ
యన బుద్బుదం బొప్పు మను బొట్లనఁగ బిందు,పరఁగు ఫేనము నుర్వు నురుఁ గనంగఁ
దూపరాణ పుటమ్ము తూ మొప్పరముజల, దారియం చనఁగను దనరును జల
నిర్గమము తన్ముఖంబున నీటితోడ్డ, వచ్చుతృణములఁ జొరనీనిపలక పేరు
లాఁపరా యంచు జనులు పల్కఁగను వెలయు,మాతృభూత జగత్త్రయీమాతృభూత.

సీ. తట్టిన దరి యనఁ దనరును దీరాఖ్య, దనరును బార మద్దరి యవతల
నాతల నావల నవ్వల నవ లన, మీఱుచునుండును బారసంజ్ఞ
యిద్దరి యీవల నివ్వల నివల నీ,తల నివతల యన నలరుచుండు
దీవి లంక యనంగ ద్వీపంబు సికతాఖ్య, యిసు మన నిసుక నా నెసఁగుచుండుఁ
దద్విశేషంబు నెరసునాఁ దనరు నసలు, రొచ్చు వండడు సుబ్బలి రొంపి బురద
యుమ్మలి యవుజు చవుడు నా నొప్పుఁ బంక, మార్యచిత్తరిరంస సూర్యావతంస.

ఆ. పఱవ పఱద వఱద పఱతి పఱత వఱ్ఱు, నాఁగ నిటు ప్రవాహనామ మొప్పు
వెల్లి వెల్లువ యన విలసిల్లు నధికప్ర, వాహనామముగఁ జెవందిలింగ. 156

సీ. ఓడ నావ యనంగ నొప్పుచుండుఁ దరణి, పడవయం చనఁగ నల్పతరణి దగుఁ
గల మనఁ బోతాఖ్య గనుపట్టుఁ బుట్టినా, నరిగోలునాఁ గోల మలరుచుండుఁ
దేపనాఁ దెప్పనాఁ దేటిక యనఁగను, బ్లవనామధేయంబు పరఁగుచుండు
నుడుపత యవసాదికోక్తిరై విలసిల్లుఁ, దొట్టినాఁ దొట్టునాఁ దొట్టువ యన
నబక యన నగప యనఁగ నభ్రిదోఁచు, ద్రోణియగు దోనె యనఁగను స్రోతమెసఁగు
జాలు నాఁగను విలసిల్లు గూడ యనఁగ, జలసముత్క్షేపపాత్రంబు చంద్రమౌళి.

సీ. మాలిమికాఁ డనఁ బీలికాఁ డన నోడ,వాఁ డన నావికాహ్వయము చెలఁగు
నచ్చిక మన నచ్చు మనఁ దేరినదియన, నలరుఁ బ్రసన్నాఖ్య కలఁత యనినఁ
గలఁగినది యనంగఁ గనుపట్టుఁ గలుషంబు, కాలుష్య మెసఁగును గలఁక యనఁగ
వెలయు లోఁ తనఁగ గంభీరము పల్లము, నవుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు
మెట్ట యన మిఱ్ఱు నాఁగను మొండు నాఁగఁ, దోఁచు నుత్తాననామంబు తూలికాఁడు
జాలరి యనంగఁ గైవర్తసంజ్ఞ పరఁగుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 158

సీ. వల యన జాలంబు పరఁగుఁ జాల యనంగఁ, దనరుచునుండుఁ దత్సదృశసంజ్ఞ
తద్భేద మొప్పు నూతనఁ గువేణి చెలంగుఁ, గొడిమె యం చనఁగను బడిశ మెసఁగు
గాలమం చనఁగను గనుపట్టు మీను మ,చ్చెము చేఁప యనఁగ మత్స్యము తనర్చు
చాఱ చోఁఱ యనఁగను బరఁగు రాజీవంబు, గెండె యం చనఁగను గండకంబు
తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝషము, వాలసిపమౌను వాలుగ వాలుగయన
శేడిస యనంగ గుల్మము వెలయుఁ బ్రోష్ఠ, మొట్టయనమీఱు శ్రీమాతృభూతలింగ.

సీ. కొఱ కొఱ్ఱ యనఁగను బరఁగుఁ బాఠీనంబు, జెల్ల యం చనఁగను జిమము వెలయు
నలరు రొయ్య యన క్షుద్రాండజనామమై, యులచనాఁ దిరికెనా మల గనంగ
బొమ్మిడాయ యనంగఁ బొలుపారుచుండును, మత్స్యభేదంబులు మఱియుఁ గొన్ని
యలరును శుష్కమత్స్యం బుప్పుచేఁపనా, వరుగుచేఁ పనఁ గరువా డనంగ

సెంద్రి యన సెంద్రికయనంగ సెంద్రకాయ, యనఁగఁగర్కటకాభిధయలరుచుండు
మొసలి యనఁగను మకరంబు బొలుచు మదన, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

సీ. తామె లనంగను దాఁబే లనఁగ నల్ల, దాసరిగాఁ డనఁ దగుఁ గమఠము
వెలయు జలూకాఖ్య జెలగయం చన నెట్ట్రియనఁగ మహీలత యలరుచుండు
మండూకనామంబు మనుఁ గప్పయం చన, శంఖము చిందము సంకు బూరి
కొ మ్మనఁ దనరారుఁ గొఱలును దక్షిణావర్తశంఖాభిధ వలమురి యన
క్షుద్రశంఖము దనరారు గుల్ల యనఁగఁ, గప్పచిప్ప యనంగను గాకిచిప్ప
యనఁగ జలశుక్తి దగు గవ్వ యనఁగ వెలయుఁ, చుండును వరాట మై బాలసోమభూప.

సీ. నీరుబెంకి యనంగ మీఱు జలాశయం, బడరును హ్రదసంజ్ఞ మడుఁ గనంగఁ
దనరును గాడియం చనఁగ నిపానంబు, చెలమనా నుపకూప మలరుచుండుఁ
గనుపట్టు నూయినాఁగను గూపసంజ్ఞ పేఁ, నాహంబు తాఁగాఁడి నాఁ జెలంగుఁ
గలుజు రాకట్టునాఁగను శిలాబద్ధమౌ, నెగ్గడుఁ బుష్కరిణి కోనే రరనగఁ
జెఱు వనంగఁ దటాకంబు గొఱలుచుండు, నలుగునా జలనిర్గమస్థలము వెలయుఁ
గుంట గుంట యనంగఁ బేర్కొనఁగవచ్చు, నల్ప మైనతటాక మార్యాసమేత. 162

సీ. తొట్టునాఁ దీగ నాఁ దోఁచుచుండుఁ దటాక, పూర్వదేశాభిధ పొలుచుఁ గొలను
కొలఁకు నాఁగ సరసి వెలయును మెచ్చనాఁ, బడియయం చనఁగను బడె యనంగఁ
బల్వలన్నామంబు బావి డిగ్గియ యన, నగు వాపి యావాల మలరుఁ బాది
యనఁగఁ గ్రీడాఖాత మై కనుపట్టుఁ గే,ళాకూళి యనఁగఁ గేళాకుళి యనఁ
జెలఁగు నే అన నది తద్విశేషసంజ్ఞ, యమరుఁ బెన్న యనంగను జమున యనఁగఁ
దనరు రే వన సలిలావతారమార్గ, ముద్ధృతకురంగ శ్రీమాతృభూతలింగ. 163

సీ. కయ్య కాలువ యనఁ గనుపట్టుఁ గుల్య కూడలి యనఁ దద్భేద మలరుచుండుఁ
దొగ తొవ కలువ నాఁ దోఁచు నుత్పలము తామర తమ్మి యనఁగఁ బద్మమ్ము చెలఁగుఁ
జెంగల్వ కెందొవ చెందొగ యనఁగను, హల్లకసంజ్ఞ యై యలరుచుండుఁ
గెందమ్మి చెందమ్మి కెందామర యన రక్తోత్పలసంజ్ఞ యై యొప్పుచుండుఁ
గైరవాభిధగాఁ దెల్లకల్వ యనఁగ, వెలయుఁ దెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి
తెల్లదమ్మి యనంగను దేజరిల్లుఁ, బుండరీకంబు శ్రీమాతృభూతలింగ. 164

సీ. నల్లగల్వ యనంగఁ జెల్లు నీలోత్పలం, బలరు నుత్పలభేద మల్లి యనఁగఁ
బ్రాచి నీరాకు నా వారిపర్ణి చెలంగు, నా చన శైవలనామ మెసఁగు
నంతరతామర యనఁగఁ దద్భేదమౌఁ, దోఁచు మృణాళంబు తూఁడు నాఁగఁ
గ్రోవి యనంగను గ్రోలునా నాళమౌఁ, దనరును దామరతంపర యనఁ

గమలషండంబు కేసరం బమరు నకరు, వనఁగ రేకన సంవర్తి కాఖ్య చెల్లఁ
బొలుచుఁ గర్ణిక దుద్దునా ముద్దె యనఁగఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగుశాశ్వతముగ వారివర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూతి జగత్త్రయీమాతృభూత. 166

శా. శ్రీకైలాసనివాస! వాసవనతాంఘ్రిద్వంద్వ! ద్వంద్వాదిమా
రీకారాంచితభావ! భావభవభూభృద్వజ్ర! వజ్రప్రభో
ద్రేకస్పర్ధివపుష్క! పుష్కలదయార్ద్రీభూత! భూతావనా
లోకాలోకహితప్రచారణ! రణాలోపస్ఫురన్మానసా. 167

చ. నిరతిశయైకభక్తిమదనీకరమాకర! మారమారకా
సరసముఖేందుకాంతిజితసారసవార! సవాసవాదిఖే
చరభుజగాలయాంత పృథుచాపకలాప కలాకలాపసుం
దర! కరుణాసుధాముదితదాసవనా! సవనావనాదరా. 168

గద్య. ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్ష సంప్రాప్తసర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వ
సామ్య తదితరసకలగుణనిరూపమ్య సేతుహిమాచలఖ్యాత వహాద్దండకవి బిరుద
ప్రశస్త సీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యాదిసకలగుణచిరత్నరత్నరత్నాకర
శ్రితజనశ్రీకర కోటిసమాఖ్య వంశ సుధాపయోధి రాకాశశాంక ఘంటికాతురగ నీలా
తపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరికాదినిఖిలబిరుదాంక, బృహ
దంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటచోళ
పాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథ సభాంకణ బిరు
దాయమాన ఆర్యనుతచర్య వేంకనార్యప్రణీతం బైనయాంధ్రభాషార్ణవంబునందుఁ
బ్రథమకాండము సంపూర్ణము.

# ఆంధ్రభాషార్ణవము.

## ద్వితీయ కాండము.

క. శ్రీరఘునాథాఖ్యాకమ, హీరమణమనోజ్ఞభృంగ హీరనిభాంగా
వారణదైత్యవిభంగా, భూరిగుణనివేశ మాతృభూతమహేశా. 1

క. ధరణి పుర శైల వన మృగ, నర వర్ణచతుష్కవర్గ నద్ధత నాచే
విరచిత మగు నీకాండము, స్ఫురితగుణనివేశ మాతృభూతమహేశా. 2

### భూ వ ర్గ ము.

ఆ. పుడమి నేల యనిన భూవాచకంబగుఁ, బొల మనంగ నూరిపొత్తు నేల
కృష్టభూమి వెలయు రేగడ రేవడ, యనఁగ విమలకీర్తి సాంబమూర్తి. 3

ఆ. గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లు, నువర తుస్సి నాఁగఁ దువరభూమి
విటిగినాఁగ స్ఫోటపృథివికి సంజ్ఞయౌ, జవను నా సమోర్వి సాంబమూర్తి. 4

సీ. మృత్తికాహ్వయము లౌ మిత్తికయం చన, మట్టియం చనఁగను మన్ననంగ,
శుద్ధమృత్తిక యొప్పు సుద్దయం చనమీఱు, బంకమన్ననఁగఁ గుంభకరమృత్తు
చౌడు కారపుమన్ను చవుడన నూషర,మృత్సంజ్ఞ దోఁచుఁ దత్పృథివిపేరు
లుప్పనఁ జౌడన నూసర యన నొప్పు, జేడెనా నమరుఁ బిచ్ఛిలధరిత్రి
ధరణి విస్తారనిమ్నమై తనరె నేని, బాడువ బడువ యనఁగను బరఁగుచుండు
మెట్ట మెరక యనంగను మెఱయుచుండు, స్థలికి సంజ్ఞలు మాతృభూతాభిధాన.

తే. పరఁగు నెద్దడి నేలన మరుధరిత్రి, కొఱఁకనంగను బీడునాఁ గొఱనఁగఁ
గంచె యన నప్రహతభూమి కాఖ్యలెసఁగుఁ, బడగ మడి యనఁగా నదీప్రాంతమభవ.

సీ. పాండవబీడునాఁ బరఁగుఁ జిరాప్రహతము పాడు నాఁగను దనరు నప్ర
హతవిశేషము జగంబన లోక మొప్పారు, నాణెమం చనఁగ దేశాహ్వయంబు
నాడునా జనపదనామధేయం బగు, సీమన దుర్గాధ్యభూమి వెలయు
వంటెమం చనఁగను వణితమం చనఁగను, సీమైకదేశమై చెలఁగుచుండు
మన్నెమన మండెమనఁగను మాడెమనఁగ, దుర్గమస్థలనామమై తోఁచుచుండు
నీరుముంపనఁ గ్రిగీనీరునేల యనఁగ, ఖ్యాతిగాంచు ననూపంబు మాతృభూత. 7

సీ. మొరప నేల యనంగ మొరసు నేల యనంగ, శర్కరిలావనీసంజ్ఞ వెలయు
గోష్ఠంబు దొడ్డినాఁ గొమరారుఁ బెంట నాఁ, బరఁగు గోష్ఠీనంబు పెఱగడయనఁ

బరిసరంబుగఁ దోఁచు వరసంది చేరువ, కట్ట కత్తువ కర గనిమ యనఁగ
సేతువిశేషంబు చెలఁగును మడువనాఁ, బుట్టన వల్మీక మొప్పుచుండుఁ
గోమ యనఁ దదగ్రభూమి యా మార్గంబు, తెరువు త్రోవ దారి తెన్ను సరవి
చనుప సడవ చొప్పు జాడ డొంక యనంగఁ, బొలుచుచుండు మాతృభూతలింగ.
సీ. బాట యనంగను బండిబాటనఁ దగు, ఘంటాపథము దోఁచుఁ గాలిత్రోవ
యన నేకపది గిన్యయన మొప్పు నరవ నా, నుపనిష్కరం బొప్పు నుక్కళి యనఁ
బరఁగు మెట్టనఁ గూఁతపట్టునేల యనంగఁ, గూడనేల యనంగఁ గ్రోశ మదియె
పరువునేల యటంచుఁ బలుకుదు రీకవు, లిరుపర్వు నేల ముప్పరువునేల
యనినఁ గ్రోశద్వయత్రయాఖ్యలు చెలంగు, నామడ యనంగ యోజనం బగును గనుమ
యనినఁ గాంతారమగు లవణాకరంబు, వెలయు నుప్పల మనఁగను వేదవేద్య. 9
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ భూమివర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 10

---

## పురవర్గము.

ఆ. ప్రోలు వీడు నాఁగఁ బురసంజ్ఞ లెయొప్పుఁ, గంచినాఁగ నోరుఁగల్లు నాఁగఁ
దిరిచనాపలి యనఁ బురవిశేషము లగు, వాడ యనఁగ వాటి వలలు నభవ. 11
సీ. అంగడి ఘలిగనా నాపణసంజ్ఞలౌ, బేట యం చనఁగను విపణి యొప్పు
రచ్చ నాఁ రథ్యయౌఁ బ్రాకార మగుఁ గోట, యన నుపసాలాఖ్య యగు నరాబు
వా వలలంగంబవ నలవరి నాఁవప్ర, మగును సాలావయవాఖ్య కొత్త
ళ మ్మన వరణశృంగ మ్మగుఁ గొమ్మ నాఁ, బ్రాచీనసంజ్ఞలు పరఁగుచుండు
వెలుగు కల్లి యనంగను నలవ యనిన, వల్లికాస్యూతవృతి భిత్తి పరఁగు గోడ
యనినఁ ద్వారముఖ్యకృతిభిత్తికాఖ్య చెల్లు, దడి తడిక తడు కనఁగను దతుశితు.
సీ. పారకటి యిడుపు నాఁ భాసఁగు ద్వారప్రాంత, కుడ్యము మదురు మగలనఁగుడ్య
పాలికయై యొప్పు భాసిల్లు గృహసంజ్ఞ, దీఘు దీమం బిల్లు గీ మనంగఁ
దావన తావనఁ దానకం బవ్వగము, దావలం బనఁగను దలముపేరు
లిరవు పట్టిమ్ము చోటిక్కువ నెల విక్క, నెప్పు కంగవ టెంకి నిట్ట యనఁగఁ
స్థాన మగునగ రనఁగ రాజగృహనామ, ధేయ మౌ రాణివాస మంతిపుర మనఁగ
నలరు శుద్ధాంత మట్టడి యనఁగ నట్ట, మలరుఁ దగు శాల కొట్టమం చనఁగ నభవ.
సీ. హజారము హజ్జార మనునివి రెండును, మోసాల మొగసాల మోసలనెడి
నివి మూఁడు నంస్థైదు నెసఁగును ముఖశాల, కలరుఁ ద్రిశాలాఖ్య యగును జేట

క్లొల్లా రనఁగఁ జుట్టుకొల్లారు నలుసాల, యనఁ జతుశ్శాలయా నల్పగృహము
కొంప లొంప నఁ దగు గుడిసె నా గుడుసు నా నీరెంపు వెలయుఁ గుటీరమునకు
నలకుటీరంబె యానేయ మైన నిలువ, గమన నిలువార మనఁగాను రహిఁ కెనెక్కు
జవికె యనఁ జవిర యనఁగఁ జెన్నుఁ జతుష్క, మాకుటి ల్లనఁ బర్ణగేహము దగు భవ.

సీ. బొమ్మరి ల్లనఁగను బుత్త్రికాగృహ మొప్పుఁ, గుంజంబు పొదరి ల్లనం జెలంగు
సజ్జార్మ మనఁగను సామజాగార మౌ, లాయ మం చన మందురాఖ్య వెలయుఁ
బండరువం చన బండారమం చన, బొక్కస మం చనఁ బొసఁగుచుండు
నల్లభాండాగార మలశిల్పశాలాఖ్య, దనరును డంకసాలనఁ గొటారు
కొట్ట మనిపల్కఁగాఁదగు గోష్ఠగృహము, ప్రపకు నభిధానమగుఁ జలిపందిరి యనఁ
బంది లనఁ బంది రనఁగను బరఁగుఁ గాయ, మానసంజ్ఞలు విఖ్యాతమాతృభూత.

సీ. చప్పరం బనఁగను జనుఁ గాయమానవి, శేషంబు కురుజునా స్థిరరథ మగు
దొరపా కనఁగను నోరపా కనఁగను, బాదలి యం చనఁ బరఁగుచుండు
భిత్త్యధఃకృతగృహాభిధ దేవళంబునా, దేవాలయాఖ్య యై తేజరిల్లు
గుడి కోవెల యనంగ నవరు వర్తులదీర్ఘ, దేవాలయము లల్ప దేవవసతి
చనును దద్దళె మనఁగ వాసగృహసంజ్ఞ, నటు యనఁగ నోవర యనఁగ నలరు సూతి
కాగృహాభిధ పురిటిల్లు నాఁగఁ దనరు, మండపం బన మంటపాహ్వయము మగు భవ.

సీ. హర్మ్యాఖ్య మిద్దెనా నలరు నట్టిక యన, మచ్చునా నల్పహర్మ్యంబు వెలయు
మే డన సజ్జ న మేలుమ చ్చనఁగను, నుప్పరిగన సౌధ మొప్పుచుండుఁ
గంకర బెందడి గార సోద యనంగ, లేపవిశేషమై తోఁపఁదగును
మాడుగు మాడువు మాలెయం చనఁగను, బ్రాసాదభేదమై పరఁగుచుండు
నేలమాలె నా భూమ్యంతరాలయమ్ము, దనరు సోరణగండి నాఁగను గవాక్ష
మగును లంకనఁగాఁ బ్రకోష్ఠాఖ్య మీలు, గడపయన దేహళీసంజ్ఞ యొదరు నభవ.

తే. సిగర మనఁగను విలసిల్లు శిఖరసంజ్ఞ, పొలుచు శిఖరపుఁగొన పేరు మోరునాఁగ
మూలకొత్తళములు చెల్లు బురుజు లనఁగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 18

క. పెర డనఁ బెడ లనఁ బెళ్ళనఁ, బరఁగున్ గృహపృష్ఠసీమ పంచ యన న్మొం
దిరనికట మొప్పు నంగణ, మెఱుఁగం దగు ముంగిలి యన నిందువతంసా. 19

సీ. దూలమం చన గృహస్థూలతిర్యగ్దారు, సంజ్ఞ యై విలసిల్లు స్తంభసంజ్ఞ
మనుచుండు రాడు కంబమ్మన మొగరాడు, మొగరంబు నాఁగను దగు నికేత
నాగ్రిమ స్తంభాఖ్య యాలయాధారదీర్ఘ స్తంభసంజ్ఞ నిట్రాడు నిట్ట
రా డనఁదగు ఛదిరాధార మగు నాస, మనఁగాను బెండె యం చనఁగ గేహ

తిర్యగాబద్ధదండంబు తేజరిల్లుఁ, జిలుకకొయ్యన వడెనాఁగ వెలఁగుచుండు
నాగదంతక మెలిసెనా నలరు భిత్తి, కాచ్ఛదిస్పందిసంజ్ఞయై యచ్ఛదేహ. 20

సీ. దోఁపుచూరనఁగను దోఁచు నంతచ్ఛది, కోణిగచూరనఁగ నగు న్వలీక
మలరుఁ దోవ యనంగ వలభి టంకనఁగను, దనరు విటంకంబు దారబంద
మన ద్వారబంధ మొప్పును దోరణ మనంగ, నవు బహిర్ద్వారంబు గవని గవిని
గవఁకు గవను నాఁగఁ దివురు గ్గోపురసంజ్ఞ, లరఁగరుఁ గన వేది యై తలిర్చు
దిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పుఁ, దలుపనఁ గవాట మౌ బోరుతలుపునాఁగ
దళయుగకవాటసంజ్ఞమై తనరు గంద, పట్టెనా స్కంధపట్టిక వఱలు నభవ. 21

సీ. రోలుమ్రా నుదుకనాఁ బోలుఁ గవాటమ్మూలాలవాలాభిద యర్గళాఖ్య
గడియనాఁ దగును బీగము తాళ మనఁగ న, యోమయార్గళవిశేషోక్తి యొప్పుఁ
దదవయవాఖ్యమై తనరు గొళ్లె మనంగఁ, దాఁప మెట్టిక తంతె తాఁపరంబు
పెట్టిక మెట్టనఁగను మెఱయు సౌపానంబు, నిశ్రేణి కాఖ్యయౌ నిచ్చెన యనఁ
బొరక చీఁపురుకట్ట చీఁపురనిపల్కఁ, దగును సమ్మార్జనికిని జెత్తనఁ జెదార
మనిన నవకర మొప్పును నలుకనంగ, నమరు నుపలేపకద్రవ్య మమరవంద్య. 22

సీ. కలువడంబు కలాపి కలయంపి చానపి, యన గోముఖాఖ్యలై యలరుచుండు
రంగవల్ల్యాఖ్యయై రాజిల్లు ముగ్గన, మొగవాళి మనఁగను దగును నిస్స
రణము మెల్లన నికర్షణ మొప్పు లోఁగిలి, యన వాస్తుసంజ్ఞయై తనరుచుండు
నూరు కుప్పము గ్రామ మొప్పు శూన్యగ్రామవాచకంబై యుండుఁ బాడనంగఁ
బల్లె యనఁ బల్లి యగును వ్రేపల్లె యనిన, గొల్లపల్లె యనంగను ఘోష మగును
గూడె మని గోడె మనియనుకొందు రార్య, లెల్లఁ బక్కణమునకు బాలేందుమౌళి.

క. పొలిమే రన గడి యనఁగాఁ, బొలిమెర యన వెల్ల యనఁగఁ బోలును సీమా
స్థలనామధేయములు ని, శ్చలతరసుఖకృతి త్రిశీర్షశైలాధిపతీ. 24

తే. అగడిత యగడ్త యనఁగ ఖేయంబు దనరు, మందుపట్టడపేరు చెన్నొందు బాణ
శాల యనఁగను దర్జీవిజనము వెలయు, నిమితగాం ధ్లనఁగా సుగంధికబరీశ. 25

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగఁ బురవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 26

---

## శైలవర్గము.

క. మెట్టనఁగొండన మల యన్నగ ట్టన గుబ్బలి యనంగఁ గరువ యనంగా
గుట్ట యనఁ దిప్ప యనఁగ, న్నట్టును శైలాఖ్య లార్యభావితచర్యా. 27

సీ. చుట్టుకొం డన మేరగ ట్టనఁ జక్రవా, ళాచలసంజ్ఞలై యలరుఁ బొడుపు
కొం డనఁ దూరుపుకొండ నా నుదయాద్రి, యమరు నస్తాద్రి పడమటికొండ
క్రౌంచకొండ యన నగు న్మంచుకొండనా, వలిమల యనఁగ గుబ్బలిదొర యనఁ
బ్రాలేయశైలంబు పరఁగుఁ గెవ్వపుఁగొండ్క తరిగట్టు నాఁగ మందరము వెలయు
ద్రోణపర్వత మొప్పు మందుమల యనఁగఁ, దనరు మడికాసుగట్టునాఁగను శివాద్రి
వింధ్యశైలాభిధాన మౌ వింజ మనఁగ, మాతృభూతేశ దుష్కృతమత్స్యదాశ. 28

సీ. రాయి కల్లనఁగ శిలాఖ్య యౌఁ జట్టన, ఝామనుగ్న శిల యొప్పుఁ జాఁపఱాయి
చలుప యం చనఁగను జనుఁ బత్తుహీనశి,లాఖ్య బం డన విశాలశిల యొప్పు
వర్తులశిలపేరు వటులు గుం డనఁగను, మొరప మనఁగను శర్కర దనర్చుఁ
బలుగురా యనఁగను బాండుశిలాఖ్య యౌ, బలపమం చనఁగను బెలఁగు ఖటిక
యిటుక యిట్టుక యిట్టిక యిటిక యనఁగ, నిష్టకం బొప్పు మిడుగుఱాయి యన సూది
రాయి యనఁగను గఠినశిలాఖ్య యెసఁగు, మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ.

సీ. శిఖరాఖ్య యొప్పును సిగరము గుబ్బ పే, టునఁ జఱి జఱియ పడకు పణ కన
నెగడుఁ బ్రపాతంబు నెత్తమం చన బ్రస్థ, మలరును సెల యన నడరు నంబు
జన్మదేశాఖ్య యుత్సాఖ్యయౌ నూ టన, బుగ్గయం చనఁగను మొగ్గ యనఁగఁ
నుత్సవిశేషమై యొనరును దొన యన, ద్రోణవాచకము గాఁ దోఁచుచుండుఁ
బాఱు డనఁగఁ బ్రవాహ మౌ వాఁక యనఁగ, వాఁ గనఁగ సెలయేఱు నా స్రవంతయనఁగ
నచలనదియొప్పుఁ గోనయం చనఁగ శైల, దీర్ఘకోణంబు విలసిల్లు దివ్యతేజ. 30

తే. గొంది యనఁగను గిర్యల్పకోణ మొప్పు, లోయయనలొద్దియనఁగఁ బొల్పొందుచుండు
నచలమధ్యధరాఖ్య వాయ యని పల్క, శైలవిశ్లిష్టభూమి యౌఁ జంద్రమౌళి. 31

తే. గని యనఁగ నాకరం బగు గైరికంబు, జేగుఱం చన విలసిల్లుఁ జెలఁగును గుహ
గవి యనఁగ జాజు జాదు నాఁగను దనర్చు, ధాతునామంబు మాతృభూతాభిధాన.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ శైలవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 33

---

## వనౌషధివర్గము

సీ. అడవి కాన యనంగ నటవి యై తగును బే,రడవి నాఁగను నరణ్యాని చెలఁగు
దోఁటయం చనఁగను దోఁచు గృహారామ, ముపవనసంజ్ఞయై యుండుఁ దోఁపు
నాఁగను బ్రమదవనాభిధయౌను సిం,గారఁపుఁదోఁటన బారు బంతి
పదుపు చాల్ చాలుపు పౌఁజు సారిది చాలు, నాఁగను బంక్తి నామ మగును

రేఁక యనఁగను రేఖయై రీతిగాంచు, గర యనఁగఁ దద్విశేష మై పరఁగుచుండు
దోర యన దొంతి యనఁగను దొంతర యనఁ,దనరు నుత్పంక్తి మాతృభూతాఖ్యలింగ.

సీ. మొలక మొలవ మొక్క మోక మో సీరిక, మొటిక నా నంకురం బొప్పుచుండు
నా అటం చనఁగను మీఱు వాప్యాలకురా,వల్లికోడ యనఁగను బొలుచుఁ దద్వి
శేషనామంబు తసి యన సడ యనఁగఁ, దన్నిరంతరపంక్తి దనరుచుండు
బ్రాఁకు బ్రా ననఁగ నమోకహసంజ్ఞయాఁ, జెట్టన నోషధి చెప్పఁబడును
బండినది యన ఫలిత మా వంధ్యసంజ్ఞ, యగును గొడ్డనఁ బుష్పితం బగును బూచి
న దనఁ గోరకితం బొప్పు ననిచిన దనఁ, జెలఁగుఁ బల్లవితము చిగిర్చిన దన భవ. 35

సీ. మోడు మో టనఁగ నొప్పును స్థాణునామంబు, గున్న యం చనఁగను క్షుపసమాఖ్య
పొద రీరము పొదనాఁ బొలుచు గుల్మాభిధ, తీఁగ తీవ యన లతిక దనర్చు
లతికావిశేషం బలసు నాఁగఁ జెన్నొందు, నలరు లతాప్రతానినియు జొంప
మనఁగఁ బొడవు పొడ గనఁగనుచ్ఛ్రాయమాఁ,బోల్పు కాండము మొద లొమ్మదనఁగను
బ్రగ్గ యనఁ బుంగ యనఁగను బరఁగుచుండు, స్కంధశాఖాఖ్య కొమ్మనఁగాను శాఖ
వెలయు మండ యనంగను వితతశాఖ, పరఁగును సుగంధి కుంతలాంబాసమేత. 36

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ సెలగ చివ్వ, చివక మల్లె జబర చివర సురిగ
బలుగు గోల బరగు సెల యన నుపశాఖ, చెలఁగు నూడ యనంగ శిఫ దనర్చుఁ
తల కొన మొన యన నలరు నగ్రాభిధ, వే రన దుం పన వెలయు మూల
మొనరుఁ జే గనఁ జేవ యనఁగ సారముపేరు, తొడు పట్ట తోలుక తోలు చెక్క
తొంట చెక్క తడప యంట త్వగాఖ్యయా, త్వగవయవము దనరు బరడు నాఁగఁ
బరఁగు నార యనిన వల్కలసంజ్ఞయై, మాతృభూత లోకమాతృభూత. 37

సీ. ముల వసి యనఁగను జెలఁగుఁ గంటకసంజ్ఞ, తొడుగట్టు యీడిక సుడుము కంప
యనఁ దనర్చును గంటకాదిభారము కట్టె, కట్టియ నాఁగను గాష్ఠ మొప్పుఁ
దనరుఁ గొయ్య యనంగ దారుసమాఖ్యయై, దుంగ యనంగను స్థూలదారు
ఖండంబు వెలయుఁ జెక్కనఁగఁ దద్దారుభే,దంబు పే డన సూక్ష్మదారుభేద
మగును జిదుగన సమిధాఖ్యయలరుఁ దొట్టి, తొట్రుతొఱ్ఱతొఱటయనఁదోఁచుఁగోట
రమ్మ గొల యనగాను వల్లరియొసంగుఁ, బత్తి రా కనఁ బర్ణమాఁ బార్వతీశ. 38

సీ. ఛదరజస్సంజ్ఞయా సద యనఁ జిగు రిగు,రు తలి రనంగ మీఱును గిసలయ
నామధేయము పై రనంగను బయిరు నా, ససి యనఁగాను సస్యము చెలంగుఁ
దొడిమె నా వృంతంబు దోఁచుఁ బండనఁగ ఫ,లం బొప్పుచుండు శలాటు వగును
గా యనఁ బిందనఁగాను బాలశలాటు,వు చను బూఁబిందె నాఁ బూప యనఁగఁ

ప్రబలు-నత్యంతబాలశలాటుసంజ్ఞ, మనును శుష్కశలాటునామంబు వట్టు
వరు గనంగను బీజాఖ్య పరఁగు విత్తు, విత్తనము గింజ గిజ రన వెలయు నీశ. 39

సీ. పేసె మనంగను బేసాఖ్య విలసిల్లుఁ, బసురు పస రనంగ స్వరస మొప్పుఁ
బసరుమొగ్గ యనంగఁ బసిమొగ్గ యనఁగను, క్షారకనామమై మీఱును నన
యనఁగను గోరకం బమరుఁ గుచ్ఛన గుత్తి, యన గువి యనఁగ గుచ్ఛాఖ్య దనరు
మొగ్గన మొగడన ముకుళంబు దగు నొప్పుఁ, బూ, పూవు పువ్వు పువు విర్వి యలరు
నా సుమం బగు బూఁదేనె నాఁగఁ బుష్ప, రసము పుష్పాడి యనఁగఁ బరాగ మొప్పు
నవితనిజదాస త్రిశిరఃపురాధివాస, మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ. 40

సీ. మొల్లలు మల్లెలు మొదలైనశబ్దము, ల్బహుతను దమదుపుష్పముల దెలుపు
జొన్నలు రాగులు మున్నగుశబ్దము, ల్బహుతను దమతమఫలము లగును
గంద పసుపు మొదల్గాఁగలయవి యేక,వచనమై నిజమూలవాచ్యము లగు
గంజాయి మొదలుగాఁ గలిగినయవియెల్లఁ, బత్త్రిసమాఖ్యలై పరఁగుచుండు
నంగు లగువృక్షములపేరు లంగములుగఁ, బత్త్రిఫలపుష్పములయందుఁ బరఁగుచుండు
నవలఁ జెప్పెద వృక్షభేదాఖ్య లెల్ల, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 41

సీ. రావియం చనఁ గుంజరాశన మగు గంగ, రావియం చనఁగను బ్రహ్మదారు
వెలఁగయం చనఁగఁ గపిత్థంబు చెలువగు, నత్తి మేడి యనంగ నవు నుదుంబ
రంబు కాకోదుంబరంబు మీఱును గాకి,మేడియం చన బొమ్మమేడి యనఁగఁ
గపురపుటనఁటి నాఁగాను సేధాకుల,యనఁటినా సప్తపర్ణాఖ్య దనరు
రేల యం చనఁ బరఁగు నారేవతంబు, నిమ్మయం చనఁగా జంభలమ్ము దోఁచు
నదియె గొప్పైన గజనిమ్మ యనఁగఁ దగును, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. వరుణనామము లులిమిరి యన మొగలింగ, నాఁగ నిసుక్రమాను నాఁగఁ దనరుఁ
బొన్నయం చనఁగను బున్నాగ మా సుర,పున్నాగ మా సురపొన్న యనఁగ
వారిజమం చన బారిజమం చనఁ, బారిభద్రాఖ్యమై మీఱు నెమ్మి
యన నేమిసంజ్ఞ యా నంబాళి మనఁగను, నామ్రాతకాఖ్యమై యలరు నిప్ప
యన మధూకంబు నీరిప్ప యన మధూల, కమగుఁ దగు గోను గోఁ గనఁగను కుపీలు
కందరాళము కొండగోఁ గనఁగఁ గొండ, గో ననఁగఁ బరఁగుఁ ద్రిశిరఃపుధరనిలయ.

సీ. ఊడుగు నాగను నొప్పు నంకోలంబు, నెగడుఁ గింశుకము మోదుగ యనంగఁ
బ్రబ్బ ప్రబ్బలి యనఁ బరఁగు వేతసనంజ్ఞ, శిగ్రువు మునగ నాఁ జెలఁగుచుండు
మధుశిగ్రునామమై మను నెఱ్ఱమునగ, తినయ్యమునగ యనఁగ గారమునగ యన
వనశిగ్రునామమై తనరుఁ గుంకు డనంగ, ఫేనిలసంజ్ఞ యా బిల్వసంజ్ఞ

పరఁగు మారే డనంగను బ్లక్షసంజ్ఞ, నివ్వటిలు జువ్వి యనఁ గలుజువ్వి యనఁగఁ
గూటపర్కాటియగును న్యగ్రోధ మగును, మఱ్ఱి యనఁగ జగన్నేత మాతృభూత.

సీ. లొద్దుగనాఁగను లోధ్రమహా మామిడి, మావి యనంగ నామ్ర మగుఁ దియ్య
మామిడి యన నెలమావి యన్నను సహకారనామంబుగా మీఱుచుండు
గుగ్గిలమం చన గుగ్గులువు దనర్చు, విరిగి యం చనఁగను వెలయు శేలు
క్షుద్రశేల్వాఖ్య యగును నక్కవిరిగినా, శ్రీపర్ణికాఖ్యయై చెలఁగు రేఁగ
నంగఁ గర్కంధువు దనర్చు గంగరేఁగ, నంగ లకుచాఖ్య కమ్మరే ననఁగ నక్క
రే ననఁగ వెలయును చురిమ్రాను వెలము, నాగ భవ మొప్పుచుండును నాగభూష.

సీ. ములువెలము యనంగఁ జెలఁగును స్వాదుకంటకనామధేయు మీఁడ యనఁ బరఁగు
నైరావతాభిధ నారద బ్బనఁగ నారంగాభిధాన మై ప్రబలుచుండు
నేరే డనంగను నేరె డనంగను, బంబూసమాఖ్యలై చనును గాకి
నేరే డనఁగ నక్కనేరే డనఁగ నేల,నేరే డనఁగ జన్నా రహిగను
భూజంబునామంబు పొల్చుఁ దిందుకసంజ్ఞఁ, దుమికి యనంగను దుమ్మిక యనఁ
బ్రక్కి ప్రక్కి యనం బిచులంబుదనరు, గుమ్మ డనఁగను గుముదికసమ్మతివడుఁ
గడిమి కడప యటం చనఁబడుఁ గదంబ, మడరు భల్లాతకియు జీడియన మహేశ.

సీ. చింత యనంగను జించయాఁ దత్ఫలైకాంశంబు గుడిసెయం చనఁగ వెలయుఁ
బిచ్చె యనంగఁ దద్బీజంబు విలసిల్లు, వేగి వేగినఁ యన వెలయుఁ బీత
సాలాఖ్యగా సాలసంజ్ఞగాఁ దగు నిను,మద్దియ నా నల్లమద్ది యనఁగఁ
బాలయం చనఁగను బరఁగును క్షీరికాహ్వయము గార యనంగ నలరు నింగు
దియు విరాజిలుఁ బూరణి తేజరిల్లు, బూరుగం చనఁగను గొండబూరుగయనఁ
గాను జనుఁ గూటశాల్మలి కానుగనఁగ, దనరును గరంజసంజ్ఞ యంధకవిరోధి,

సీ. నెమలియడ్గుమ్రాను నెమిలియం చనఁగను, బూతికరంజంబు పొల్చుఁ జంద్ర
యన ఖదిరం బొప్పు నరిమేద మలరును. దుమ్మయం చనఁ దెల్లతుమ్మ యనఁగ
విట్ఖదిరాఖ్యయై వెలయును గదరమహా, నుంద్రస యనఁగను నుంద్ర యనఁగ
నేరండనామమై మీఱు నాముద మన, జమ్మియం చనఁగను శమి దనర్చు
మంగ యనఁగను మదననామంబు చెలఁగు, దేవదారి యనంజను దేవదారు
పాటలి పొసంగుఁ గలిగొట్టు పాదిరి యన, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 48

సీ. కచ్చగ చ్చనఁ జెల్వుఁ గాంచుఁ గాచస్థాలి, ప్రేంకడ మనఁగను బ్రేంకణ మనఁ
దోఁచుఁ బ్రియంగువు దుందిల మనఁగను, దుండిక మనఁగను దుందుకమనఁ
బెద్దమ్రా ననఁగను బెనుమ్రా నన న్మహానింబనామములుగా నెగడుచుండు

శింశుపానామమై చెలఁగు నిరుగుడన, దిరిసెము గిరిసెము దిరిసెన మనఁ
జనును శిరీషాఖ్య సంపంగి సంపెఁగ, యనఁ జంపకాహ్వయ మౌను బొగడ
యనఁగ వకుళంబు దనరును నప్పృత మీఁఱు, నుసిరిక యటంచ నన్నెలయుసిరికయన
నలరు భూధాత్రి తాడియనన్ విభీత, కంబు విలసిల్లుచుండును సాంబమూర్తి. 49

సీ. కరకయంచనఁగను బరఁగు హారీతకి, యళడియంచనఁగను హాళది యనఁగ
సరళంబు చనుఁ బనస యనంగఁ బనస మౌ, వేమన నింబమై వెలయుచుండు
గరివేము నాఁగ నమరుఁ గృష్ణనింబము, నేలవేమనఁగ భూనింబ మొప్పు
దాడింబ యనఁగను దాడిమం బలరును, దర్కారి యొప్పును దక్కాలి యనఁ
దక్కడనఁ దక్కలయనంగఁ దక్కయనఁగ, నెల్లియననగ్నిమంథము నెగడుఁ గొడస
కొడిసె యనఁ గుటజం బగుఁ గొడిసెపాలు, నాఁగ నింద్రయవము దోఁచు నాగభూప.

సీ. పాలకొడిసె యనఁబడు శ్వేతకుటజంబు, కలివెనాఁ గృష్ణపాకఫల మమరుఁ
జీఁకటిమ్రానఁ జెలఁగుఁ దమాలంబు, వావిలి యన సిందువార మలరు
బందెడ యనఁ దెల్లవావిలి యన శ్వేత, సురసాభిధానమై పరఁగుచుండు
దావరడంగి నా దేవతాడన నేర, వకడయంచనఁగను వఱలు దేవ
తాళనామంబు మల్లెనాఁ దనరు మల్లి, యడవిమల్లె నా నాస్ఫోట యగును బొండు
మల్లె యనఁగ మహామల్లి మనును నిత్తె, మల్లెనా నిత్యమల్లియౌ మాతృభూత. 51

సీ. నాగమల్లె యనంగ నాగమల్లిక మీఱు, శ్రీహస్తినీసంజ్ఞ చెలఁగు గురుగు
నాగమొల్ల యనఁ గుందము చెలంగును యూధిక యమరు నడవిమొల్ల యన గురిజ
గురిగింజ నాఁగను గుంజాఖ్య విలసిల్లుఁ, దగును మాధవియు బండిగురువిందనంగఁ
గుబ్జంబు గొజ్జంగి గొజ్జెంగ నాఁ, జను జాజి యనఁగను జాతి వెలయు
మనును విరవాదియన నవమల్లికాఖ్య, వఱలుఁ జేమంతి యనఁగ సేమంతి మంకె
న యన బంధూక మగు దాసనం బటన్న, జపకుఁ బేరై తనర్చును జంద్రమౌళి. 52

సీ. మైద గోరంటనా మనుఁ గురంటకసంజ్ఞ, కొరవినాఁ గ్రోవినాఁ గ్రొమ్మినాఁగఁ
గురువకనామమౌఁ గరవీర మలరును, గన్నేరనంగను గన్నెరనఁగ
వెణుతురు నాఁగను వెలయుఁ గరీరంబు, మాదిఫలం బన మాతులుంగ
మొప్పు నుమ్మెత్తన నున్మత్త మలరును, బైఁడి యుమ్మెత్తనాఁ బరఁగుఁ గాంచ
నాహ్వయము మర్లుమాతంగినాఁగను మరు, లుమ్మెత యనంగ మదనాఖ్య యొనరు గన్నె
రయనఁ జెన్నారును గరింజరాభిధాన, మర్క మలరును జిల్లేడటన్న నభవ. 53

సీ. బదనిక వదనిక బవనిక యన వంద, చనుఁ దిప్పదీఁగె నాఁగను గుడూచి
చెలఁగును మోర్వాఖ్య యలరును జాఁగన, విసభ్రొద్ది యనఁగను వెలయుఁ బాఠ

మూలగొండి యనంగ దురదగొండి యనఁగఁ, దీఁటకోవెలయనఁ దేజరిల్లుఁ
గండూర కచ్ఛురాఖ్యగ విరాజిలుఁ దీఁట,కసివింద యన నెలుకచెవి యనఁగ
నెలుకజీడి యనంగను నెసఁగు జిత్ర, యొప్పుచుండు నపామార్గ ముత్తరేన
నంగ బారంగి గంటుబారంగియుఁ జెలు, తేఁకనఁగ భార్గి వెలయును ద్రిపురవైది.

సీ. కోలపొన్న యనంగఁ గొమరారుఁ బృశ్ని, పర్ణియుఁ గ్రోష్టుపుచ్ఛియౌ నేలపొన్న
నా నొక్కతోఁక పొన్ననఁ బొర్లుగాడినా, రోఁకఁటిబండ నారూఢి కెక్కుఁ
గారుగ చ్చనఁగను గ్రాలు వాకూచియుఁ, బల్లేరనశ్వదంష్ట్రి పరఁగుచుండుఁ
జెలుపాల యనఁగను క్షీరావి చెన్నొందుఁ, బిల్లపీఁచర యనఁ బీఁచర యనఁ
బ్రబలును శతావరి పసపు పసు పనంగ, వఱలును హరిద్ర వస యన వజ యనంగ
వచకుఁ బేరు చెలఁగు నతివస యనంగ, నతివిషాభిధ విలసిల్లు నంగజారి.

సీ. అడ్డసర మనంగ నటరూషనామమౌ, గింటెన యనఁగను దింటెన యన
గిరికర్ణి చెలువొందు క్షురము విరాజిల్లు, గొబ్బి యనంగను గొలిమిడి యనఁ
గోకిలాక్షము ములుగొలిమిడినా మీఱు, నలరు సదాపయం చన మధురిక
చెము డన జెము డనఁ జెలఁగు సింహుండము, ముత్తవయం చనఁ బోలును బల
నూనెముంత యనంగను నొప్పు గుచ్ఛ, బలయు జీబిలి కన నాగబల చెలంగుఁ
దడ యనఁగ ధన్వ మగు గ్రూబతడ నులితడ, యన మహాబల దనరు వృషాధిరూఢ.

సీ. గిలిగిలచెట్టునా గిలిగింతచెట్టునా, గిలిగిచ్చచెట్టన గిలకచెట్టి
టన్న ఘంటారవయౌను దాకన ద్రాక్ష, యగుఁ ద్రిపుట వెలయుఁ దెగడ యనిన
నెగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన, నోమమం చన దీప్య మొప్పుచుండు
నీరుపిప్పలియం చనిన బొక్కెన యనంగఁ, దోయపిప్పలిసంజ్ఞ దోఁచుచుండుఁ
జనుఁ గురాసానివోమమం చన యవాని, కాభిధ సుగంధి పాలయం చనిన దూడ
పాలయన గోపికాఖ్యమై పరఁగు మామె, న యన నుత్ఫుల్లశారిబాహ్వాయ మగు భవ.

సీ. అరఁటి యరం టంటి యనఁటి యనంటినాఁ, గదళికాహ్వాయము లై పొదలుచుండుఁ
దత్ఫలగుచ్ఛంబు దనరు నత్త మనంగఁ, జనును జీపనఁ దదంశాఖ్యగాను
బొందెయం చనఁగను బొల్చును గదళిత్వ, గంతర్గత శ్వేతకాండసంజ్ఞ
తత్కేసరాగ్రవృత్తాంశంబు గోరనఁ, దత్కేసరాంతర్గతాచ్ఛనూచి
కానిభాంశంబు ముచ్చనఁగాఁ జెలంగుఁ, బిల్లిపెస రనఁగాఁ గాకిపెస రనఁ దగుఁ
గాకముద్గాఖ్య తప్పెట కారుకొల్లి, మాడి యనఁగ వనకులుత్థ మగు మహేశ.

సీ. వరిగ యనంగను వార్తాకమై యొప్పు, నీరెత్తువంగ నా నీరువంగ
యనఁగను వృంతాక మలరుఁ గత్తెరవంగ, యనఁగఁ గర్తారిక దనరుచుండుఁ

దచ్ఛలాటువుఁ బల్కఁదగును వంకాయనాఁ, గంటకి చను ములుక యన నేరు
వంగనా బృహతియా వాఁకుడునాఁ బిన్న, ములకనాఁగను నేలములక యనఁగ
రామలకనాఁగ సర్పాక్షి ప్రబలు నల్ల, తెగడనాఁగఁ ద్రిపర్ణాఖ్య తెలియఁబడుచు
నుండు ముయ్యాకుపొన్నన నొప్పుఁ బ్రత్తి, యనఁగఁ గార్పాసి రజతగిర్యగ్రవాసి.

సీ: బీరన బీఱనా వెలయుఁ గోశాతకి, నేతిబీఱ యనంగ నెగడుచుండుఁ
దద్భేదనామంబు ధామార్గవం బొప్పు, నడవిబీఱ యనంగ నావడయనఁ
జేఁతిబీఱ యనంగఁ జెలఁగు బటోలము, పొట్లయం చనఁగను బొళ్ళ యనఁగఁ
జేఁతిపొట్ల యన భాసిలును దిక్తపటోల, మలరును దొండయం చనఁగఁ దుండి
కాకిదొండ యనంజను గాకబింబ తుర్యతుండి చెలఁగుఁ బిండిదొండ యనఁగ
నారుదొండ యనంబడు నార్తగళము, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 60

సీ. చెప్పుతట్టనఁగను జెలఁగు గోధాపది, నేలతాడియనంగ నెసఁగు ముసలి
దుట్టుపు దుట్టువు జుట్టు పనంగను, ద్వంద్వఫలాఖ్యయై తనరుచుండు
నెద్దునాలిక యయి యిరవొందు గోజిహ్వ, తాంబూలవల్లిక తమలపాకు
తీఁగెనాఁ జెన్నొందుఁ దెలియంగఁదగును నూ, దోస రేణుకలు కూఁతురుబుడమన
వాలుక మ్మగు హ్రీబేరవాచకముగఁ, బొసఁగుఁ గురువేరనంగ రాపూవనంగ
నశ్మపుష్పంబు వెలయును నందు గనఁగ, మురుమనఁగ హ్రాదినీసంజ్ఞ పరఁగు నభవ.

సీ. ఆరెపువ్వనఁగను నారెలనంగను, ధాతకీకుసుమంబు దనరుచుండు
నేలకియం చన నేలాభిధానము, రాకుసి చను బలురక్కసి యనఁ
బులిగోరుచెట్టన వెలయు వ్యాఘ్రనఖంబు, బెత్తమం చనఁగను వేత్ర మలరుఁ
బేముటం చనఁగఁ దద్భేదంబు విలసిల్లుఁ, జెలఁగు శంఖిని కట్లచెట్టనంగఁ
దొవరిప్రమా ననఁ దువరిక దోఁపఁబడును, గ్రంథిపర్ణంబు పొల్పగు గండివనము
నాఁగ నాగిని నావురు నాగురనఁగఁ, గేరుఁ దలపోటముగను దంగేఁడన భవ. 62

సీ. పెన్నేరనంగను బెన్నేరనంగను, దొమ్మడో లనఁగను దోఁచు నశ్వ
గంధ బలుసు కారకసివెంద యన నొప్పుఁ, గాసమర్దం బిందుగ యనఁ జిల్ల
యనఁ గతకం బగు నారుకాభిధ మీఁటు, నారు నాఁ దగు నుప్పి యనఁగ లవణి
సురిగి యం చనఁగ శిఖరిణికిఁ బేరౌను, జెలఁగు నతోశము చిలిమిడి యన
నుచ్చిఁత యనంగ శుండిక యొప్పు ముల్లు, ముస్తె ముల్లుచిఁత యనంగఁ బో లలర్కఁ
మలరు గొల్లె యనఁగ ఘంటాభిధాన, మురువృజినభంగ శ్రీమాతృభూతలింగ. 68

సీ. వాలుడనంగను వాతారి విలసిల్లు, గురుగటం చన్నను గురి యటన్న
ములుగటం చన్న నర్బుదఫలి మనుచుండు, నగిసె యటం చన్న నలరు నతసి

యొసఁగంగ క్షుమ యొప్పు నెట్టిగిసె యనంగ, బర్బర మలరు బొబ్బిలి యనంగఁ
బోనికయం చనఁదగు ముంజము కుమ్మర, పానిక నాఁగను గృష్ణముంజ మొప్పు
జీలుగ నఁగను దీర్ఘ యష్టిక దనర్చు, వనతువరి దోఁచుఁ గారుకం దనఁగ బెండ
యనఁగ గోజిహ్వ దగు ముండి యల్లరు బోడ, తర మనంగను గైలాసపురనివాస. 64

సీ. గవ్వగుత్తిక యన గవ్వగుత్తి యనంగఁ, జనుఁ గపోతాంఘ్రి దూసర యనంగ
దూతుమీఁగె యనంగ దుస్సర యనఁగ సుదర్శనలతపేరు దనరుచుండు
శరపుంఖినామమై పరఁగు వెంపలి యనఁ, దులసీసమాఖ్యయౌఁ దొలసి యనఁగ
గొండపిండి యనంగఁ బిండికొండ యనంగ, నగభేదసంజ్ఞగా నలరుచుండుఁ
బొదలుఁ బిండీతకమ్ము గాడిదగడపర, చాగరాడి వెలికి యటం చనఁ గుమారి
పరఁగుఁ గలుబంద యనఁగఁ బర్పాటకంబు, మనును బిచ్చుకకాలునా మాతృభూత.

సీ. పులుగు డనంగను బులిసరి యనఁగను, బాలకినీసంజ్ఞ పరఁగుచుండు
శీధ్రకనామంబు చెలఁగుఁ జిల్లనఁగను, దీంద్రయం చనఁగ నుద్వోజన మగు
వెలమసంది చివికివెల మనఁగాఁ గాక, జంఘాభిధానంబు చనును జిలుక
ముక్కునా శుకనాస పొలుపుఁగాంచును గుక్క, పాలన వటపత్రి పరఁగుచుండుఁ
దేలుమొనచెట్టనంగను దేలుకొండి, నాఁగ మను వృశ్చికాళ్యాఖ్య నాగిని యగు
గొల్లజడ్డనఁ గుండేటికొమ్మనంగఁ, బరఁగు శశశృంగనామంబు గరళకంఠ. 66

సీ. ఆకు పువ్వును గాయ యాదిగా నివి యెల్ల, గూరయం చనఁగను మీఱుచుండుఁ
బుట్టకొక్కనఁగను భూస్ఫోటసంజ్ఞయౌఁ, దనరుఁ జిట్టి యనంగఁ దండులీయ
మగు నీరుచిట్టినా నప్తండులీయంబు, చెలిమిడియనఁ దద్వి శేష మొప్పు
శంఖపుష్పకి పేరు చను మిత్త్రయం చన, వాయంట యనఁగ బర్బర చెలంగుఁ
గుక్కవాయంట నాఁగఁ బెంపెక్కు శ్వానఁ, బర్బరాభిధ మత్స్యాక్షి పరఁగుచుండు
బొన్నగంటి యనంగను బొద్ది యనఁగ, వృద్ధదారక మలరును వృద్ధవంద్య. 67

సీ. తనరు విశల్యమై తరిగొట్టి చెన్నుచె, లుకు పొత్తి నాఁగఁ గారుమిను మనఁగఁ
జను మాషపర్ణి చెంచలి యనఁగను విష్వక్సే మలరును సునిషణ్ణకాఖ్య దగును
బులిచింత యనఁగను బులిచెంచలియనంగ, నామ్లవేతసస్సంజ్ఞ యలరుఁ జుక్క
పుల్లప్రబ్బి యనంగ ముణుఁగుఁదామర నా మొగడుఁదామ రన నమస్కారి చెలఁగు
సంబరేనఁ జర్మకసంజ్ఞ యొప్పుఁ, బరఁగుఁ బెనుపాల యనఁ బిన్నపాలయం చ
టన్న జీవంతికయు దంతె యనఁగ దంతి, మనును దాసీకృతవిధాత మాతృభూత.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి, తామర యనఁ బచ్చతామర యన
నేలతామర యని నెగడు ద్రుమఘ్నంబు, తగిరిసె యనఁగను దనరు నెట్టి

యుల్లియం చనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు, వొప్పు లశునము వెల్లుల్లి యనఁగ
గలిజె రనంగను గలిజే రనంగఁ బు, నర్ణవసంజ్ఞగా నమరియుండు
సోమగంధాఖ్య వెలయును సోమెద యన, గుంటగలిజేరు కలగర గుంటకలగ
ర యనఁ జెన్నొందు నా భృంగరాజసంజ్ఞ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. జ్యోష్మతీసంజ్ఞ యొప్పు నెక్కుడుఁదీఁగె, యనఁగ వారాహి పాఁ చనఁగ్నఁ బరఁగు
వజ్రవల్ల్యాఖ్యయై వరలు నల్లే రనఁ, గాచి యనందగుఁ గాకమాచి
సీకాయచెట్టన సిగయన సిక యగు, సీకాయ యనఁదగు సికఫలంబు
సారణి గొంతెమగోరు లంజెసవర, మన నగుఁ గోరింద యన జతూక
వెలయుఁ గాకర యనఁ గారవేల్ల మెసఁగు, నడరు నాఁగాఁకర యనంగ నడవికాక
రయనఁగర్కోటకియుఁ గాసరయన ఁగాఁచ్ఛగయనఁ గాశాదనీసమాహ్వాయమగుభవ.

సీ. గుమ్మడి యనఁగను గూశ్మాండ మగుఁ బెద్ద, దోసనాఁ ద్రపుసము దోఁచు నక్క
దోస యనంగ క్షుద్రోర్వారుకము మీఁఱు, ములుదోస నాఁగను వెలయుఁ గంట
కోర్వారుకమ్మ త్రికోత్తోర్వారుకాభిధ, చేఁతిదోస యనంగఁ జెలఁగుచుండు
బుడమనాఁ దద్భేద మొప్పు నానుగ మన, సొరనా నలాబువు పరఁగు వరద
చేఁతిసొరనఁ దిక్తాలాబు ఖ్యాతిఁగాంచు, వారుణి దనర్చుఁ బిన్నపాఁప రన నింద్ర
వారుణి చెలంగుఁ బెద్దపాఁపర యనంగ, గంద యన సూరణాఖ్య యగా గరళకంఠ.

సీ. చిరుగడ్డం బనఁగను జెలఁగును మధురకం, దంబు గండీలంబు దనరుఁ బెండ
ల మ్మన శింబియగాఁ జమ్మతంబ యనంగ, వల్మీకశింబియై వఱలుఁ బుట్ట
చంబ యటం చనఁ జనుఁ జిక్కుడన క్షుద్ర, శింబి పుచ్ఛ యన భాసిలుఁ గళింగ
మల్లుబచ్చలి యటం చనఁ దీఁగెబచ్చలి, యనఁగఁ గలంబాఖ్య యలరు దుంప
బచ్చలి యనఁగ నుపోదకి పరఁగుచుండుఁ, బొలుచు నామ్లకలంబాఖ్య పుల్లబచ్చ
లి యన ముల్లంగి నాఁగను రీతిఁ గాంచు, మూలకాభిధ శ్రీమాతృభూతలింగ. 72

సీ. గంజాయియం చన గాంధారి చెన్నొందు, గాఁజరయం చనఁగాఁ గళంజ
మగుఁ జిల్కయం చన నా హిలమోచిక, బాష్పశాఖాఖ్యయై పరఁగుఁ గోయ
దోఁటకూ రనియెడిమాట పెరుగుతోఁట, కూర పెరుగుతోఁటగూర యనఁగఁ
జనును మహాబాష్పసంజ్ఞ దొగ్గలి యన రక్తబాష్పాఖ్యయై ప్రబలుచుండుఁ
దుమ్మియం చనఁ దనరును ద్రోణసంజ్ఞ, గురు గనంగను జెలఁగును గురుకటాఖ్య
మొహాళి మనఁగను సవరగు మోహాళంబు, పన్నెవెదు రన మను వృత్తపత్త్రి మభవ.

సీ. కుచ్చలియం చనఁ గుచ్చెలి యనఁగను, గోళి యటన్నను గోలి యొప్పుఁ
బావిలియం చనఁ బరఁగుఁ దద్భేదంబు, గరిమిడి గటికి నాఁగజను దూర్వ

తుంగ యనంగఁ జెలంగు ముస్తాభిధ, వేణునామం బగు వెదు రనంగఁ
గీచకసంజ్ఞమై తోఁచు బొం గనఁ గన్ను, కనుపు గంటు గనుపం చనఁగఁ బర్వ
మమరుఁ గంతి కణిందె బోటు ముడి గుబ్బ, బుడిపి ముడుతయనంగను బొసఁగుఁ గ్రంథి
యించు చెఱ కనఁ దనరును నిక్షుసంజ్ఞ, చనును రసదాడి యనఁగ రసాల మభవ.

సీ. ఇక్ష్వాదికాండాఖ్య యొసఁగును గడ యన, వాడెదవ యన నిక్ష్వగ్ర మొప్పు
గనె కండ్ర గండ్రిక గనియ యటం చన, నిక్ష్వాదిఖండము లెన్నఁ దగును,
గాకిచెఱ కనంగఁ గను మన శర మగుఁ, గాశము రెల్లనాఁగను దనర్చుఁ
గిక్కస యనఁగఁ బెంపెక్కను నలసంజ్ఞ, బొదయన బల్బజం బొనరుచుండు
వీరణాభిధ యొరు నా వెలయు వనట్టి, వేరనాఁగ నుశీరంబు మీఱుచుండుఁ
గస వనంగను దనరుఁ గిక్కస మొదలుగఁ, గుస్సె దబ్బన దర్భ లగు న్మహేశ. 75

సీ. క్షౌరతృణం బగుఁ గారెనాఁ గామంచి, కావంచి యనఁదగుఁ గత్తృణంబు
సెండ్రయం చన ఛత్ర నెగడును జిప్పల్ల, చిప్పనా భూస్తృణ మొప్పు రక్త
తృణము చెంగలి యన గణుతి కెక్కును గడ్డి, గాదము గవతము కసపు కవసు
ఫుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ, నలి యన నలు సన నలరు శుష్క
తృణము దుబ్బనఁ గామూల మెసఁగుఁ బుల్లు, పుడక యనఁగను దృణకాండము చను జొప్ప
యనఁగఁ దనరును యావనాళాదిసదన, దండనామంబు మేరుకోదండహస్త. 76

సీ. యావనాళాదిదండాఖ్య దంటన మీఱుఁ, బచ్చిక యనఁ జను బాలతృణము
వామియటం చన వఱలును దృణతతి, తోంట యనంగఁ దనుమ్రఖము దనరు
వంద వదియ వదె వందెయం చనఁ దృణ, తతివిశేషం బొప్పుఁ దా డనంగ
దాళాఖ్య యగు బాలతాళాఖ్య బొందనాఁ, బరఁగుఁ గమ్మనఁ దాళపర్ణ మెసఁగుఁ
దత్పుటం బౌను బొటయనఁ దాళపుటనఁ, బత్త్రివృంతంబు మట్టనా వఱలు మోవు
నాఁగఁ దాళాగ్రతరుణపర్ణంబు చెలఁగుఁ, దాళపేశంబు గుంజనఁ బోలు నభవ. 77

సీ. తాళాదికళలాటు తనరు బొండ్ల మనంగఁ, గెంగటం చనఁగఁ జెలంగుఁ దాళ
బీజాభిధానంబు రాజిలు నారికే, డంబు టెంకాయచె ట్టనఁగ నాళి
కేరనామం బెళనీ రటం చనఁ జనుఁ, దచ్ఛలాటుజలము తత్ఫలంబు
టెంకాయ యనఁగఁ రూఢిగను గొబ్బె రనఁ గొ, బ్బెర యటంచనఁగఁ దత్పేశ మెసఁగుఁ
బోఁక యనఁ బోఁకమ్రానఁ బూగ మొనరుఁ, బోఁక యనఁగను వెలయును బూగఫలము
ఖండితము లైనయవియ వక్క లనఁ దగునుఁ, నలరు హింతాళ మీఁదా డనంగ నభవ.

ఉ. కేఱను శేతకి న్మొగలి గేదఁగియం చనఁ బేరులొప్పు ఖ
ర్జూరము గజ్జూరం బనఁగ శోభిలు నీఁదన నీఁతనాఁగ ఖ

ర్జూరిక తాడి మున్నగుతరుల్పులు బ్రాఁకు లనంగఁ బోలు నీ
హారగిరీంద్రజాహృదయహర్మ్యగతీ! త్రిశిరఃపురీపతీ! 79
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగును వనౌషధీనామవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 80

---

## సింహాదివర్గము.

క. మెకములఱేఁ డనఁ దెరవా, మెక మన సింగ మన బొబ్బమెక మనఁ జనుఁ జా
మ్మ కరిరిపునామధేయము, లకలంకదయారసార్ద్రితాంతఃకరణా. 81
సీ. బెబ్బులి యం చన వెలయుమహావ్యాఘ్ర, మల్పశార్దూలాఖ్య యలరుచుండుఁ
జిఱుత చిఱుత పులి చిఱు పులి యం చన, వాలము వేఁగినా వ్యాళి మెసఁగుఁ
జివ్వంగి నాఁగను జెలఁగుఁ దరక్షువు, చాఱయం చనఁగను జాతిక యన
వ్యాఘ్రచర్మం బొప్పు నగు గోఁదిరిం పన, వ్యాఘ్రగర్జాధ్వని వాలుమెకము
పంది సలు గేకలమ్మనఁ బరఁగు ఘృష్టి, దనరు గామిడికాఁ డనఁ దగ్గఱోళుఁ
డలరుఁ దద్ఘోణ ముట్టెయం చనఁగఁ బుడ్డ,గింపనఁగఁ దద్ధరాఘాతి గేరు నభవ. 82
సీ. హనుమఁడం చనఁగను హనుమదాఖ్యయుఁ గ్రోఁతి, తిమ్మఁడం చన వానరమ్ము దనరు
గొండ ముచ్చనఁగను గొండంగి యనఁగ గో,లాంగూల మెసఁగును నింగిలీక
మన మర్కటవిశేష మగు నెలుఁగం చన, భల్లూకనామమై ప్రబలుచుండుఁ
గారెనుపో తనఁ గారుదున్న యనంగ, వనమహిషం బొప్పు వఱడు నక్క
నాఁగ జంబుకమౌఁ గొంకనక్క యనఁగ, క్షుద్రజంబుకమంచు నెంచుకొనఁ దగును
వృకము తోడే లనం జను వెలయు శల్య, మేదు సెలపంది యనఁగను వేదవేద్య. 83
సీ. పిల్లియం చనఁగను జెల్లు బిడాలాఖ్య, బావురుపిల్లినా బావు రనఁగఁ
జను మహామార్జాలసంజ్ఞ జాంగలబిడా,లము జంగపిల్లినా నమరు బూశ
పిల్లినాఁగను గమ్మపిల్లినాఁగను బున్గు, పిల్లియటం చనఁ జెల్లు గంధ
మార్జాలనామంబు మనును జవ్వాదిపి,ల్లియన సంకువు గోధికయగు నుడుము
నాఁగ మృగ మొప్పు నిత్తియనంగ మృగియుఁ, జెలఁగుచుండును లేడినా జింక యనఁగ
న్యంకునామంబు దగు పెంటిజింక యనఁగఁ, బరఁగుఁ దత్స్త్రీసమాఖ్య సప్తర్షివంద్య.
సీ. కొండగొఱియ నాఁ దగును రోహిషాభిధ, గోకర్ణనామం బగును గడంజ
కడఁజనాఁ బృషదాఖ్య యడరు దుప్పి యనంగ, మనుబోతు మనుబిళ్ళు మన్ననంగ
ఋశ్యముదగుఁ గేసరి యన ఖేచర మగు, సవరపుమెక మన జల్లిమెక ము
నఁ జమరి వెలయు గంధర్వమౌను గడంతి, కటకరమం చనఁగాను దుప్పి

యనఁగ రామంబు చను గవయమ్ము గోవ, నాఁగ గొఱపోతు నాఁగఁ దనర్చుఁ జెవుల
పోతు కుందే లనంగను ఖ్యాతిగాంచు, శశసమాఖ్యలు బాలశశాంకమౌళి. 85

సీ. ఇప్పుడు చెప్పినయివియును సింగంబు, మొదలుగా నావులు మొదలుగాను
పసు లనఁదగు వేఱె పలికెద నెలుకనా, మూషకసామాన్యముగఁ జెలంగుఁ
గల్లెల్క యనఁగను వెల్లెలుక యనంగఁ, జిట్టెల్క యనఁగను జెలఁగు నిట్లు
కొన్ని తద్భేదము లొక్కక్కన గరిమిడి,కొక్కనంగను బందికొక్కనంగ
మూషికాభిధలగు గంధమూషికాఖ్య, చుంచనంగను జుంచన నెంచఁదగును
గేరు నకులము ముంగిముంగిస యనంగ, వెంట్రు వనఁగను బభ్రువు వెలయు నభవ.

సీ. ఉఱుతనా నుడుతనాఁ దరుమూషికం బగుఁ,దోఁచు నూసరవెల్లి తొండ యనఁగ
సరటంబు నల్లికం చన నలికిరి యన, మిండయం చనఁగను మీఱు రక్త
పుచ్ఛి బల్లి యన నొప్పును గృహగోధిక, జాలకాఁడు చెలఁదిసన్నపిల్లి
సాదొట్టనఁగ లూత పరఁగుఁ దద్భేదంబు, దోఁచు నీఁగపులి విందుపురు వనఁగఁ
బు ర్వనంగను బురు వనఁ బురు గనంగఁ, గ్రిమి దనర్చును దగు వత్సకీటసంజ్ఞ
చీడపురు వన నత్తనాఁ జెలఁగు క్షుద్ర, శంఖకీటంబు శ్రీబాలచంద్రచూడ. 87

సీ. కాళ్లజెఱ్ఱి యనంగఁ గర్ణజలూకాఖ్య, వెలయుఁ దే లనఁగను వృశ్చికంబు
ఎనుపతే లనఁ గృష్ణవృశ్చికం, బగు మండ్రగబ్బనాఁ బృథువృశ్చికాఖ్య యొప్పుఁ
దత్పుచ్ఛనామమై తనరు గొండె యనంగఁ, జెలఁగుఁ బిపీలిక చీమ యనఁగఁ
జెదలటం చన్నను శిథిలియౌ నల్లి నాఁ, గాను మత్కుణ మొప్పుఁ బే ననంగ
నలరు యూకాఖ్య యీరునా వెలయులిక్షు,యీపియనఁగను లిక్షాన మెసఁగుచుండుఁ
బిడుఁ జనంగను బిణుఁజునాఁ బిడుఁదునాఁగ, వఱలు గోమారి కైలాసపురవిహారి.

సీ. పారావతం బగుఁ బావురాయి యనంగఁ, బారువ మనఁగను బావుర మనఁ
దద్భేదములుగాను దనరుచుండును నేల, పల్లటి యంతరపల్లటి సుర
టి లకోరి బట్టి యొడ్డీ కూకి బకదారి, గూరబారు లనంగ శారికాఖ్య
గోరింక గోర్వంక గొరువంక గోరంక, గోరువంక యనంగ మీఱుచుండుఁ
జనును శుకసంజ్ఞ బట్టికాఁ డనఁగ రామ, తమ్మ యనఁ జిలుక యనఁగఁ దగును గోకి
లాభిధానము కోయిల యనఁగఁ బరఁగు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 89

సీ. సాళ్వము జాలె వేసడము డేగలగుడు, బైరి కణసరంబు నోరణంబు
జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభే,దము లివి గాకయు దళుకు బెళుకు
కంచుఝ్ము చనఁగను గల వందు రన్నిట, స్త్రీజాతి డేగనాఁ జెలఁగుచుండు
నది శ్యేనసామాన్య మని కొంద ఱందురు, తోనికాఁ డనఁగఁ బుంశ్యేన మొప్పు

నెత్తె పన్నను దన్నఖాహతికిఁ గెలఁ, దొడిగియుండినచర్మంబు దోఁచియుండు
వానికనుమర్వ దనరుఁ దోపార మనఁగ, దోరె మనఁగను దగు వానిదార మభవ.

సీ. గూబ కోటఁ డనంగ ఘూకంబు విలసిల్లుఁ, బరఁగు నేట్రింతనాఁ జసులపోలి
గాఁ డనినను వ్యాఘ్రఘాటాఖ్య యగుచుఁ గా, టుగపిట్ట రువ్వపులుఁ గనఁ దనరు
ఖంజరీటాభిధ కంకణం బనఁగను, రాఁబులుఁ గనఁగను బ్రబలు లోహ
పృష్ఠాఖ్య ధూమ్రాట మెసఁగును గూఁకటి, మువ్వన్నాఁ గూఁకటియూఁగ యనఁగఁ
బాలయం చనఁగఁ గికీదవంబు పరఁగు, వెలయుఁ గనకాక్షి సకినాలపులుఁగు గుబిలి
పైఁడికంటినాఁ జాతకం బలరు వాన, కోయిల యనంగఁ గైలాసకుధరనిలయ. 91

సీ. కోడి యనంగను గుక్కుట స్త్రీపుంస, సామాన్యసంజ్ఞమై చనును గుక్కు
టంబు పుం జనఁగ నడరు నది పెంటిపో, లికనున్నఁ బెట్టమారి యనఁ బరఁగుఁ
గుక్కుటినామ మగును బెట్టయనఁగను, నారెబో ట్టై యనఁ దదంఘ్రి జన్య
కంటకాతినిశితాంగం బొప్పుఁ గారుకోఁ, డనఁ జను వనకుక్కుటాహ్వయంబు
సలిలకుక్కుటనామంబు వెలయు నీరు, కోడియనఁ బుల్లగొర కన గుండెఁగి యనఁ
గర్కరేటువు దనరును గక్కెర యనఁ, బిచ్చుక యనంగఁ జటకంబు వెలయు శర్వ.

సీ. మ్రానిపోటుపులుఁగునా నొప్పుచుండు దా, ర్వాఘాటనామంబు వాయసంబు
కాకినాఁ దగు మాలకాకి నాఁగను ద్రోణ, కాకంబు విలసిల్లుఁ గాక భేద
మగును జెమరుకాకి యన నీరుకాకి నా, జలకాకనామమై చెలఁగుచుండు
దాత్యూహసంజ్ఞ యై తనరుఁ గూకురుగండె, నాఁగ గృధ్రము గ్రద్ద నాఁ దనర్చుఁ
గొంచ కొంగ యనంగను గ్రౌంచ మెసఁగు, బకము విలసిల్లు నారణపక్కి వక్కు
వగ్గటం చన నాడెలు బాతనంగ, నగశరారి పదాంబుజనతకిరీటి. 93

సీ. కాఁ జనఁ గై జనఁగాఁ గపింజల మొప్పు, బెగ్గు రుయ్యాలచేఁబుపిట్ట యుయ్యా
లపులుఁగు నాఁగ సారస మగు జక్కవ, యనఁ గోక మలరును హంస మంచ
యనఁ దగు రాయంచ యన రాజహంసంబు, పరఁగు బలాక కొక్కెర యనంగఁ
గొక్కరాయి యనఁ బెం పెక్కను విలసిల్లుఁ, గోయష్టికము గుడ్డికొక్కెర యనఁ
బ్రబలును జతూక చీకురువాయి యనఁగ, జీకువాయి యనంగను జీవుక యన
గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపాయిక చెన్నొందు దక్షశిక్ష. 94

సీ. మక్షిక యీఁగ నా మను మధుమక్షిక, తేనీఁగ జుంటీఁగ నా నెసంగుఁ
బెరయీఁగ నాఁగను బరఁగుఁ బతంగిక, జోరీఁగ నాఁగను మీఁజును బశు
మక్షిక వల్మీకమక్షిక యీఁసిల్లు, నాఁగను బహుతచే నలరి యుండు
గందురీఁగ లనంగఁ గణుదురు లనఁగాను, గండోళి దగు మశకంబు దోమ

యనఁగ వెలయును జిమ్మట యనఁగ ఝిల్లి, దనరు మిడుత శలభంబు చను మిణుఁగుఱు
పు ర్వనంగను ఖద్యోత మొనరుఁ దేఁటి, తుమ్మెద యనంగ భృంగంబు దోఁచు నభవ.

సీ. అళివిశేషంబుగా నడరును దూనీఁగ, నెమిలి నట్టువపిట్ట నెమ్మి యనఁగఁ
గేకియై తగుఁ గేక కేఁక యనంగను, దనరుఁ జంద్రకము కన్ననఁగఁ బరఁగుఁ
బురి యనఁ బింఛంబు మెఱయు జుట్టు సిక చుంచు సిగ కూఁకటన నల్లసిలును శిఖ
పిట్ట పక్కి పులుఁగు పిట్ట గువ్వ యనంగఁ, బక్షిసామాన్యమై పరఁగుచుండుఁ
గృత్రిమవిహంగ మొప్పు సకినె యనంగఁ, బచ్చపిట్ట యనంగను బసిరికయన
హారితకం బొప్పుఁ గాకండవాఖ్య కన్నె, లేడి యనఁ జనుఁ జూడ బాలేందుచూడ.

సీ. తీతువ యనఁగను దిత్తిరి యగుఁ గుక్కు, భంబు గబ్బులుఁగు గంపవులుఁ గనఁగ
వఱలు లావుకన లావక మొప్పును జకోర, మగును వెన్నెలపిట్ట యనఁగఁ డిట్టి
భము లకుముకియనఁ బరఁగుఁ దద్భేదంబు, నీరుచికాఁ డన నెగడుచుండు
వెలిచె యనంగను వెలయు వర్తకసంజ్ఞ, మీలవల్లిక యన మీల ముచ్చు
నాఁగ వర్తిక చెలఁగు గోనర్ద మలరు, వలికి యనఁగను భృంగాహ్వ వెలయు లింగ
రాజనఁగ వద రనఁగ నిద్రాహ్వ యెసఁగు, మాతృభూత నగేంద్రజామాతృభూత. 97

సీ. గిజిగాఁడు పూరేడు కేర్జంబు పొన్నంగి, వెన్నడాయి పరిక జెళవ రివ్వ
వంగపండు పిగిలి వామనప్రాతుకాఁడు నులంకి కాటికాఁడు పగడంపు
జిట్ట గొబడి డాబ జీనువ వడ్రంగి, గున్నంగి పోపిట్ట గూడబాతు
కూఁకటిపువ్వె కుటూక కళ్కు కరడు, నల్లచ్చికాఁడును జల్లపిట్ట
యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు, మొదట నర్థంబు చెప్పినయదియుఁ గాక
గూఁటిగువ్వన నణుజనఁ గురు జనంగ, నీఁకరాల్చినపక్షియా నిందుమౌళి. 98

సీ. గఱి యీఁక చట్టుప ఱెఱకడా కన నొప్పుఁ, బక్షంబు ఱెక్కనాఁ బక్షతి యగు
లావు లవ్విటినా నలరుఁ బక్షపుచ్ఛాఖ్య, యెగుపునాఁగను విహంగగతి దనరు
నండంబు గ్రుడ్డునా నమరును జెన యన, నండద్రవం బొప్పుచుండు గూఁడు
నాఁ దగు నీడంబు బోదులా యనఁగను, బోదెయం చనఁగను బోదనాఁగ
నిసు వనంగను బిల్లనా పిసుఁగనంగఁ, గూన యనఁ గందునాఁగను గొదమయనఁగఁ
దిర్యగర్భకములుగాను దెలియవలయు, నౌపచారికమాన్యాఖ్య లౌట శర్వ. 99

సీ. గండనఁ బోతనఁగాను దిర్యక్పురు, షాఖ్యయౌఁ దత్త్రీసమాఖ్య పెట్ట
యన మీఱుఁ దన్మిథునాభిధ పెంటిపోఁతు లనంగ విలసిల్లు దోయి జోడు
జంట జమిలి కవ దంట యమడ యన, ద్వంద్వమై పరఁగు నత్తమ్మ దిమ్మ
గుబురు గుబురుగుంపు గమి గమి పిండు మొత్తము తెట్టె పైకము దాఁటె లొద్ద

తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ, మనఁగ వర్గము తగు మూఁక యనఁగ సంఘ
మౌను సమజము కదుపన నలరుచుండుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 100
తే. ప్రోక యనఁ బ్రోవనంగను బ్రోఁగు నాఁగఁ, గుప్ప యన రాసియనఁగను గువ్వయనఁగ
రాశియగు మండె యనఁగను రాశిభేద, మలరుచుండు జగత్త్రియీమాతృభూత. 101
గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగుచుండును సింహాదివర్గమిట్లు,
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 102

---

## మ ను ష్య వ ర్గ ము.

సీ. మానిసి మనిసినా మనుజసామాన్యంబు, మందియం చన నగు మనుజవితతి
యారె మరాటివాఁ డన మహారాష్ట్రుఁడౌ, గుజ్జరివాఁ డన ఘూర్జరుఁ డగుఁ
గన్నడీఁ డనఁగను గర్ణాటకుం డొప్పు, నఱవయం చన ద్రావిడాఖ్య వెలయు
నాంధ్రుఁడౌఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁడన, మగవాఁ డనంగను మగఁ డనంగఁ
బురుషుఁ డనఁ దోఁచుఁ బౌరుషంబు మగతనము, మగఁటిమియనంగఁ దిర్యక్పువర్థమందు
నౌపచారికమైన గం డనెడిపల్కు, భావకర్మంబులనుగూడఁ బరఁగు నభవ. 103
సీ. బోటి చేడియ చేడె ప్రోయాలు పైదలి, పొలఁతుక పొల్తుక పొలఁతి పొత్తి
యతివ తొయ్యలి కొమ యన్నుసకి తెఱవ, నెలఁతుక పడఁతుక నెలఁత పడఁతి
యెలనాగ కోమలి యింతి చెలువ చెలి, వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత
నవలా మగువ నాతి నాతుక యాఁడుది, లేమ గోల యువిద చామ చాన
గోతి బిత్తరి యుగ్మలి కొమ్మ కల్కి, మడఁతి జోటిక ముద్దుగుమ్మ యన స్త్రీస
మాఖ్యలం చనఁగాను జెన్నలరుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 104
సీ. చిగురుబోఁడి మిటారి చిలుకలకొల్కి వా, ల్గంటి మెఱుఁగుబోఁడి కలువకంటి
యన నిట్లు స్త్రీవిశేషాఖ్యలు చెన్నొందు, ముద్దరా ల్మద్దియ ముగుద యనఁగ
ముగ్ధ యొప్పును బ్రౌఢ ప్రోడయం చన మీఱు, గొంతియం చనఁగను గుంతితోఁచు
ద్రౌపది ద్రోవది ద్రోపది యనఁజనుఁ, గైకేయి వెలయును గైక యనఁగ
మహిషి దేవేరి యనఁగను మనును గేస్తు, రాలన గరిత యనఁగ నిల్లా లనంగ
గృహిణి చెలఁగును భార్యపే రెసఁగు చుండు, నాలు పెండ్లాము నాఁగ దేహధృతనాగ.
సీ. కన్యాభిధానంబు కన్నె కన్నియ కన్య, యన మూఁడు పేళ్ళచే నమరియుండుఁ
గన్నెఱికం బనఁ గన్యాత్వ మొప్పును, గొమిరెనాఁగఁ గుమారి యమరియుండు
జవరాలు గుబ్బెత జవ్వని యనఁగను, యువతిసమాఖ్య లై యొప్పుఁ దగఁ జి
రంటికిఁ బేరు పేరంటా లనంగఁ జిరం టిత్వ మెసఁగు బేరంటిమనఁగ

అంకులాడి నాఁ జెడిపెనా అంకుటాలు, నాఁగులటు యా ననాద యనదనఁ దగును
జేదరా లనఁగ దరిద్రి వెలయు వంధ్య, యొనరు గొడ్రా లనంగ విధూత్తమాంగ. 106

సీ. సకి సకియ యనంగ సఖి యొప్పుబోటినా, బోటికత్తియ యనఁ బోలు దూతి
పతిపత్ని యని పల్కఁబడు పుగనాలునా, నైదువరా లన నైదువ యన
నది వృద్ధయైన ముత్తైదువ యనుకొంద్రు, తెలివికత్తె యనంగఁ దేరుఁ బ్రాజ్ఞి
దొరసాని రాణినాఁ దోఁచుచుండును రాజ్ఞి, ప్రెగ్గడసానినా వెలయు మంత్రి
భార్య దనరు నుపాధ్యాయభార్య యొజ్జ, సాని యన సోమిదమ సోమిసాని యజ్వ
పత్నికిని నామధేయమై పరఁగుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 107

సీ. నాగప్పసాని నా నాపసాని యనంగ, నాకబలిచిరంటినామ మెసఁగు
బాఁపతయం చన బ్రాహ్మణి చెన్నొందు, క్షత్త్రియాణి చను రాచది యనంగ
గొల్లత ప్రేఁతనా గోపికాభిధ యొప్పుఁ, జాకిత యనఁగ రజకి చెలంగు
చండాలకాభిధ చను మాలెత యనంగ, బోయెత యనఁగను బొల్చు శబరి
పల్లెత యనఁగ మాతంగి పరఁగుచుండు, నెఱుకత యనఁ గిరాతిగా నెసఁగుచుండుఁ
జెంచెత యనంగ మనుఁ దద్విశేషసంజ్ఞ, పుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 108

సీ. మాచకమ్మ యనంగ మనుఁ బోట ముట్టుది, యనఁగ నుదక్యమై తనరుఁ గుసుమ
ము ట్టన నార్తవం బొప్పుచుండును బ్రథ, మార్తవం బెసఁగు సమర్త యనఁగఁ
జూలా లనంగఁ దోఁచును గర్భిణీసంజ్ఞ, గర్భంబు ప్రేఁకటి కడుపు చూలు
నా మీఁఱు వేవిళ్ళు నాఁగ బయ్యంక లం, చనఁగను దౌహృదాఖ్యలు చెలంగుఁ
జిట్టుము లనంగఁ దదరుచి చెలఁగుఁ గాన్పు
నాఁగను బ్రసూతిపేరు దనరుఁ బ్రసూత
నెగడు బాలెంత యనఁ బ్రొద్దు నెల యనంగ
వైజనన మెసఁగు జరాయు వలరు మావి
నాఁగ దేహవిభూషితానాదినాఁగ, 109

సీ. ప్రసవమంత్రజ్ఞ దాఁ బరఁగు మంతరసాని, నాఁదగు దైవజ్ఞ సోదెకత్తె
యనఁగ వేలుపుసాని యనఁ గుట్టనీనామ, ధేయంబు తాపికత్తియ యన నెడ
కత్తియ యనఁ బొంతకత్తియ యనఁగఁ గుం, టెనకత్తియ యనంగఁ దనరు లంజెఁ
లంజియ లంజ వెల్లాటకత్తె పడుపు,ది వెలయా ల్భోగముది యన వేశ్య
బసివి యనఁగను దనరును బశుపిపేరు, మనును దిధిషువుగా మాఱుమనువుది యనఁ
జనును దగులాటకత్తెనా సంగినీస, మాహ్వాయము వైశ్యకన్యకామాతృభూత. 110

సీ. పట్టి బిడ్డనఁగ నపత్యంబు దగుఁ గన్న, కొడుకు కొమారుఁడు కొమరుఁ డనఁగఁ
బుత్త్రాభిధానంబు పుత్త్రికాహ్వయ మొప్పుఁ, గూఁతు కొమారిత కూఁతు రనఁగఁ
స్నుష కోడలనఁగను శోభిల్లుఁ గోడఁట్రు, మనఁగఁ గోడలికమం చన స్నుషాత్వ
మలరును జామాత యల్లుఁడం చన్నఁగను, నిల్లఁట్రు మనఁగను నిల్లటపున
శ్వశురగేహాధివాసంబు చనును వెలయు, నల్లె మనఁగను జామాతృతాఖ్య మనుమఁ
డనఁగ నప్త చెలంగును మనుమరాలు, నాఁగఁ దనరారు నప్త్రి చంద్రార్ధచూడ.

సీ. అయ్యబ్బ తండ్రియం చన జనకుం డొప్పు, నమ్మవ్వ తల్లియం చనఁగ మాత
దనరును దాదినా ధాత్రియై చెన్నొందుఁ, దాతనా వెలయుఁ బితామహుండు
పరఁగు ముత్తాతనఁ బ్రపితామహాభిధ, యలరుఁ బితామహి యవ్వ యనఁగ
వఱలు ముత్తవ్వనాఁ బ్రపితామహీసంజ్ఞ, తర మనఁగఁ బురుషాంతరము చెలఁగుఁ
జుట్టలన విందు లనఁగను జుట్టము లన, బందుగు లనంగఁ జెలఁగును బాంధవాఖ్య
దాయ యనఁగ సగోత్రాభిధాన మొప్పు, ఫాలవీక్షు పురాంతకచోళశిక్షు. 112

సీ. తోఁబుట్టు తోడు సైఁదోడునా సహజుఁడౌ, నన్నయం చనఁ దగు నగ్రజుండు
తమ్ముఁడం చనఁగను దనరును ననుజుండు, తోడఁబుట్టిన దనఁ దోఁచు భగిని
యక్క యప్ప యనంగ నలరును నగ్రజ, చెల్లె చెలియ లనఁ జెలఁగు ననుజ
చనును బరంపరాసంబంధి యంతల, పొంతలవాఁ డంధిపొందినట్టి
వాఁ డన్నంగను యాతరై పరఁగుఁ దోడి, కోడ లేరా లనఁగ మేనకోడ లనఁగ
భాగినేయి దనర్చును భాగినేయుఁ, డలరు మేనల్లుఁ డనఁగఁ జంద్రార్ధచూడ. 113

సీ. అత్తయం చనఁగను నలరు ననోన్యంబు, జాయాపతుల్లకును జనను లైన
మామనాఁ దత్పితృనామమై విలసిల్లు, నడరు బావయనఁ దదగ్రజాఖ్య
తదనుజాహ్వయము లై పాదలు మఱంది నా, వదినె నాఁ దజ్జ్యేష్ఠలు దగియుండ్రు
మఱఁదలం చనఁగను మండ్రు తదనుజలు, వియ్యంకుఁ డనఁగను వియ్య. మనఁగఁ
దత్పితృమిథోభిధానమై తనరుచుండు, నమరు వియ్యంపు రాలు వియ్యఁపుసాని
నాఁగను బరస్పరము తజ్జననులపేళ్లు, వియ్య మనభావమగు సొక్కవేళ శర్వ. 114

సీ. సవతియం చనఁగను జనును సపత్న్యాఖ్య, మాతులుం డగు మేనమామ యనఁగ.
మాఱుఁ బితృష్వస మేనత్త యనఁగను, మేనమఱఁద లన మేనవదినె
మేనమఱఁది యన మేనబావ యనంగఁ, జనును మాతులపితృష్వస్రుకనిష్ఠ
పూర్వజపుత్త్రి లొప్పుదురు శరీరసం, బంధబాంధవాఖ్య మనుచునుండు
మేనటికమం చనఁగ ధవుఁడౌను మగఁడు, పెనిమిటి చెలువుఁ డన జారుపేరు మేలు
వాఁ డనఁగ మిండఁ డన మిండగీఁ డనఁ దగు, అంకన న్వ్యభిచారివరా రవిపతంస. 115

సీ. విటనామధేయమగు విటకాఁడు వేడుక, కాఁడు బొజుఁగు నప్పుకాఁడు లంజె
కాఁ డనఁగ నివియుఁగాక గోవాళ్ళనఁ, గా నెక్కుశబ్దంబు గలదు బహుత
లంజెయం చనఁగను లంజియ యనఁగను, గులటాఖ్య యని వాడుకొనఁగవలయు
వావియం చనఁగను భావంబు తగు షాధ్వి, తనరుచునుండుఁ గ్రొత్తడి యనంగ
నేతుల యనంగఁ దగుపాటియింతి వెలయు, నాబిడ యనంగనా పెనా నాకెయనఁగ
నల్లసతియనుమాటయై యలరుచుండు, నట్టెఁ డనఁగను నట్టివాఁ డగును శర్వ. 116

సీ. ఏలుకోటి యనంగ నెసఁగుఁ బ్రజాకోటి, పడురం చనఁగ మనుజదళక మగు
గుడిసెవేటిది యన నడరుఁ గు వేశ్యాఖ్య, తగు బజారి యనంగ దండులంజె
గట్టివా జంత లాఁగ గయాళి యనఁగను, ధూర్తయోషాభిధ దోఁచుచుండుఁ
బంద యనంగ దూబ యనంగఁ బేడినా, పండనామంబుగాఁ జనును బాయ
మీ డనంగను బ్రాయమైమెసఁగు వెలయుఁ, బాల్యమగు జిన్నటికమనఁబడుచుఁదనము
నాఁగఁ జిన్నటికం బన నలరు నీడు, ప్రాయ మన జవ్వన మన యౌవనము శర్వ. 117

సీ. నిండుజవ్వన మగు నెలజవ్వనం బన, ముదిమి ము ప్పనఁదగు ముసలితనము
నర వన నర యనఁ బరఁగును బలితము, స్తనపాయి పరఁగును జంటివాఁడు
పసిబిడ్డ చంటిపాపఁడు పాలపాపఁ, డనంగ బాలకసంజ్ఞ నలువు మీఱు
పాప పాపఁడు దుడ్డె పడుచన దుడుకఁడుఁ, బుడుత కుఱ్ఱ కొడుకు బొడిగ లేఁత
చిన్న పిన్న చిఱుత యనఁ జెలఁగుచుండుఁ, గోడెకాఁడుకొమరుఁడనఁగొండికనఁగఁ
దగుఁ గుమారుఁడు తరుణుఁడు దనరు వయసు, వాఁడనుచుఁబలుకంగఁజవ్వందిలింగ.

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్దముదుకుఁ, డొక్క టొక్కు ముదురు పక్కు పన్న
లరగడం బనఁగను నలరు వృద్ధాభిధ, బడుఁ గన బడు వన బక్క యనఁగ
వెలయు నమాంసుండు బలిమికాఁడు వలుద, బలియుఁడు బలిసినవాఁడు వలము
బల్లిదుండు బలుపు బలితము లావరి, యన బలవంతుఁడు దనరుచుండుఁ
బెన్నెరులవాఁ డనంగను వెలయుఁ గేశి, బోడి యని బోడఁ డనఁగను బోడయనఁగ
బోడునా బోడివాఁడునా ముండుఁ డొప్పు, నవితనిజదాసరుఘాట పళ్యల్లలాట. 119

సీ. బొజ్జవాఁ డనఁగను బొఱ్ఱవాఁ డనఁగను, బొట్టవాఁ డనఁగను బొసక యనఁగ
దొందన దొందునా దొద్దునా లందనాఁ, దుందిలనామమై తోఁచుచుండు
బంబోతునా నెద్దువలెను మిక్కిలియొడ, ల్బలిసియుండెడివాఁడు పరఁగుచుండు
గర్భిణీహస్తసంగతుఁడైనబాలుఁడు, చంటివాఁ డనఁగను జనును లవిటి
చెవిటి యనఁగను బధిరుండు చెలఁగుగ్రుడ్డి, యవిటి చీఁ కన నంధుఁ డలరు మెల్ల
కంటివాఁ డనఁ కేకరాఖ్యయగు లొట్ట, కంటివాడనఁగ్లిన్నదృజ్నామ మభవ. 120

మిడిగ్రుడ్లవాఁ డన మీఱు నున్నేత్రుఁడు, నడ్డిముక్కుఁగలాఁ డన నతనాసుఁ
డగు బుజ్జిముక్కువాఁ డన గ్రద్దముక్కువాఁ, డనఁగను గ్రమముగా నలరుచుండ్రు
ఖురణస ఖరణసు ల్వరఁగ ముక్కిఁడి యన, విగ్రుండు మూఁగనా వెలయు మూకుఁ
డలరుచు బతితదంతాభిధ తొఱ్ఱివాఁ, డన గ్గొగ్గిపండ్లవాఁ డనఁగ బర్బ
రద్విజుండు వెలయు దంతురాఖ్య మిట్టి, పండ్లవాఁ డనఁ దగు గూనివాఁ డనంగఁ
బరఁగుఁ గుబ్జుండు కుకరుండు పరఁగుఁ దొంటు, చేతివాఁ డన శ్రీమాతృభూతలింగ.

ఖంజుఁడు కుంటి నాఁగఁ గునిష్టినాఁగను, దోఁచును బ్రజ్ఞుండు డొడ్డికాళ్ళ
వాఁ డన ముడికాళ్ళవాఁ డన సంజ్ఞుండు, మీఱుచునుండును బూరకాలి
వాఁ డనఁగఁ బ్రవృద్ధపాదుఁడు దనరారు, వల్మీకపాదుఁడు వఱలుఁ బుట్ట
కాలివాఁ డనఁగను గనుపట్టు వికలాంగుఁ, డవిటినా మొండినా నపడుఁ డెసఁగు
వాఁపియన నులిపియన నుల్ప డన శోభి, శోభిలును మూర్ఛితాభిధ సొమ్మసిలిన
వాఁ డనఁగనొప్పుచుండును బావనుండు, దూలపో తన విలసిల్లు దురితదూర. 122

పొట్టి మొటిమె గిటక పొదిటి పొదడు గున్న, పొనుఁగు బుడుత గుజ్జు బురుక బుడిగి
కులుచ కుఱ్ఱ కురుజు కొటిక కుసులి కుట్ర, మట్టసి మట్టము మట్టసమ్మ
గొనమ గొనప గొనిసె గునిసె గిఱక టింగ, ణాః యనఁగను వామనాఖ్య దనరు
మరుగుజ్జునాఁగ నమరుఁ గుబ్జనామంబు, వాసినాఁ బొడవునా వఱలు నున్న
తుండు ధర్మంబు గానిది దోఁచు నొకటి, వెజ్జనంగను వైద్యుండు వెలయుచుండు
నరవెనకొ నన్నియుఁ ద్రిలింగనామము లగు, శ్రీకరదయారసాంక కంఠేకళంక. 123

బాధిర్యసంజ్ఞయై పరఁగును జెవు డన, నంధభావంబు గు డ్డనఁగ వెలయు
గొగ్గియం చనఁగఁ దగును బర్బరత్వంబు, గూనునాఁ గుబ్జత్వ మౌను మొండి
మొఱ్ఱన భిన్నత్వ మొనరును మచ్చనాఁ, గాలకనామంబుగాఁ జెలంగుఁ
గాయయం చనఁగను గనుపట్టును గిణంబు, గాయమం చనఁగను క్షతి దనర్చు
మం దనఁగ నౌషధాఖ్యయై మనును దెవులు, కింక నా రోగసంజ్ఞయై కెరలుచుండు
నావి యనఁ జీడ యనఁగను నలరు సస్య, రోగ మాశ్రితజనభవరోగవైద్య. 124

పశుపాదరోగంబు పరఁగు నడుప యన, నలదూను మలిమిడి యనఁగను బశు
పార్ష్ణిరోగము పశువ్యాధిభేదాభిధ, యొప్పుచునుండును నుంగిడి యనఁ
జరుకనా గుఱుకనా సాంక్రామికామయా, ఖ్య చెలఁగుచుండు ముడిచె యనంగ
ద్వంద్వరోగంబు నివ్వటిలు దొంద మనంగ, సన్నిపాతం బగు జన్ని యనఁగ
వాయి నాఁగను వాయువు వఱలుఁ గోర, వాయి యనఁ గోష్ఠశీర్షస్థవాయు వొప్పు
ఘుంఢవాయి యన స్థూల్ఫవాయు వగును, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 125

సీ. గృధ్రసిపే రగుఁ గిరుదెస యనఁగను, దిమిరంబు వెలయును దిమిరి యనఁగఁ
బరఁగుఁ బ్రతిశ్యాయ పడిసెమం చనఁగను, దుమ్మనంగ క్షుతంబు దోఁచుచుండుఁ
జీఁద్రుడం చనఁగను జెలఁగు నాసామయ, పరిహృతియును దద్భవారవంబు
సోఁ పన సో బన వాఁపన శోఫయా, నౌదరశోఫమై యలరు దోము
నాఁగఁ గాసంబు పేరు దనర్చుచుండు, నుబ్బస మనంగ దగ్గన నుక్కిస మనఁ
గాసభేదము కుమటు నాఁగను దనర్చు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 126

సీ. రొండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసమౌ, వెక్కినా వేక్రినా వెచ్చ యనఁగ
జ్వర మొప్పు క్షయము సవఁతనాఁగ విలసిల్లు, సొలపు సొరగు సొమ్మ సొమ్మసిలుట
యన మూర్ఛ పేరుగా నలరుఁ బొలుసునాఁగఁ, బొండువు విలసిల్లుఁ బసిరిక యనఁ
గామాల యనఁగను గామలాభిధ మీఱు, నక్షిరోగవిశేష మైరయనఁగ
నలరుఁ గ్రక్కనఁ జరిదియం చనఁగఁ దనరు, చుండుఁ బ్రచ్ఛర్ది గ్రహణియై యొనరుఁ బారు
డనఁగఁ బాచన మనఁగను నడరు నీరు, కట్టనఁగ మూత్రకృచ్ఛ్రంబు గరళకంఠ. 127

సీ. కడుపుబ్బు నాఁగను నడరు నానాహాఖ్య, యఱుకు వఱక మట్టె మన నజీర్తి
యగుఁ గ్రోవ యనఁగ దగ్వామయంబు చెలంగు, నర్శంబు మొలక యం చనఁగ వెలయుఁ
గుట్టుసూల యనఁ గన్పట్టు శూల తలేర్వనఁగ శిరస్తోదము దగును గుష్ఠ
ములు మనఁ గుష్టనఁ బులుసున విలసిల్లు, దామరయనఁ బొడదామరయన
మండలక మొప్పు నాయల్పమండలకము, చిరుగు డనఁగను దనరును జెలిది యనఁగఁ
ద్వగ్గతవ్యాధిభేదమై వఱలుచుండు, మిహిరచంద్రాగ్ని నేత్ర వామేకశత్ర! 128

సీ. సిబ్బెము సోబె నా సిధ్మము విలసిల్లు, మంగు డనంగను మం గనంగ
ముగు సిధ్మనామ మొప్పను నింద్రలుప్తకం, బగు నూలిగరసం చనఁగను గజ్జి
చిడుము నా ఖర్జువు చెలఁగును మొటిమె నా, వదనఖర్జువుసంజ్ఞ వఱలుచుండు
శిశుఖర్జు వలరును జెవ్వయం చనఁగనుఁ, దీంట్రమ్ము కసి తీఁట తీవరమ్ము
దూల జిల నవ నస గాడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి పుండు నా వ్రణము దనరు
వఱలుఁ గురు పనఁగాను నల్పవ్రణంబు, అతికృపాభాసి మధ్యేనగాధివాసి. 129

సీ. ముండిలూటి యనంగ మర్మవ్రణం బొప్పుఁ, జంతిక పుండు నాఁ జను ననేక
రంధ్రవ్రణాభిధ రాచపుం డనఁగను, రాజవ్రణము పేరు దేజరిల్లుఁ
బోటకమం చనఁ బొటక మంచన, స్ఫోటక నామమై పొలుపుఁ గాంచు
బొబ్బ పొక్కనఁగ విస్ఫోటము విలసిల్లుఁ, బగులుడు బీఁటిక వంగు డనఁగ
స్ఫోటము దనర్చుఁ బుంగుడు పులిపిలి యన, నల్పమైనట్టి గ్రంథిగా నలరుచుండు
గాఢ మనఁగను గ్లాప్పి నాఁ గద్దుము నాఁగఁ, దగును ఘాతభవగ్రంథి తరణిమౌళి. 130

సీ. ఆనెయం చనఁగను నాణెయం చనఁగను, దద్దురం చనఁగను దద్దనంగ
దద్రువు వెలయుఁ బిత్తంబు చెలంగును, బిచ్చునఁ బస రన వీర్య మొప్పు
పిత్తన శ్లేష్మంబు వెలయుఁ గల్లె యనంగ, నట్టన తిత్తినాఁ జట్ట యనఁగఁ
దోలనఁగాఁ ద్వక్కు దోఁచును నంజుడు, పాల యెఱచి కవుచు పొలుసు కండ
చియ్యయం చనమాంసంబు చెలఁగుఁ దస్సు, యనిన దుర్మాంసనామ మై యలరు నుప్పు
కండ యనఁగను మీఱు శుష్కపలలాఖ్య, యార్యజనగేయ మాతృభూతాభిధేయ.

సీ. రక్తాభిధాన మెత్తు యనంగ నెత్రునా, నెత్తు రనంగను నెగడుచుండు
రక్తవిశేషంబు రాజిల్లు నల్లనాఁ, గృత్రిమరక్తంబు గేరు జొత్తు
నాఁ జెలఁగును దొబ్బనా ఘనీభూతర, క్తంబు చీ మనఁగను దనరుఁ బూయ
మెసఁగును గుండెనా నెద యనఁ గందన, గాయ యన హృదయాఖ్య వస చెలఁగు
గ్రొవ్వునా నర మన నాడి నివ్వటిల్లు, మన్ని యనఁగను విలసిల్లు మన్య బిఱ
నరము నాఁగను దగుఁ బీతనాడి నీరు, తిత్తి యనఁగను గ్లోమమౌ దేవపూజ్య. 132

సీ. మస్తిష్కనామంబు మను మెద డంచనఁ, గండచుక్క యనంగఁ గాలఖండ
మలరును బ్రేగన నాంత్రంబు చెలఁగును, మూలుగునా మజ్జ పొలుచు బొమికె
నెరకె మ్మెముక యన నెగడు నస్థ్యభిధాన, మగు ముడు సన గ్రంథిలాస్థిసంజ్ఞ
యడరియుండుఁ గశేరుకాహ్వయంబుగను గ్రో, వెముకయం చనఁ బూసయెముక యనఁగఁ
దనరును గరోటి కప్పెర పునుక పుఱ్ఱె, పుచ్చెయన బోలె బొచ్చెనా బోఁకి బొంకి
పెంచు పెంకు పెంచుక పెరకం చనంగఁ, దద్విశేషాఖ్య పార్వతీదత్తసౌఖ్య. 138

సీ. మలవాచకం బగు మసటు నింపిరి మస్టు, ముఱికి యనంగను మూర్ధమలము
వెలయుచుండును గర్ణమలనామ మొప్పును, గులిబినా గుబిలినా గులిమి యనఁగఁ
బుసి యటం చనిన నొప్పును నేత్రమలసంజ్ఞ, యేరు గనఁగ విష్ఠ యెసఁగుచుండుఁ
బేఁడ నాఁగ గవాదివిష్ఠ మీఱును నేడ, కాదులవిష్ఠ రొచ్చనఁగఁ దనరు
రెట్ట యనఁగను బక్షులవిట్ట మమరు, మేను నెమ్మేను మై మయి మే మెయి యొడ
లన శరీరంబు దనరు బొం దనఁగ డొక్క, యనఁ గళేబర మలరుఁ బళ్యల్లలాట. 134

సీ. ఆయంబు కీలునా నలరు మర్మంబు పా, దాగ్రము ముంగాలటం చనఁ దగు
మీఁగాలటన్నను మీఱుఁ బాదోపరి, భాగంబు దనరును బాదతల మ
డుగఱకా లంజనా నగు గుది చీలమం, డనఁగ వెలయును గుల్ఫాహ్వయంబు
మడమయం చనఁగను మనుఁ బార్ష్ణి కొంకినాఁ, దదుపరిదేశమై తనరుచుండుఁ
జిఱుతొడ యనంగఁ బిక్కనాఁ జెలఁగు జంఘ, ముడుము మోఁకాలు నాఁగఁ జెన్నగు జాను
కురువుతొడయనసూరువు పరఁగుచుండుఁ, బొసఁగుఁ బెందొడయనునూరుపూర్వమభవ.

సీ. గజ్జ నాఁ దనరు వంక్షణ మండె యనఁగను, నూరుమూలాభిధ యొప్పఁ బొత్తి
కడుపు కీఁగడుపునాఁగను వస్తి చెన్నొందు, బొడ్డు పొక్కిలి యనఁ బొసఁగు నా
మొల యనఁ గటిపేరు విలసిల్లుఁ బిఱుఁదు నాఁ, గ నితంబ మగు నరకటన మొప్ప
యనఁగ నితంబపార్శ్వాభిధ దగు ముల్లు, ముక్కు నాఁ జను నితంబైకదేశ
మొనరు రొండి యనం గటిప్రోథసంజ్ఞ, ముడ్డి మూడి యనంగను బొలుచు గుదము
వృషణములు బీరిజములునా వెలయుఁ గచ్ఛ, యన నుపస్థాఖ్య చెలఁగుఁ ద్రికాభిధాన
మలరుఁ దిక మన ముచ్చు నానళికనయన. (పంచపాదిగీతము). 186

సీ. బొజ్జనా బొజ్జనాఁ బొట్టనా డొక్క నాఁ, గడుపనఁ గుక్షికాఖ్యలు చెలంగుఁ
దఱులు నెత్తఱులునాఁ దగును వళీసంజ్ఞ, పాలిండ్లు చాచి గుబ్బ చను చన్ను
చనులనఁ గుచములు చనుఁ జూచుకమ్ములు, చనుమొన ల్చనుముక్కు లనఁగ వెలయు
నెడ్డ యక్కురవు ఱొమ్మెద బోర యెడఁదనా, వెలయు వక్షము వీఁపు వెన్ననం
బృష్ఠ మగుఁ బెడక యనఁ దద్భేద మెసఁగుఁ, గొప్పరము మూపటంచన నొప్పనం
మలరుఁ జంకలి చంకయం చనఁగఁ గక్ష, మచలకన్యాసమేత శ్రీమాతృభూత. 187

సీ. పక్షంబు వెలయును బక్క పక్కియ ప్రక్క, బరి రెట్ట నాఁగను బార్శ్వసంజ్ఞ
కెల నన గెల వనఁ గెడ యన బగి యన, బగు లనఁగాను గన్పట్టు వెలయు
మధ్యభాగము నడు మన లీఁగు నాఁగను, గౌను నా భుజసమాఖ్య యగు జబ్బ
చట్టు బుజం బనఁ జనుఁ గూర్పరంబు మో, చెయి నాఁ బ్రగండంబు చెలఁగు సంది
సందిలి యనంగఁ దగుఁ బ్రకోష్ఠంబు ముంజె, యి యన మణిబంధనామమై యెసఁగును మని
కట్టునాఁ గేలు చే చెయి కై కయి యఁన, జెట్ట యనఁగఁ గరంబౌను జిత్ప్రకాశ.

సీ. మీఁజెయి నాఁగను మీఁఱుఁ గరోపరి, భాగంబు కరపృష్ఠభాగ మొప్పుఁ
బెడచెయి నాఁగను నడరును గరతలం, బఱచెయ్యి లోచెయ్యి యనఁగ వ్రేలు
నా నంగుళీ బగు నంగుట మనఁగ నం, గుష్ఠవిశేషమై కొమరు మిగులుఁ
బొసఁగు నంగుష్టంబు బొటనవ్రే ల్బొట్టన, వ్రేల్బొటవ్రేల్బొట్టవ్రేలు పెద్ద
వ్రేలు నాఁగను జుట్టనవ్రేలు జుట్టు, వ్రేలు జుత్తనవ్రే లనఁ బోలుఁ దర్జ
ని నడివ్రే లన మధ్యను నెగడు దబ్బ, వ్రే లన ననామిక దనర్చు శూలపాణి. 139

సీ. చిటికెనవ్రే లనఁ జిటివ్రేలనంగను, మీఁఱుఁ గనిష్ఠాఖ్య గోరు నాఁగఁ
దనరును నఖము బెత్తయు బెత్తిలి యనంగఁ, జతురంగుళీసంజ్ఞ సాగుచుండు
లొడ్డితయ్యం చనఁగను లొడితిలియం చన, జుట్టెలి యనఁగను జుత్తి లనఁగఁ
బ్రాదేశనామమై పరఁగు జేన యనంగ, వఱలు వితస్తి చప్పట యనఁగఁ

పేట యొప్పును జేరనా వెలయుఁ బ్రసృతి, పొలుపగునికుంజహస్తంబు పుడిసిలియన
భాసిలు నికుంజితుచరంగుళీసమాఖ్య, కొడిద కొడిదిలి యనఁగ రత్నోపిదార. 140

సీ. పిడికిలి పిడి యన నడరును ముష్ట్యాఖ్య, పాణివిశేషంబు పరఁగును గమి
కిలి కుప్పలప్ప పట్టిలి యన దోసిగి, దోయిలి నాఁగను దోఁచుచుండు
నంజలి యూరనా హస్త మొప్పును బిడి, తక్కువయూరనాఁ దగు నరత్ని
బారయుం చనఁగను మీఱును వ్యామంబు, నిలువునాఁ బౌరుషం బలరు చుండుఁ
గౌఁగిలి యనంగ బాహుయుగవలయ మగు, గొంతు గొంతుక కుత్తుక కొలికి బొండు
ననఁగ గంఠంబు చెఁలగును నట్టు మెడన, గ్రీవ దనరారు మేచకగ్రీవ దేవ. 141

సీ. మెడవంపునాఁగను మీఱుగ్రీవాగ్రభా, గము పెడతలనాఁ గృకాటిక దగు
మొగము మో మనఁగను ముఖ మొప్పు మోరనా, ముట్టెనా వెలయును ముఖవిశేష
ము లగు వా వాయి నో ర్మూతినా వక్త్రంబు, మనుఁ దదంతస్థాన మంగిలి యన
ముక్కున సాసిక పొల్చు ముంజెర మనఁ, జైర మన నాసాపుటము చెలంగుఁ
బరఁగుఁ బల్కుప్ప మోవి వాతెఱ పెదవియు, నాఁగ నోష్ఠంబు తదధరభాగ మలరు
నాడు నాఁగను జుబుకాఖ్య యలరు గడ్డఁ మనఁగ గద్దువనాఁగ దేహధృతనాగ. 142

సీ. చెక్కు చెక్కిలి చెంక చెంప గౌద యనంగ, గండస్థలాఖ్యయై యుండు హనువు
కటమరయం చనఁగా నొప్పుఁ బల్లనఁ, దంతమాఁ గోఱనా దంష్ట్ర వెలయుఁ
దాలువు దాలువ దవడ దౌడ యనంగ, నలరును దన్మూలనామ మంకు
నక్కిలి యన మీఱుఁ బుక్క పుక్కిలి బుగ్గ, నాఁగ గండూషమౌ నాల్క యనిన
జిహ్వ వెలయును సెలవినా సృక్విణి తగు, నొసలు నుదుటన ఫాలాఖ్యయొసఁగు భ్రూవు
బొమ యనంబడుఁ దారకం బొనరుఁ బాప, యాబ యన గోళకమగు గ్రుడ్డనఁగ నభవ.

సీ. పర పొర యనఁగము బటలంబు విలసిల్లుఁ, గన్నునా లోచనాఖ్య దనరారుఁ
జూపు చూడ్కి యనంగ దోఁపఁబడును దృష్టి, వాలుచూ పనఁ బొల్చు వక్రదృష్టి
యశ్రువు కన్నీ రటంచన రాజిలుఁ, బక్ష్మంబు వెలయు ఱెప్పం చనంగ
ఘనపక్ష్మసంజ్ఞ దొంగలి ఱెప్ప లనమీఱుఁ, గడక న్ననంగఁ గ్రేఁగ న్ననంగ
నగు నపాంగంబు చెవి వీ ననంగ శ్రవణ, మొప్పు గూ బనఁగాఁ గర్ణమూల మెసఁగుఁ
సిరసు తల నెత్తి యనఁదగు శిరము జనుఁ గ, డంత యనఁగ శిరఃపార్శ్వ మంతకారి.

సీ. ఔదల ముందల యన శిరోగ్రము మీఱుఁ, జనుఁ బెడతలనఁ బశ్చాచ్ఛిరంబు
బ్రహ్మరంధ్రాభిద పరఁగు నుచ్చెన వెండ్రుక నెఱి నెఱక నాఁగఁ దనరుఁ గేశ
మలకలు కురు లన నలరును బహుతచ్చే, వఱలు ముంగురు లన భ్రమరకములు
కూఁకటి యనఁ జిప్పకూఁకటి యనఁ గాక, పక్షంబు చెలఁగుఁ గబరికిఁ దురుము

కొప్పు క్రొవ్వెద మూలనా నొప్పుఁ జేర్పుఁ, గేశబంధవిశేషాఖ్య గేరుఁ గ్రొమ్ము
డి యన వెడయన నూనెముడియనఁ గొండె, యనఁగఁ గీల్గంటనఁగ జొల్లెమనఁగనభవ.

సీ. పాపట యనఁగను బరఁగు సీమంతంబు, జుంజురు సిక జుట్టు చుం చనంగ
శిఖ యొప్పు జడయనఁ జెలఁగును జటపేరు, వేనలి యనఁగను వేణి దనరు
రోమము బొచ్చన త్రుప్పుడునా మీఱు, నారు నూగారునా నలరు రోమ
రాజి శ్మశ్రుసమాఖ్య రాజిలు మీస మీ, సము నాఁగను జుబుక శ్మశ్రు వడరు
గడ్డ మన వేష మగు వాలకమ్ము నాఁగ, వేసమన బారిసమునాఁగ వెలయును బ్ర
దనము కై సేఁత యనఁ బ్రసాధనము భక్త, పోషకాపాంగ శ్రీమాతృభూతలింగ. 146

సీ. అడరు భూషణసంజ్ఞ తొడగు తొడవు మిన్న, సొమ్మనంగను గిరీటమ్ము వెలయుఁ
దలకట్టు నాఁగను దనరును ఫాలపా, శ్యావిశేషములు నూసక తురాయి
ముత్యాలకుచ్చు కొప్పువల పాపటబొట్టు, జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క-
యనఁగ లలాటిక యగు బాసికం బనఁ, గర్ణిక దుద్దనఁగాఁ జెలంగు
విచ్చుటాకు చెవ్వాకునా వెలయుఁ గర్ణ, పత్త్రినామంబు తాటంకవాచక మగుఁ
గమ్మయనఁగాను బంజాలకమ్మ యనఁగ, రత్నతాటంక మెసఁగుఁ జంద్రార్ధచూడ.

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుం, పెన రావిరేక మర్వనఁగఁ గర్ణ
భూషావిశేషము లొప్పెల్చుఁ గ్రోఁగనఁ గర్ణ, వేష్టనసంజ్ఞమై వెలయుఁ దద్వి
శేషాభిధానమై చెలఁగు గంటీలొంట్లు, పోఁగులు చౌకట్లునాఁగ నాసి
కావిభూషణము ముక్కఱ ముంగర యనంగఁ, జనుచుండుఁ గంఠభూషావిశేష
మాను గుత్తికంటు మెడనూలు నాను తీఁగె, కంటసరి కంటెయం చనఁగాను బుస్తె
యనఁగ మాంగళ్యసూత్రాఖ్య యలరుచుండు, బొట్టనఁ దదంతరసువర్ణభూష యాశ.

సీ. పదకము తాళి నేవళము లంబెస సరి, పెన సరపణిగొలుసన లలంతి
కావిశేషం బగు దావడం బన దండ, యనఁ గ్రోవ యన సరి యనఁగఁ జేర
నంగఁ జేరనఁగఁ జెలంగు సరము త్రిస, రంబు ముప్పేటపేరనఁగ వెలయు
సరవిశేషంబు లుత్తరిగె ముత్త్యండంబు, బన్నసరంబు నాఁబరఁగుచుండుఁ
గడెము కడియము బొద్దొత్తు గాజు సూడి, గంబు చేకట్లు గోటు ముంగాముర వన
హస్తభూషావిశేషంబు లలరుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 149

సీ. కేయూరనామంబు తాయెతనంగను, సందిదండ యనంగ సందిండియ
మన బాహుపురి యన నలరు నొడ్డాణంబు, కమరి యొడ్డణమనఁ గాంచి వెలయు
మొల్లనూలనంగ నొప్పును గటిసూత్రాఖ్య, యంగుళీయం బగు నుంగర మన
ముద్దుటుంగర మన్న ముద్రాంగుళీయ మా, నంగుళీయవిశేష మలరు బటువు

సాఁగఁ బాదాంగదం బొప్పు నందె యనఁగఁ, బెండెమనఁ బెండియంజనఁ బెండెరమన
గాను బెండేర మనఁగఁ దద్గతవిశేష, మెసఁగుఁ బాడిగ మనఁగ బాలేందుమౌళి. 150

గంటయం చనఁగను ఘంటయౌను బిరుజు, చిఱుగంట మువ్వ గజ్జె యన క్షుద్ర
ఘంటావిశేషంబు గన్పట్టుచుండును, మను వీఁగమద్దెనా మట్టె యనఁగ
బిబ్బిలికాయనాఁ బిల్లాణియనఁ జిటి, బొద్దునాఁగను గ్రమంబుగఁ బదాంగు
ళీవిభూషలు మట్టె లీవలరానీని, తాను పేర్కొంచనఁ దనరుచుండుఁ

సేలయనఁ బుట్ట మనఁగను జీర యనఁగఁ, గప్పడ మనంగఁ గోకనాఁ గట్టన మన
వస్త్రనామంబు చెలఁగును వలువ వలువు, వలిప మన సూక్ష్మవస్త్రంబు వఱలు నీశ.

విరళవస్త్రముపేరు వెలయు నుడుగరనా, నడరు గడితము సుగ్గడిత మనఁగ
సాంద్రవస్త్రాభిధ చనుఁ బట్టుచీరనాఁ, బట్టాంశుకము సూర్యపటము దనరు
సూరెపుటంబునా మీఱు సెల్లా సేలు, సాలువ నంగను శాటికాఖ్య
వస్త్రభారముపేరు వఱలు లుంగ యనంగ, నిడుపు చా పనఁగను నెగడు దైర్ఘ్య
మడరుఁబరిణాహము తనర్పు వెడలుపనఁగ, నంశుకాంతంబు చెఱఁగుకొంగనఁగ వెలయు
నంచలంబు విరాజిల్లు నం చనంగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 152

బద్దెయం చనఁగను వత్తి యనంగను, జేకమం చనఁగను జెలఁగు దశలు
కమ్మియం చన నంశుకాగ్రావయవవిశే, ష మెమ్మెప్పుఁ దద్విశేషమ్ము చిట్టె
యనమీఱుఁ గచ్ఛభేదాభిధాన మెసంగుఁ, గాసె కచ్చెల కచ్చె కచ్చె పింజ
చుంగు రింగు నెఱిక చింగు నెఱి యనంగ, నీవి పోఁకముడినా నెసఁగుచుండు
వస్త్రపుటిదగు నొడియనఁ బటముదనరుఁ, బడమనఁగ ధౌతవస్త్రంబుపరఁగుమడుగు
మడుత మడి చలువ యగును మనుసు పెంత, వస్నెగలకోకపే ళ్లౌరవలియన భవ.

కావియం చనఁగను గాషాయమై యొప్పుఁ, జందురుకావినాఁ జనును రక్త
వస్త్రము చెంద్రిక వన్నెనాఁ జెంగావి, యనఁగఁ గౌసుంభమై యలరుచుండు
నరుణవస్త్రంబు తోఁపనఁ దోఁచుచుండును, నీలవస్త్రం బగు నీలియనఁగ
సిక్థపువస్త్రంబు చెలఁగు నత్తనఁగను, మాంజిష్ఠ మెసఁగును మంజిడియన
పప్పళి బవంతి కరయంచు పట్టెమార్పు, మాదళంబులు దళ్ళు బొమ్మంచు లుడుత
చాఱ లేనుఁగడుగు లనమీఱు నిట్లు, చిత్రవర్ణవిశేషము ల్చిత్స్వరూప. 154

జరబాజు నేరాజు బురుసా తగటియనఁ, గలధౌతవస్త్రము ల్చెలఁగుచుండు
నవి నల్లచాయచే నలరుచున్నను గసీ, సం బనఁగాఁ దగు సరి యనంగ
నీవస్త్రముల నేయి నెసఁగుదారం బగుఁ, గంచెల అవిక రైక యన నడరుఁ
గంచుళీనామంబు కాంతోత్తరీయంబు, పయ్యెద పయ్యంట పైఁట పయిఁట

పైయెద పయంట నాఁగను బరఁగు చుండుఁ, బ్రబలువస్త్రముకుటము కుల్లా కుళాయి
యనఁగఁ దద్భేదము తపార మనఁగ డెక్కి, యనఁగ జాతనఁ దోపినా నలరు నభవ.

సీ. పాఁగయం చనఁగను బరఁగు నుష్ణీషంబు, తద్భేదసంజ్ఞయై తగు రుమాల
యనఁగ గూర్పాసాఖ్య యలరును దుత్తాయి, యరదట్టి కుప్పసం బంగి కబుస
మనఁగఁ గంచుకభేద మలరారుఁజోలాచొ, కాయిచొక్కాయి చొక్కా చొకాచొ
గా నాఁగ దుప్పటి యనాను హాసావళి, దువ్వల్వ వీణము దుప్పట మన
నవియె కూర్పనిచో రేకు లనఁగ వెలయు, జంటపోఁగులవలువయా గింటె మనఁగఁ
బ్రచ్ఛదపటంబు వెలయును బచ్చడ మనఁ, బోరువయనంగఁ దద్భేదము దగు నభవ.

సీ. దోవతియం చనఁ దోఁచుఁ గటీపట, మొల్లె పంచె యనంగ నొప్పు నర్థ
వస్త్రంబు గుడ్డనా బట్టనాఁ జెలువొందు, వస్త్రఖండము వస్తి పరఁగుఁ బొత్తి
యనఁగను బొల్చు బాలాచ్ఛాదనాభిధ, తడుపంచెనాఁగ నార్ద్రపట మొప్పు
చింపి చీరిక యన జీర్ణవస్త్రము మీఱుఁ, బ్రేలికయం చనఁ బేలికయన
జీర్ణవస్త్రైకదేశంబు చెలఁగుచుండు, గోఁచి యనఁగ గచ్ఛడం బన గోణ మనఁగ
బొట్టమం చనఁ గౌపీనము దనరారు, మాతృభూతేశ సంతతస్వప్రకాశ. 157

సీ. చల్లాడ మనఁగను జల్లడ మనఁగఁ జె, న్నలరుఁ బుమంతరీయంబు లుంగి
యన సంగదట్టమం చనఁ బావడ యనంగ, యోషాంతరీయమై యొప్పుచుండు
గొప్పగాఁ గొసలుంచి కూర్చినపావడ, కంగోరుపావ డనంగ వెలయు
నస్తరు నతుకునా నలరు సంధానవ, సనఖండనామంబు చనును గంబ
లంబు గొంగడి యనఁగను గంబళియన, గోరుపడ మనఁగాఁ గంథ మీఱు బొంత
గంతన వితాన మగు మేలుకట్టు లుల్ల, బమ్మ లుల్లడ లనఁ జందువ లన నభవ. 158

సీ. కొఱలు గుడారము గూడారము గుడారు, గూడా రనఁగను నాల్గు పటగేహ
నామధేయంబులు నవగోజ యనఁగను, గొప్పగుడారమై యొప్పుచుండుఁ
బనిబడిగూడారు పరఁగు గొల్లెనయన, వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ
తనరుఁ గువాళమం చనఁగఁ బ్రావరణమౌఁ, బరదా యనంగను బాడునాఁగఁ
జనుఁ దిరస్కరిణి తెరనా జవనికయన, రంజిలుఁ గనాతి గోడసరాతి యనఁగ
వసననిర్మితకుడ్యనామంబుగాను, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 159

సీ. తలయం టనంగను దలగడు గనినను, నభ్యంగనామమై యతిశయిల్లుఁ
దోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులు, ము డన మార్జనసంజ్ఞ పొలుచుచుండు
నలుఁగన నుద్వర్తనంబు రాజిలుఁ జిక్క, సంబు సున్ని యనఁ జూర్ణంబు దనరు
స్నానంబు వెలయును దానంబు మునుక, బుడక మజ్జన మనఁ దిలక మెసంగు

బొట్టనఁగఁ జుక్కనఁగఁ జుక్కబొ ట్టనంగఁ, బొలుచుఁ జాజికపత్త్రిరిబొట్టనంగఁ
దద్విశేషాఖ్య ఘుసృణంబు దనరుచుండుఁ, గుంకుమ యనంగ బాలశశాంకచూడ.

చెందిర మనఁగను సిందూరము చెలంగు, లక్కయం చనఁగను లాక్ష వెలయు
లాక్షారస మెసంగు లత్తుకయం చనఁ, గుంకుమపూ వనఁ గుంకుమ మగుఁ
గుసుమపూ వనఁగఁ దగును గుసుంభాభిధ, జాజికాయన మీఱు జాతిఫలము
జాపత్త్రి యనఁగను జాతిపత్త్ర మొప్పు, గసగస లనుమస్తు గానిపించు
విత్తు లెసఁగును జాఁ దనవెలయుఁజాప, మలరు సాంబ్రాణి సామ్రాణియనఁగఁ బూతి
పునుఁగు తట్టుపునుంగనఁ దనరుఁ బిల్లి, గడ్డచట్ట మన బిడాలక మగు శర్వ. 161

చను జవాది జవాజి జవ్వాది జవ్వాజి, యనఁగ సంకుమదాఖ్య దనరుచుండు
గోరోజన మనంగ గోరోచనాభిధ, కపురము కప్రము కప్పురమ్ము
సిరఁను గంబూర గంబుర గంబురా గంబు, రమ్ము గంబూర మ్మన మ్మను ఘన
సారము సజ్జరస మ్మన సర్జర, సమ్ము చెలంగు గంద మ్మనంగ
గంధ మొప్పు మలాకనాఁగను దనర్చు, చుండు శ్రీఖండ మగురునా నొనరు నగరు
గంధచూర్ణంబు చెలఁగు బుక్కామనంగ, గందవొడియనఁగాను బుక్కాయన భవ.

యక్షకర్దమసంజ్ఞ యలరుఁ గదంబమ్ము, కలపము నాఁగను వెలయు సేస
యనఁగఁ బుష్పాంజలి తనరుఁ దోమాలెనా, మాలిక పువుటెత్తు పూలపొట్ల
మనఁగ మాల్యగ్రంధి యగు నెరతన మన, నాభోగసంజ్ఞమై యడరును దల
గడ తలాడ తలాపి తలయంపి యొరగునా, నుపధానసంజ్ఞమై యొప్పుచుండుఁ
దద్విశేషాభిధానంబు తగును బటువు, బిల్లదిం డన శయ్యాఖ్య చెల్లు సెజ్జ
పఱపు తలిపము దడిబను పాన్పు మెత్త, యనఁ దదాచ్ఛాదియెసఁగు లేఁపనఁగ శర్వ.

ఖట్వాఖ్య రాజిల్లుఁ గంకటి యం చనఁ, బట్టెమంచం బనఁ బరఁగు మృదుల
ఖట్వ రాజులు నల్పఖట్వ కుక్కి యనంగ, నలరు గోడనఁగ ఖట్వాంగ మెసఁగుఁ
బట్టెయం చనఁదగుఁ దట్టిక కుసి కూచ, మనఁ బట్టికాగ్రమై యలరుచుండుఁ
జిత్రాల్పపట్టిక చెలఁగు నవారనఁ, గటసంజ్ఞ చాపనఁగాఁ జెలంగుఁ
గందుకము చెండు బంతినాఁగను దనర్చు, దివ్వె దివ్వియ దివెదీవె దివియదీవి
యనఁగ దీపాహ్వయంబుగా నలరుచుండు, మాతృభూత జగత్త్రయీమాతృభూత.

దీవటీ దివ్వటి దివటి పంజనఁగను, గరదీపికాఖ్యయై పరఁగుచుండు
జుంజురు దుందురు సురుడు దివ్వెనకోల, యనఁ గాష్ఠదీపికాహ్వయము చెలఁగు
నీరాజనాభిద నెగడు నివాళి యా, రతినాఁగ వత్తినాఁ బ్రబలు వర్తి
ద్విముఖదీపిక గడిదేరు నీలాలినాఁ, ద్రిముఖదీపిక పేరు తేజరిల్లు.

దక్కాటి యనంగఁ బీఠంబు దనరుచుండు
గద్దె గద్దియ పీఁట నాఁగను గటాస
నమ్మ చదిరిక యనఁ జర్మశిమ్మ దనరు
నాసనార్థంబు సరసనా నలరుచుండు
మాతృభూత ! నిజాశ్రితమాతృభూత ! 165

సీ. పలక యనంగను ఫలకయాశయార్థ, ఫలక మొప్పును విసిపలక యనఁగ
ముక్కాలిపీఁ టనఁ బోలుఁ ద్రిపాత్పీఠి, భరణి మీఱును దార్వ బరణి డబ్బి
శీర్ణకరండంబు చెలఁగుఁ గరాటంబు, కరవటం బనఁగను బరఁగుచుండుఁ
దాంబూలపాత్రంబు తబుకం చనంగను, గంపెయం చనఁగను గుంపెయనఁగ
జాలవల్లిక యనఁగను సంపుటంబు, పొలుచు సంబెల యనఁగఁ దాంబూలధాని
యడప మనమీఱుఁ దమలపాకులనుబదిల, పఱుచునది పదర మనఁగఁ బరఁగునభవ.

సీ. పూగభాగమ్ములు పొలుచు బాగాలన, నెలవతి యనఁగను వెలయు ఖాది
రమ్మ కాచన ఖాదిరవట మొప్పును గైర, వడి యనఁ బర్ణస్తబకము చెలఁగు
నాకుఁజుట్ట యనంగ నడరును వృత్తప, ర్ణం బాకుమడుపన రహి వహించు
సున్న పుఁగాయనాఁ జూర్ణకరండమాఁ, బోఁకొత్తు నాఁగను బూగదళిని
దనరుఁ దాంబూలనామంబు తమ్మల మన, వీడె మన వీడియమ్మన వీడ్య మనఁగ
విడియ మన విడ్య మనఁగను విడె మనంగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 167

సీ. చర్వితతాంబూలసంజ్ఞయౌఁ దమునాఁ, బరఁగుఁ గళాచిక పడిగ మనఁగఁ
గాళాంజి యనఁ బతద్గ్రాహిణి దగు గూఁడు, చాట పంజర మనఁ జను వ్యజనము
విసనకఱ్ఱ సురటి వీవనయన చన, నవి యొండమఱుగిడ నాలవట్ట
మన విరాజిలును దువ్వెన యనఁ గేశప్ర, సాధిని వెలయును జనును గంక
తికయుఁ జిక్కంటి యంచనఁ దెలియఁదగును, వెలయు లీక్షావికర్షి యీర్పెన యనంగ
నద్ద మన . ముకురాఖ్యగా నతిశయిల్లు, వసుమతికృతశతాంగ చెవ్వందిలింగ.
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ నరవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత.

---

## బ్రహ్మవర్గము.

సీ. సంతు కొలము వంగసము వంగడము పదు,గన వంశసంజ్ఞ యై యలరుచుండుఁ
బరఁగుఁ జతుర్వర్ణ బాఁపన రాచ కో,మటి రెడ్డి నాఁగను మనుచునుండు
హెన్నెయం చనఁగను వర్ణాభిధాన మౌ, మంచివాఁడు సనువు మంచిసాదు
నన సజ్జనుం డొప్పు నమరును విప్రుండు, పాఱుఁడు భాఁపఁడు బాఁపనుండు

పుడమివేల్పన బ్రాహ్మణ్యము దనరారు, బాఁపటీక మనఁ దనరును బండితాభి-
ధాన మగుఁ దెల్వికాఁడు పెద్ద చదువరి యెఱుక గలుగువాఁడునాఁగ మేచకశిరోధి.

ఒప్పు నుపాధ్యాయుఁ డొజ్జ యనంగను, జన్న మనంగ యజ్ఞంబు చెలఁగుఁ
జదువునా బ్రహ్మయజ్ఞము దగు వేలిమి, యన దేవయజ్ఞంబు దనరు విందు
నాఁగ మనుష్యయజ్ఞము పొల్చుఁ దనుపు నాఁ, గను పితృయజ్ఞాఖ్య యొనరు బడిమి
యన భూతయజ్ఞమౌ నైదుయజ్ఞము లివి, యాస్థానసంజ్ఞ యై యలరు నోల
గమ్మ కొలు వన నది మించి కానుపింపఁ, బోలుఁ బేరోలగమ్ము నొడ్డోలగ మనఁ
బరుస యనఁ దైర్థికసభాఖ్య పరఁగుచుండుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

అగ్నిసాధనవిశేషాభిధ చెకుముకి, యనఁ దనరును హవిష్యంబు చెలఁగు
నిగిరికయం చన నిగిరికెయం చన, నామిక్షసంజ్ఞయై యలరుఁ గూను
పాలవిఱుఁగు నాఁగఁ బరఁగును బొంగలి, యనఁగను బాయసం బలరుఁ బులగ
మనఁ గృసరాన్నాఖ్య యొనరును దానమ్మాఁ, జాగము పెట్టొనఁ గీగి యీవి
పుకుసరింత పుడిగ తేగము పుడుకనఁగ, యాచ్న చెలువొందు వేఁడుటయడుగుటయన
విం దన నతిథినామమై వెలయుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 172

వెదుకుడు తడవుడు వెనుకుడు రోయుడు, నెమకు డనంగ నన్వేషణ మగు
నుజ్జన మనఁగను నుజ్జగింపనఁగను, విడి యన విడుపన విడుదల యన
విడుట ఘానుట యన వీడుకో లనఁగను, నెదుడనఁ దక్కన వదలుట యన
నలుట యనంగను దొఱఁగు టనంగను, నలరు విసర్జనాహ్వయము లెదురు
కొనుట యెదురేఁగుట యెదిరికో లనంగ, నభిగమన మొప్పు గౌరవ మ్మలరుచుండు
గారవింపన గారము గారవ మన, సెస యనంగను శుశ్రూష చెలఁగు నభవ. 173

త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగునాఁ, బర్యటనాఖ్య యై పరఁగుచుండు
నాచమనీయాఖ్య యలరు వార్పనఁగను, మౌనంబు పలుకమి నా నెసంగు
వరుస యనంగను బరువడి యనఁగను, గ్రమనామ మొప్పును రాజిలుఁ దడ
పాటు వీడ్పాటు నా వ్యత్యయ మగు నెడఁ, బా టనంగను నతిపాత మొప్పు
నియమ మలరారు నేమంబు నేమకంబు, కట్టడ యనంగ దేవతాకార్యనియమ
సంజ్ఞగాఁ బల్కఁబడు జన్నె జన్నియ యన, బతమనఁగ వ్రతము వెలయుఁ బార్వతీశ.

పస్తిల్లి నుంకు నిప్పస్తు ని ట్రనఁగను, నుపవాససంజ్ఞయై యొప్పుచుండు
బ్రహ్మబిందువు మీఱుఁ ద్రస్స యనంగను, మ్రొక్కు దండము కేలుమోడ్పెఱఁగుడు
నాఁగఁ జెన్నొందును నతి తద్విశేషము, ల్పేవిప్పు వెన్నెల చిన్నిపువ్వు
జోహారును జొహారు జోడాలు చెంగనాల్, డింగిళ్ళు గొబ్బిళ్ళు డెంకణాలు

నల్లానేరేళ్ళు జోదిళ్ళు ననఁగఁ దనరు, వేఁడికోలనఁ బ్రార్థన వెలయుచుండు
భిక్షు తిరిపము బికిరము బిచ్చ మాయ, వారమును జోగునాఁగను వఱలు నభవ. 175

సీ. అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాల, మారి బికాసి బికారి తిత్తి
గొట్టు తిత్తి తిరిపగొట్టునా వటుఁ డొప్పు, వడుగు బొమ్మచారి తడుపుదాల్చు
నా గృహస్థాభిధానం బిలువొర గేస్తు, నా వనసంవాసినామ మెసఁగు
నడవిసెలవరినా జడదారి యనఁగను, గనుపట్టు సన్యాసి కావిగోఁచి
దారి బోడ తబిసినాఁగఁ దనరు యోగి, జోగి నాఁదగు జడదారినాఁగఁ దపసి
నాఁగ బుషిసంజ్ఞ జందెంబునాఁగ జన్ని, దం బనఁగ యజ్ఞసూత్రమౌ నంబరకచ.

సీ. పాసఁగుఁ గమండలు బుడిగ యనంగనుఁ, బుడ్డిగ యనఁగను బుడ్డి యనఁగ
బోలెనాఁగను గకపాలనాఁగను గక్షు, పాలాహ్వయంబుగాఁ బరఁగు ధార్య
చర్మనామము కళాసము కళవస మన, యోగివేత్రాభిధ యొప్పు లాత
మనఁగ ముండనసంజ్ఞ యలరుచునుండును, గోఁగుట బోడింపు గొఱుగుట యన
నుపనయన మగు వడుగునా నొప్పఁగును వి, వాహనామంబు పెండ్లి చేపట్టు కాలు
ద్రొక్కు పెండిలి యనఁగఁ బెంపెక్కు నేఁగు, పెండ్లనఁదదంతవీథికావిహృతియభవ.

సీ. వడుగుపెండ్లిండ్లలోపలఁ దృతీయదినఁబు, పాకెన్న యనఁగను బరఁగుచుండు
నాఱెంటికిని వేఱె యగుచు నంత్యదినంబు, లవుడు గంబవలి నాగవలి యనఁగఁ
బెండ్లికూఁతు రనంగఁ బెండ్లికొడు కనంగఁ, గ్రమముగాను వధూవరాఖ్యలు దగుఁ
జిమ్మనగ్రోవినా శృంగమౌఁ దద్భేద, మండె బుజ్జటకొమ్ము ననఁగ వెలయుఁ
గొఱలుఁ గవయుట కూడిక కూటమిక ల,యిక యన రతి యహిరతి యొసఁగు మనక
మనఁగఁ బఱుమ్పగరతము చెన్నలరుఁ ద్రొక్కు, డనఁగఁబొర్లుట యనఁగ దేవాధిదేవ.

సీ. పొత్తనఁగ సజగ్ధి పాలుచు బువ్వ మనంగ, స్వజనవివాహసజగ్ధి దనరు
హారిబువ్వ మన వివాహచతుర్థదినరాత్రి, బంధుజనసజగ్ధి పరఁగుచుండుఁ
బాలిక జాదారపాలిక నాఁగను, నంకురార్పణశరావాఖ్య దనరుఁ
బ్రథమవధూవరభవనప్రవేశాఖ్య, యిలునింపడ మనంగ నెసఁగుచుండు
నుంకు వన నోలి యనఁగను సంకనంగఁ, బైఁడి యనఁ గన్యకాశుల్కవాచక
సరణ మనఁ బిత్రుదత్తకన్యాధనంబు, పాలుచును వినంగ శ్రీమాతృభూతలింగ.

సీ. ఉపరిసురతసంజ్ఞ యొప్పును మగపోల్కి, కూటమి యనఁగఁ బైకూటమి యన
మణితవాచకములై మనుఁ బావురాపల్కు, లనఁగఁ గూఁకీపల్కు లనఁగ నవియె
లోఁగుక్క వెలిగ్రుక్క నాఁగఁ జెలంగును, దంతక్షతాభిధ తనరుచుండుఁ
బలుగంటు పలునొక్కు పలుగెంపు లనఁగను, గరరుహక్షతములు మెఱయుచుండు

గోరువంకలు చందురుకూన లనఁగ, ముద్దునాఁగను జాంబనం బొప్పుచుండుఁ
బొల్చుచుండును దొంతరము ద్దనంగఁ, దద్విశేషంబు మాతృభూతాభిధాన. 180

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ బ్రహ్మవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 181

---

## క్షత్త్రియ వర్గము.

సీ. రాచవాఁ డనఁగను రాజన క్షత్త్రియుఁ, డొప్పు నేలిక సామి యొడయఁడు దొర
రాయఁడు రాఱేఁడు రాజెకిమీఁ డన, నరపాలసంజ్ఞలై పరఁగుచుండు
రాచఱిక మ్మన రాయఱిక మ్మన, రాజరాడ్భావకర్మములు వెలయు
లక్కుముఁ డనఁ దగు లక్ష్మణుఁ డనిలజుఁ, డలరును వడముడి వలిమొల కనఁ
బార్థుఁ డెసఁగును గత్తి కవ్వడి యనంగ, నకులసహదేవు లలరుదురు కవలనఁగఁ
జెలఁగు దుశ్శాసనుఁడు దుస్ససేనుఁ డనఁగఁ, బ్రబలు దుర్యోధనుండు రారాజనభవ.

సీ. విరటుఁ డనంగను వెలయు విరాటుండు, మండలేశ్వరుఁ డొప్పు మన్నెవాఁడు
మన్నీఁ డనంగను మండలేశత్వంబు, మన్నెఱికం బన మనుచునుండు
గుత్తకాఁ డనఁగను గుప్తికారుఁ డెసంగు, మంతునాఁగను ద్యూతమంత్రి యెసఁగు
బ్రెగడ ప్రెగ్గడ యనఁ దగుఁ బ్రధానుఁడు దగ, వరి తీర్పరి యన ధర్మజ్ఞుఁ డలరు
మీఱు నారక్షకాభిధ యాఱెకుఁడు తలారి తలవరి యనఁగ శుల్కాధికారి
చనును సుంకరి యనఁగను షండుఁ డొప్పు
నెగ్గడి యనంగఁ గంచుకి యెసఁగుచుండు, బొందడీఁ డన శ్రీమాతృభూతలింగ. 183

సీ. కటికవాండ్ర నఁగను గట్టిక లనఁగను, పణిహారు లనఁగను బరఁగుచుండు
వేత్రహస్తాభిధ వెలయుఁ జారసమాఖ్య, వేగులవా రన వేగరు లన
బహువచనమ్మునఁ బడవాళ్లనంగను, దళపతినామము ల్దగుఁ బడాలు
దళవాయి పడవాలు దణి యనంగను నల్వ, సైన్యాధిపతి యొప్పు జంగిలి గమి
కాఁ డనంగను సేవకాఖ్య లగు జీత, గాఁడు కొల్వుడుగాఁ డనఁగాను భటుఁడు
పరఁగు జోదన లెంకన బంటనంగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 184

సీ. చుఱుకరి యనఁగఁ దెంపరియన శూరాఖ్య, ధానంబుగాఁగను దనరుచుండు
నొంటరి యొక్కటీఁ డొంటరీఁ డొంట్రింపు. నానేకభటునకు నామ మగును
గాల్వురు నాఁగను గాల్బంటునాఁగఁ బ, దాతినామంబుగాఁ దనరుచుండు
శపథాయుధనిషేవి చనును గైజీతమం, చనఁగను మాసియం చనఁగ నైరి

మనును సొంటనివాఁ డన మార్తుఁ డనఁగఁ, బగతుఁడనఁబగఱనఁబగవాఁ డనంగఁ
గంటనఁగ గొంగ యన సూఁడుకాఁ డనంగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.185

సీ. చుట్టము పక్కము చుట్ట నెచ్చెలి చెలి, కాఁడు నెయ్యుఁడు సంగడీఁడు పొందు
కాఁ డంటు చెలి నేస్తకాఁడు సంగడికాఁడు, నాఁగను మిత్త్రునినామము లగుఁ
బగ సూడు కంటునాఁ బరఁగు విద్వేషంబు, చెలిమి చుట్టఱికంబు చెల్మి నెమ్మి
నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి, యొద్దిక యొమ్మిక యొండొరిమిక
పొం దొరిమె పొత్తుగారము పొందిక యనఁ, బరఁగుచుండును మిత్త్రిభావంబు బట్టు
క్రిక్కులనఁ బాఱకాఖ్యలు గేరుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 186

సీ. నమ్మినవాఁ డన నచ్చినవాఁ డనఁ, జనవరి యనఁగను దనరు నాప్తుఁ
డలరును గరణమం చన లెక్కవాఁ డన, గణకాభిధానంబు కరణికమన
గణకునిభావంబు కర్మంబు వెలయును, లిపికారకుం డొప్పు లేకరి యన
వ్రాఁతకాఁ డనఁగను వ్రాలునా వ్రాఁతనా, లిపి యొప్పు నక్షరాల్ వెలయుచుండుఁ
నక్కరము లచ్చరమ్ములం చనఁగఁ గ్రాఁవ, గిలక యన రేఫ మెసఁగును గియ్యయనఁగ
నడరును యకారనామంబు సుడియనంగ, వట్రువయన ఋకారమై వఱలు నభవ.187

సీ. బొట్టన సున్ననఁ బొలుపొందు బిందువు, నిడుదన దీర్ఘంబు నెగడుచుండు
జడ్డయం చనఁగను సంయుక్త మొప్పును, గణితంబు లెక్క నాఁగను దనర్చుఁ
గమ్మ యనంగ లేఖ యగు రాయసమున, రాజలేఖ దగుఁ గిల్లాసు చీటి
యన ఖండపత్త్రిక యలరును గౌలన, నభయపత్త్రాభిధ యలరుచుండు
ఘట్టితపటంబు వెలయును గడిత మనఁగ, వెలయుఁ గాకిత మనఁగఁ దద్భేదసంజ్ఞ
యాడె యనఁగఁ దదేకదేశాహ్వాయ మగుఁ,బుస్తకము పొత్తమనమిఱు భుజగభూష,

సీ. గంట మనంగను గనుపట్టు లేఖిని, కలమము కలము నాఁగను దనర్చు
రాయబారి యనంగ రాజదూతయగుఁ ద, ద్భావంబు తగు రాయబార మనఁగఁ
బథికుఁడు దగు దెరువరి యన మార్గజ్ఞ, సంజ్ఞయౌఁ జొప్పరి జాడకాఁడు
నాఁ బలుపట్టడనాఁగఁ బౌరశ్రేణి, పొలుచును రాజ్యాంగములు దనర్చు
సామి ప్రెగ్గడ చెలి బొక్కసము తెరస్తు, కోట పోఁ జనఁగాను షడ్గుణము లగుచు
చేరుకొనఁగాను దగు సంది పోరు పోక, యునికి రంటన నొండన నుగ్రమూర్తి.189

సీ. వాఁడిమి జతనము మంతనంబనునట్టి, యివిమూఁడు శక్తులై యెసఁగుచుండుఁ
దగుఁ ద్రివర్గాభిధ తగ్గు నిల్కడ పెరు, గుదు ననునివిమూఁడు గొఱలు నవలఁ
జతురుపాయంబులసంజ్ఞయై మం చీగి, వేఱు కొట్టన నాల్గు వేఱు వేఱ
వేఁడిమి యనఁగన్ను వాఁడిమి యనఁగఁ, బ్రతాపాభిధానంబు తనరుచుండు

దండు వన దండు గనఁగను దండమునకుఁ, బ్రతినిధిగఁ దీయు ద్రవ్యంబు పరఁగు విజన
మొంటిపా టేకతం బన నొప్పుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 190

సీ. నమ్మిక నాఁగను నచ్చిక నాఁగను, విశ్వాససంజ్ఞమై వెలయుచుండు
నిమ్మళం బనఁగను నిష్కళంకత్వ మొప్పు, నిశ్చింత దనరును నెమ్మది యనఁ
దగ వనఁ బాడి నాఁ దగు న్యాయనామంబు, మనును జాలిక నా సమగ్రనాఖ్య
యానతి యనఁగను నాన యనంగను, సెలవు నా ముదల నాఁ జెలఁగు నాజ్ఞ
గడు వనఁగ మేర యనఁగ నుగ్గడి యనంగ, నడరు మర్యాద తప్పిదం బాగడంబు
దుడుకు నేరము నేరమి దుండగంబు, తప్పనఁగ నపరాధము తనరు నభవ. 191

సీ. అరి బడి యప్పన మప్పన పంగము, పంజి పన్నాడి కోల్పగిది బెడిగ
కోరనఁగాఁ జెలఁగును భాగధేయంబు, గృహభాగధేయ మా నిల్లరి యనఁ
బుల్లరి నాఁగ నొప్పును దృణభాగధే, యంబు కాలరి నాఁగ నమ్ముపు నాఁగ
నభిగంతృభాగధేయము చెలంగును సెల, వన ధాన్యపరిమాతృభాగధేయ
మలరుచుండును వట్టమం చనఁగ వెలయు, హాయదీనారముఖభాగధేయసంజ్ఞ
సుంకమన దాణమనఁగను శుల్క మెసఁగు, లంచ మనఁగను నుపదమై మించు నభవ.

సీ. కానుక కానిక కప్పము నూడిద, యులుపా యుపారంబు నులుప యనఁగఁ
జను నుపాయనసంజ్ఞ చామరం బొప్పు విం, జామర యనఁగను సౌర మనఁగఁ
దద్భేదసంజ్ఞయై తనరారు గొడుగన, గొడుగు వన ఛత్త్రాఖ్య యడరుచుండు
జగజంపనంగను జల్లి నా జంపన, ఝల్లరీనామమై యుల్లసిల్లు
వర్షవారణనామమై వఱలు జగ్గు, గొడుగనఁగఁ జర్మఫలకంబు కొఱలు నరిగె
యనఁగ భృంగారు గిండి నాఁ జను బిరుదము, బిరుదనఁ బవాడ మనఁగను బరఁ

సీ. వేలము పాళెము వీడుపట్టు బిడారు, విడిది యంచనఁగ నివేశ మొప్పుఁ
జదలమం చనఁగను స్కంధవారము మీఱు, నేనుంగు హత్తి గౌ రేనుఁ గేన్గు
నాఁగ దంతావళనామమౌ మొక్కడీఁ, డన నల్పదంతగజాఖ్య దనరుఁ
గలభంబు గున్న నాఁగను జెలువొందును, బెంటియేనుఁ గనంగ వెలయుఁ గరిణి
తొండ మనఁగను శుండాఖ్య తోఁచు జాల, పొగరుపాడ యనఁ బద్మ ముల్లగును [illegible]
యనఁగ ఘీంకారనామధేయంబు చెలఁగు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 194

సీ. మదము రాజిలు మస్తు మత్తు మత్తాయన, నాలానసంజ్ఞయై యలరుఁ గట్టు
కంబ మనంగఁ దోత్త్రంబు బరి యనఁగ, నారెగోల యనంగ నలరుచుండు
శృంఖలనామంబు చెలఁగు సంకెల యన, నంకుశనామమౌ నంకుసమ్ము
సిడి యన సొరిజన నడరుఁ గక్ష్యాభిధ, కుథము జూల్ లేపనఁ గొఱలుచుండు

నొప్పుఁ జోడో లనంగ దంత్యుపరిడోల, వారి పంగెన యనఁగను బంగిడి యన
నోద మన మూఁడుపేళ్ళచే నుల్లసిల్లు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 195

సీ. పరఁగు నశ్వంబు బాబా వావురము వారు, వము జక్కి తత్తడి మావు గుఱ్ఱ
మన దేశభేదహయాభిధలు హరబ్బి, తురికి కచ్ఛి యనంగఁ దోఁచుచుండుఁ
బాగా యనఁగ నశ్వపంక్తి విరాజిల్లుఁ, బూజ్యాశ్వసంజ్ఞ యొప్పుఁ బడివాగె
తేజినా వర్తితవాజియాఁ గత్తలా, ని యనంగఁ గత్తలాన యనఁగాను
ఘోటకవిశేష మెసఁగును గూబు నాఁగ, మూషకహయంబు వెలయును మోటునాఁగఁ
దట్టు వన నీచతురగంబు దనరుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 196

సీ. తేజినా నున్నతవాజియై విలసిల్లు, బడబ గోడిగ నాఁగఁ బరఁగుచుండు
బడబాబుతుసమాఖ్య యడరు నత్తడియన, సాబను నాఁగ బడబచూలు వెలయు
సకిలిం పనంగను సకిరింత యనఁగను, హేషాభిధానమై యెసఁగుచుంచుఁ
గంద మనంగను స్కంధంబు దగుఁ దోఁక, లవిటి నాఁగలు బుచ్ఛము విలసిల్లుఁ
గొన యనఁగఁ గేసరం బొప్పు గొరిజ డెక్క, గిట్ట యన ఖురనామంబు గేరుచుండు
నడ పనంగను నడ యన నడరును గతి, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 197

సీ. జంగనడపునాఁగ జంఘాలగతియొప్పుఁ, జనును లుక్కఁనగ నీచగతిపేరు
రవగా ల్రవాలునా రాజిల్లు నాస్కందితము, జోడన యనంగ ధౌరితకము
వెలయును బేరెము వేడెము జాలెము, బవిరినా రేచితంబు విలసిల్లుఁ
జొకళిం పనఁగను దూకుడనంగను, వల్గిత మ్మగును దువాళి మన దు
వాళి యనఁగను బ్లుతముగావలలుచుండుఁ, బొలుచు నాస్కందితవిశేషము మొనగాల
నంగఁ బ్లుతగతిభేదంబు జంగగంతు, దాఁటు పల్లటీ దుముకునాఁ దనరు నభవ. 198

సీ. అశ్వతనుత్రాణ మడరుఁ బక్కెర యనఁ, బల్యాణ మొప్పును బల్ల మనఁగ
జీనంబు మెత్తన జేననఁ దనరును, గ్రాలు ఖలీనంబు కళ్లె మనఁగ
వాగె యంచనఁగను వల్గాఖ్య మెఱయును, మొగము ట్టనఁగ నశ్వముఖవిభూష
దనరు దలాటమం చనఁగ నశ్వశిరోధి, భూషణసంజ్ఞ యై పొసఁగుచుండుఁ
దంగనఁగ నశ్వమధ్యబంధంబు మీఱుఁ, జొకనఁగఁ దఱ టనఁగఁ గశాఖ్య వెలయుఁ
గొఱప మనఁగ ఖురత్రప్రము పరఁగుఁ గవణ, మనహయాహారభేదంబు లగు మహేశ.

సీ. అంకవన్నె యనంగ నశ్వపార్శ్వాలంబి, రజ్జుసమాఖ్య యై ప్రబలుచుండుఁ
బంచకం బన నశ్వపశ్చాత్ప్రదేశమా, నశ్వఛాదనసాధకాస్యలంబి
భత్రి బొక్కెన యనఁ బరఁగుఁ గైజామోర, యన హయశీర్షకంపనము వెలయుఁ
బాలాపత్రాళ్లను బంధరజ్జువు లొప్పు, వేసడం బనఁగను వేసర మన

వ్యాసటిక విలసిల్లును నరద మనఁగఁ, దేరు నాఁగను రథసంజ్ఞ మీఱు బండి
యనఁగ శకటసమాఖ్యయై యలరుచుండు, ద్యూతశకటంబు సగ టనఁ దోఁచు నభవ.

సీ. కంబళివాహ్యకాఖ్యలగుఁ గొల్లార్ బండి, పాటబండి హొయలుబండి యనఁగ
నలరుఁ దృణాద్యానయనసాధనవిశేష, సంజ్ఞ యీడిక యన సరవడి యనఁ
గట్లయం చనఁగను గట్లమంచ మనంగ, యాప్యయానాభిధ యలరుచుండు
నుయ్యాల యనఁగను నుయ్యెల యనఁ దొట్లి, యన లాలి యన డోల దనరుచుండుఁ
బరఁగు బల్యంకికకుఁ బేరు పల్లకి యనఁ, జెందు నాందోళికకు సంజ్ఞ యందల మనఁ
గొఱలుఁ దదుభయదండంబు కొమ్మనంగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 201

సీ. అను సనఁ దొడు పనఁ నాందోళికాదిదం, డాగ్రసంధేయాఖ్య యలరుచుండుఁ
బన్నాగ మనఁగను భాసిలుచుండును, నాందోళికాద్యవయవసమాఖ్య
బండికల్లనఁగను బరఁగును జక్రంబు, బండికన్ననఁగను బరఁగు నాభి
బండికన్నులయందుఁ బట్టించుచమురు కంధ, దెన యనఁగను గడిదేరుచుండు
నేమి దనరారుచుండును నెమ్మి నెమ్మి, కమ్మి యనఁగను దగుఁ గూబరమ్ము పరము
నాఁగ నక్షాభిధ యిరుసునాఁగ వెలయు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 202

సీ. చీల జంజడ యాణి చిలుకయం చనఁగను, దైనితకాభిధగాను దనరు
నొగ యనఁగా నెంచఁదగు యుగంధరసంజ్ఞ, యుగ్యసంజ్ఞ కాఁడినా నొప్పుచుండు
నెకిరింత యనఁగను నెక్కుడనంగను, వాహనసంజ్ఞ యై వఱలుచుండు
మావటీఁ డనఁగను మావంతుఁ డనఁగను, నాధోరణునిసంజ్ఞ యలరుచుండు
రవుతు రౌతు రావు తనంగ, రాహుతుఁ డగు, బరిగిరౌ తనఁ బల్యాణబంధరహిత
హయసమారోహకాఖ్యమై యలరుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. గుల్లా మన గుఱాలగోచనఁగా గుల, ప యనంగఁ దగు నశ్వపాలకుండు
పారివాఁ డనఁగను బరిచరుం డొప్పును, బేరణ మనఁగను బేరని యన
మైమఱు వనఁగను మేమఱుఁ గనఁ గత్తి, శి మ్మనఁగా బొందళం బనంగ
జో డనఁ గవచంబు శోభిలుఁ జిలుకత్తు, జీరా యనఁగఁ దద్విశేషము లగుఁ
జను శిరస్త్రాంబు గొగ్గి సీసకము బొమిడి, కం బనంగను. బేటినాఁగను దనర్చు
సారసనసంజ్ఞ సాచి భుజావలంబి, కృత్తి పదుదల డాబన గేరు నభవ. 204

సీ. సన్నాహనామంబు సముకట్టినది యాయి, తము సజ్జ కట్టాయిత మన వెలయు
విలుకాఁ డనంగను వింటివాఁ డనఁగను, ధన్విసమాఖ్య లై తనరుచుండు
నారీతి నాయుధాహ్వయములఁ బరికించి, తజ్జీవిసంజ్ఞలఁ దలఁపవలయు
మావటీఁ డనఁగను మాస్టీఁ డనంగను, సాదకాఁ డనఁగను శస్త్రిదక్షుఁ

డలరుఁ దద్విద్య సాధన యనఁగ సెగడు, నఱుకు పరువడి గాయమానంబు విసరు
మొన లనంగను దద్భేదములు చెలంగు, నొక టొకటి పెక్కువితములై యొప్పు నభవ.

సీ. సాధనాయుధములు సానకత్తి యనంగ, బొందకోల యనంగఁ బోలుపుఁగాంచు
మాసటిపోట్లాటమట్టుకుఁ దగుకత్తి, చేకత్తి యనఁగను జెలఁగుచుండు
జింకకొమ్ములు రెండు చేర్చి యల్లు లమర్చి, డాఁకేలఁ బూన సొ డ్డనఁగఁ బొడువ
సంగతిగలయది సింగోట యనఁగను, దివిదారికొమ్మునాఁ దేజరిల్లు
సొంటిపోట్లాటఁ గోరుచున్నయట్టి, మాసటీలకుఁ గైదువు లమ్మట్టుఁ జూచి
యేరుపఱచుట వెలయుఁ గోలారిక మనఁ, దద్రణావని పడవనాఁ దగును నభవ. 206

సీ. మనుసు జెట్టి యనంగ మల్లాభిధానంబు, తద్విద్య సామనఁ దనరుచుండుఁ
గస్సాతలు పుటము లస్తాలు మండీలు, దాళాలు డింకీలు దండెములును
లాగు లనంగను రాజిల్లుఁ దద్భేద, నామధేయంబు లెన్నంగఁ గొన్ని
తత్సాధనంబులై తగుఁ గంబము కొణత, కటి కన లోడుసంగడము బాల
సంగడము నీలగోతా మనంగఁ గొన్ని, దట్టియనఁ గచ్ఛమగును జేతాళ్లనంగ
మల్లయుద్ధాయుధాఖ్యలై యుల్లసిల్లు, ముళ్లనఁ దదగ్రనామము లొప్పల్చు నభవ. 207

సీ. బిరుదువేసినజెట్టిపరివార మగునట్టి, వా రొప్పుదురు హాంతకారు లనఁగ
గుద్దులాటకు జెట్టఁ గూర్చువానికిఁ బేరు, దసువంది యనఁగను దనరుచుండు
నఱుకువాఁ డనఁదగు నన్యజాతీయుండు, కవణకాఁ డనమీఱు గమనబోధి
మల్లచఱు పనంగ మల్లచఱుపు డన, భుజసమాస్ఫాలనం బొప్పుచుండు
దండ యనఁగను ముష్టియుద్ధాదిమగతి, మించు నందున మద్దెళసంచు మొదలు
కొన్ని భేదంబులు చెలంగు నన్ని దెలుప, గ్రంథవిస్తరభయముచేఁ గాలకంఠ. 208

సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కెస తొట్టు, రూఁణింపు బరిషోటు రొండిప్రేటు
వింటాళము పణమ్ము పెట్లాగు పాఱమ్ము, డొక్కర ముత్తర డొక్కరమ్ము
కస్సాత బాంగణ కందణంబు తిణింగి, గొంతుమాఱును జేబ కుమ్మరింపు
కాసె నీల్కడ గళకత్తెగ జోడింపు, నరసింగ ముసిరి బిత్తరము కిల్లి
చాగు సమసీసము తడకాల్ సందుసీస, మంజ మెడపట్టు నాఁగఁ జెన్నలరుచుండు
ముప్పదియురెండువిన్నాణములకుఁ బేళ్ళు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 209

సీ. వెంబడి బాసట వెంటతో డనుగల, మనుఁ గనఁగను సహాయాఖ్య దనరుఁ
దోడ్పా టనంగను దోఁచు సాహాయ్యంబు, దండు దడ మనంగఁ దనరు సేన
యుభయసేనాభిధ యొప్పిరువా గనఁ, బొల్చు సేనాముఖము మొన యనఁగ
వ్యూహంబు వెలయుచునుండు మొగ్గర మన, నొడ్డణమం చన నొడ్డనంగ

వెలయు సంపద సిరి లచ్చి కలిమి యనఁగఁ, బరఁగుఁ బేదఱికంబు నిష్పచ్చరమ్ము
నైవ్వ యెద్దడి లేమినా నివ్వటిల్లు, రిక్తతకు నామధేయము ల్భక్తవరద. 210

సీ. చేటు చెడిది చెట్ట సేగి సిలు కనంగ, నాపదభిఖ్య లై యలరుచుండుఁ
జేడ్పాటనంగను జెలఁగు నాపత్ప్రాప్తి, కైదువ యనఁగను కత్తి యనఁగ
నాయుధ మొప్పు విల్లన ధను వెసఁగును, సింగాణి యనఁ దగు శృంగధనువు
అటని చెల్వగును గొప్పనఁ బిడికిటికట్టు, నాఁగను లస్తకనామ మొప్పు
నల్లె యరి నారి గొనయమం చనఁగ వెలయు, మౌర్వి దనరారుచుండుఁ దన్మధ్యతంతు
బంధ మరిపోసి యనఁగఁ గూన్పరి యనంగఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 211

సీ. అమరు గుణారోహణాభిధానం బెక్కు-, పెట్టుట యనఁగ మోపెట్టుట యనఁ
దెగ యనఁగా గడిదేరును జ్యాకృష్టి, చాపకర్షణబలసాధనంబు
ద్రోణ మనంగను దోఁచు బల్వగువిల్లు, దనరియుండును గపోదాయనంగఁ
బరఁగు లెప్ప యనంగ గుఱి యనఁగఁ బతన, లక్ష్యాభిధానంబు లక్ష్యవీథి
కొఱలు సూటన నమ్ము లకోరి తూపు, కోల యనఁగను శరము తగును దనర్చు
సరుసునాఁగను గరిలేనిశరము పేరు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 212

సీ. పారవాత మ్మనఁ బరఁగుచునుండు వి,శాలముఖం బైనసాయకంబు
దుష్కంటకశరంబు దోఁటమ్ము నాఁగను, జిల్లకోలయనంగఁ జెలఁగుచుండు
దోనమ్ములం చన నొ నల్వశరములు, నారాచ మొప్పును నారస మనఁ
జాపానపేకుమౌశర మొప్పుచుండుఁ జే, యమ్మం చనంగ జోడ మ్మనంగ
నంపర యనంగ శరసమూహంబు దనరు, జిలుకనఁగ ములికి-యనఁగను ఫలముదనరుఁ
బింజ రొాదయనఁ బుంఖంబు వెలయుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. తరకసమ్ము పొది బత్తళిక పొణివడమ్ము, దొన యనఁ దూణీర మొనరియుండు
వాలు ఖండా కరవాలు మేల్కత్తి త, రవళి నరాజి పిరంగి యడిద
మన ఖడ్గనామమై యలరుచునుండును, దార నా వాయినా ధార వెలయుఁ
జాయ లంచన నసిచ్ఛాయలై తగుఁ గృపా, ణీరేఖ లొప్పును దోరములనఁ
బెణికనాఁగను గరవాలపృష్ఠ మొప్పు, మీఱును గృపాణికాగ్రంబు చూరియనఁగ
సురె కటారి పిడెం బన శోభిలును గ, రాసినామంబు లై నిటలాగ్ని నేత్ర. 214

సీ. పట్టసనామము ల్పట్టెమన మొహదా, యన నడ్డకత్తినా నలరుచుండు
నొఱయనఁ గోశాఖ్య యొప్పుఁ జిల్కడ యనఁ, దద్బంధగుణసంజ్ఞ దనరుచుండుఁ
గోశాంతకోశాదిగుప్తి భూషలు కుప్పె, యన నరడా యన నగుఁ గ్రమముగఁ
గోశసమాచ్ఛాది కొఱలు గలీ బన ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము

పరుఁ జనఁ బరుం జనంగను బరఁగు నదియె, చనును నెమ్మిలిపరుఁజునా జాపరుఁ జనఁ
బిడి యనంగ నుత్సర్వాఖ్య వెలయుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. పరుఁజులోపలఁ జీలపట్టించునలుగువా, యమరుపర్యోగ్యమైనట్టితావు
మొసలికా టనఁగను మొసలివా యనఁగను, జిమట యనంగను జెలఁగుచుండుఁ
బలకయం చనఁగను ఫలకసమాఖ్యయౌ, ఖేటక మెసఁగును గేడె మనఁగఁ
దద్భేదనామమై తనరును జిల్లోటి, కేవడ మం చనఁ గేరుచుండు
గుదె గుదియ దుడ్డు గునుపము గుదుపయనఁగ, ముద్గరము భిండివాలమ్ము పొలుచుఁ జిల్ల
కో లనఁ దగుం గుఠారము గొడ్డలియన, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 216

సీ. ఖండపరశు వొప్పుగండ్రగొడ్డలి యన, బరిస బడిత యనఁ బరిఘ మొప్పు
సెలకట్టె యనఁగను వెలయు శల్యము సురె, సురియ చూరి యనంగ ఛురిక దనరు
జముదాడి యనఁగను యమధాటి చను సేజ, బరిచి యీటె యనంగఁ బరఁగుఁ గుంత
మలరును గొఱ కన నల్పకుంతాభిధ, బల్లె మనంగను భల్ల మమరు
బాగుదా రన నల్పాసి పరఁగు బాఁకు, వంకి చిల్లాణ మనఁగను వక్రశస్త్రి
మలరుచుండును డొంకెన యనఁగ వెలయు, నాయుధవిశేషనామమై యబ్జవకాళి. 217

సీ. వాయిదా రనఁబడు వంకలు గలకత్తి, దోదుమ్మి సై బనఁ దోఁచుచుండు
నాలకుణముగల్గి యాగతి వంపైనఁ, బరఁగుచునుండును గిరు సనంగ
సొడిసె యనంగను నడరు నావిద్ధము, గ్రాలుఁ ద్రికాష్ఠి తిక్కటి యనంగఁ
దగు శిలాయంత్రంబు దంచన మనఁగను, వసి గసి మే కన నెసఁగు శంకు
భేదనామంబు లగును భోభిల్లును సుర, కోవి పీరంగి బాణము గుంటకోవి
జబురుజంగి తుపాకి జజా యనంగ, వెలయు నగ్నిప్రసారణాఖ్యలు మహేశ. 218

సీ. బాదరు నాఁగను బరఁగుఁ దుపాకిలో, పలను జానకిత్రాఁడు నిలుపుతావు
చుఱుకైనమందుపే ర్పరఁగు రంజక మన, లగ్గనఁ బ్రాకారలంఘనంబు
అది రెండువిధములఁ బొదలుచునుండును, లగ్గనా సురతాణిలగ్గ యనఁగఁ
బాషాణదార్వగ్ని భాండాదికాభిధ, లగ్గదిం పనఁగఁ జెలంగుఁ బోక
తరలుడు తరలిక యరుగు డరుగడమ్ము, కదలుడు కదలిక కదలు కదలడమ్ము
చనుట యేఁగుట మేగుడం చనఁగ యాత్ర, తగును దైవతయాత్ర జాతర యన భవ.

సీ. వెలువడుట యనంగ వెడలుట యనఁగను, నిర్గమనాఖ్యగా నెసఁగుచుండు
నెఱయుట యనఁగను బరఁగుఁ బ్రసరణాఖ్య, యభియానము దనర్చు నఱముటయన
విద్రావణాభిఖ్య వెలయుచునుండుఁ దో, లుట యనంగను బఱచుట యనంగ
నెసఁగు నపక్రమము మీఁడేఱె ననఁగను, దాడి యనంగను ధాటి యగును

దుమ్ము దువ్వ దుమారము త్రుమ్ము తుమురు, దన పదటు బుగ్గి నాఁగను దనరు ధూళి
నురుము నుగ్గు పొడుము పొడి సురుము సున్ని, చూరనంగను విలసిల్లుఁ జూర్ణ మభవ.
డాలు టెక్కెంబు సిడమ్ము పడగ యనఁ, గేతు నామంబులు గేరుచుండు
సహమహామిక పేరు రహి కెక్కు నోహారి, సాహరి యనఁగను సమరయాత్ర
పొరి నాఁ దగు లావు సత్తి సత్తువ బల్మి, పీఁచ మోపిక యన వెలయు శక్తి
సలిగ యం చనఁగ నాశ్రయబలంబు చెలంగుఁ, గడిమి యుక్కు కఱుకు గట్టి కడిఁది
నాఁగ శౌర్యాభిధానంబు గాఁగ జెలఁగు, బీర మనఁగను బిగువన బింక మనఁగఁ
బరఁగు గర్వంబు వెలయును బంద కోఁచ, పిఱికి దొంబులి గొట్టన భీతుఁ డభవ. 221

పోరాట పోట్లాట పోరు కయ్యము చివ్వ, కంగారు కంగిస కలను దురము
గొడవ బవరము జగడ మాల మని యన, యుద్ధవాచకములై యొప్పుచుండుఁ
దనరును బెనఁకువ పెనఁగులాట యనంగఁ, బెనయన గుద్దులాటనిన యుద్ధ
మలరు దండడి దొమ్మి యన సంకులరణాఖ్య, దంటపో రనఁదగు ద్వంద్వయుద్ధ
మలరుచుండును గన్నె కయ్యం బనంగఁ, బ్రథమయుద్ధాఖ్య యొక్కటి బవరమనఁగ
నొంటిపోట్లాట పేరుగా నొప్పుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 222

ఆర్పు బొబ్బ యనంగ నగు సింహనాదంబు, క్రందనఁగాఁ దగుఁ గ్రందనంబు
సొరుగు సొలపు సొమ్మ సొలిమిడి సోలు సు, మాళము బవిళి మైమఱపు బ్రమరి
యనఁగ మూర్ఛాహ్వయం బలరారుచుండును, రాయిడి రారాపు రంప మనఁగ
నవమర్దనం బొప్పు హావడి యావడి, యన నుపద్రవసంజ్ఞ దనరుచుండు
డామరం బగుఁ జూఱ కొల్ల పరి యనఁగ, వలసయనఁ బ్రవాసాఖ్య గావఱలు జయము
గెల్పు గెలివిడి గెలుపము గెలుపనఁదగు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 223

పగయీఁగు టనఁదగు వైరశుద్ధి పరుగు, పరువు పాఱుట ధావనము చెలఁగు
గునుకు డనంగను గును కనఁగా నల్ప, ధావనసంజ్ఞయై తనరుచుండుఁ
దోలఁగు డనంగను దలఁగు డనంగను, నపసరణాఖ్యలై యలరుచుండు
నపజయసంజ్ఞలై యలరు బన్నము విఱు, గోటమి యోడుట యోల చెంగ
నాలు విఱుగుడు విఱుగు నాఁ గ్రాలుచుండుఁ, ద్రుంచుట చిదుముట తెగటార్చు పరిమార్చు
పొరిగొనుట పిల్కుమార్చు చంపుట తునుముట, యనఁగఁ దగు హింస భక్తహృద్వనజహంస.

సమయుట యీల్గుట చావు చక్కడఁగుట, క్రుంగుట త్రుంగుట కూలుట దుది
త్రెళ్లుట మడియుట తెగుట డీల్పడుట నీ, ల్గుట మొదల్చెడు టడంగుట పొలియుట
మిత్తి పెన్నిదురనా మీఱును మరణము, సార సొద యనఁగను బరఁగును జిత
మొండె మనంగను బొల్చుఁ గబంధంబు, సబము పీనుంగ నగ శవము దనరు

నదరు శవయానముఁ బాడె బడెయ యనఁగఁ, గాడు మసనంబు వలికినాఁగను శ్మశాన
మదరుఁ జెఱియనఁగాఁ బ్రగ్రహంబు దనరు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

తే. అదరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ, సాల బందిగ మనఁగను జప్ప యనఁగ
ముద్ర తగుఁ దోఁచు జీవనమ్మగను మనుట, మనికి బ్రతుకు బ్రదిమియనమాతృభూత.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు నిద్ధర క్షత్త్రియవర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 227

---

## వైశ్యవర్గము.

సీ. వైశ్యనామంబులు వఱలుఁ గోమట్లన, బేహారు లనఁగను బేరు లనఁగ
నడక యనంగను నడత యనంగను, నడవడి యనఁగను నదరు వృత్తి
కొలువని వ్రాయుట కొలువు త్రోయుటయు లా, వణము సీళిముసా వఱలుఁ గ్రమతఁ
గొలువటం చనఁగను వెలయు సేవావృత్తి, వేఁడు టనంగను వెలయు యాచ్ఞ
యప్పనఁగ గవడి యనఁగ నలరుబుణము, వడ్డి తేమాన మనఁగను వఱలు వృద్ధి
పరచి యన యాచితక మొప్పుఁ బొరచి యనఁగఁ,దద్విశేషంబుదనరును ధాతృవంద్య.

సీ. అప్పులవాఁ డన నగు నుత్తమర్ణాఖ్య, యధమర్ణుఁడు చెలంగు నరువరి యనఁ
దాకట్టు కుదువ యుద్దర వారకం బీడ, నంగను వృద్ధి చెలంగుచుండు
నాపమిత్యకసంజ్ఞ యలరు వీ డనఁగను, గాఁ పనఁ గమ్మతకాఁ డనంగఁ
గమతగాఁ డనఁగను గమ్మటీఁ డనఁగను, దుక్కి-ము చ్చనఁగను దోఁచుచుండు
హాళికాభిధ నువ్వుచే ననఁగఁ దిల్య, మలరు నీరీతి ధాన్యభేదాఖ్య లరసి
వానిచే నని పలుకంగ వచ్చుఁ జుమ్మ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 229

సీ. చే ననఁ జెలిక నా క్షేత్రంబు విలసిల్లుఁ, గుచ్చెల యన రాశి కొఱలుచుండు
ద్వ్యాఢకికాభిధ పతిగయం చనఁగను, నల్పసస్యక్షేత్ర మలరుచుండు
మడి యనఁ గయ్యనా నదరుఁ గేదారంబు, వెలయు లోష్టము పెల్ల పిట్ట పెట్ట
గడ్డ బెడ్డ యనంగఁ గనుపట్టుఁ బొఱనాఁ, గను నవదారణంబునకుఁ బేరు
పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱ నాఁగఁ, దద్విశేషాభిధానంబు దగు సబళము
గడ్డపాఱనఁ జెలఁగును గొడ్డలియనఁ, గాను గుద్దాలనామంబు కాలకంఠ. 230

సీ ములుకోల యనఁగను బొల్చును దోత్త్రంబు, కొఱలు లవిత్రంబు కొడవలి యన
నల్పలవిత్రాఖ్య యలరు లిక్కి-యనంగఁ, గూలునాఁగ లవిత్రమూల మొప్పుఁ
గలప యనంగను హల మొప్పు నైరగ, ట్టేరు గలపనాఁగ మీఱుఁ దదుప
కరణ మాబంధమ్ము బరఁగు మ్రోకనఁగను, దలుగునాఁ బలుపునాఁ దనరుఁ గంఠ
రజ్జు పగ్గ మనంగను బ్రగ్రహ మగు, రాజిలును వారె యనఁగను రజ్జుభేద
మదరుఁ దృణరజ్జు వెంటినా నఘవిభంగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 231

సీ. లాంగలాదికము చెలంగు నే రనఁగను, బరఁగుఁ దద్గ్రాభిఖ్య యగక యనఁగఁ
గోశే రనంగను గొఱులు విపర్యయ, బద్ధలాంగులసంజ్ఞ పంట యనఁగ
నెగుఁ గృషిసన్నాహ మలరు నాఁగేలు నాఁ, గలి యనఁగాను లాంగలసమాఖ్య
పరఁగుఁ దత్పృష్ఠంబు పడత యనంగను, జీర్ణలాంగలసంజ్ఞ చెలఁగు గొనము
యనఁగ నేఁడికోలనఁగను నెసఁగు నీషం, ముష్టిసంగ్రాహ్యదారువు పొలుచు మేడి
యనఁగ యంతికనామధేయంబు జడ్డి, గ మన విలసిల్లుచుండును గాలకంఠ. 232

సీ. గుంటుగ నాఁగను గొఱ్ఱునా దంతినాఁ, బాపడ మనఁగను బరఁగును గృషి
సాధనభేదము ల్చనుఁ బలు గనఁగను, ఫాలాభిధానంబు పరఁగుచుండు
దిండడ నాఁగను దిర్యగారోపిత, దారువు గుజ్జునాఁ దనరుఁ గుజ్జ
దారువు కృషిసంజ్ఞ మీఱుఁ గిసుక దుక్కి, యనఁ జాలునాఁగ సీతాఖ్య దనరు
మున్నరక యనఁ దొలిదుక్కి పొదలుచుండుఁ, బ్రబలుసీతానివృత్తికొండ్రయన గుంట
యనఁగఁ గల్ల వానంగ ఖలాఖ్య వెలయు, ఖలముఖము వాగళం బన నలరు నభవ. 233

సీ. గుంజనాఁగను గట్టుకొయ్యనాఁగను మేధి, పయి రన సస్యంబు పరఁగుచుండుఁ
జిరుతరి పచ్చగన్నెరు తీఁగెమల్లియ, బుడమ రాజనమునాఁ బొలుపుఁగాంచు
వ్రీహిభేదమ్ములు వ్రీహిసామాన్యంబు, వరి వడ్లు నాఁగను వఱలుచుండు
గోదుమ యనఁగను గోధుమ ల్విలసిల్లు, లంక యనఁగఁ గలాయ మొప్పు
నారుగ యనంగఁ గోద్రవాఖ్య తనరారుఁ, గొఱలుచుండుఁ బ్రియంగువు కొఱ్ఱయనఁగఁ
బొలుచుఁ జూర్ణంబు జొన్న నా బుసుకు జొన్న, యనఁగఁ జూర్ణవిశేషమౌ నహివిభూష.

సీ. సజ్జయంచనఁగను సర్జము విలసిల్లు, శ్యామాక మొప్పును జామ యనఁగ
వరిగయంచనఁగను వరకము దనరారు, రాగియంచనఁగను రాగి వెలయు
ముద్గంబు పెసరునాఁ బొల్చును గారుపె, సరునాఁగ వనముద్గసంజ్ఞ చెలఁగుఁ
గాకిపెసరునాఁగఁ గనుపట్టు క్షుద్రము, ద్గము మినుమనఁగ మాషమ్ము దనర్చు
నను మనంగను నిష్పావ మలరుచుండుఁ, బరఁగు బొబ్బర యనఁగను బర్బరమ్ము
తువరి కంది యనంగను దోఁచు రాజ, మాష మలసంద యనఁదగు మాతృభూత. 235

సీ. ఒప్పుఁ గుళుత్థాఖ్య యులవయంచనఁగను, దిలసంజ్ఞ నూవనఁ దేజరిల్లు
సెనిగెనా సెనగనాఁగను జణకము మీఱు, నాసురి దనరారు నావయనఁగ
మెంతి యనంగను మేంథినామము తగు, శణము భాసిల్లును జనుమనంగ
దవసంబు కొలుచునా ధాన్యంబు రాజిల్లు, ముల్లునా శూకంబు పొలుపుగాంచు
నెన్ననఁగఁ గణిశ మలరు నీఁచ యనఁగఁ, గణిశవృత్తంబు చెలఁగును గంకి యనఁగ
ధాన్యకణిశంబు వెలయును దైత్యవైరి, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 236

సీ. కణిశైకదేశంబు కనుపట్టు రెల్లనాఁ, గణిశభారమ్ము ముంగ యనఁ దనరు
సస్యకుసుమసంజ్ఞ చను సుం కనంగను, గుసుమనాఁగను సస్యగుచ్ఛ మొప్పు
గంటకట్టె యనంగఁ గనుపట్టు నాళంబు, కోవి యనంగను గ్రోలనంగ
జా డనంగను క్షీణసస్యంబు దగును బ్యాం, దనఁగాను శుష్కసస్యము చెలంగు
ఛిన్న యవముఖనాళంబు చెలఁగుఁ జొప్ప, యనఁగ నోదె యనఁగఁ దీర్ఘయావనాళ
కాదులు చెలంగుఁ బన యన నలరుచుండుఁ, దాదృశవ్రీహిసస్యాఖ్య ధనదమిత్ర. 237

సీ. దంటనఁగా సస్యదండము విలసిల్లుఁ, బరఁగు నీన యనంగఁ బత్త్రినాడి
సొరుగాకు కారాకు చొక్కటాకు వగడు, నాఁగను వెలయుఁ జూర్ణాదిశుష్క
పత్త్రాభిధానంబు పరఁగును బుససంజ్ఞ, బుసి యనఁగా బసబూగర యనఁ
దుచ్ఛధాన్యాభిధ దోఁచు దాలు తరక, పొల్లు కట్టు తబకపొల్లు తప్ప
తంక రనఁ దూరునాఁగను దనరుఁ దుపస, మేతధాన్యాభిధలు మూఁగబొం తనంగ
మూన యనఁగాను దుపయుక్తములగుస్వల్పధాన్యములుచింక యినుకనఁదగుమహేళ.

సీ. ధాన్యశకలములు దనరు నూక లనంగ, నూక పొ ట్టుముక నా నొప్పుఁ దుషము
పిసరు పిప్పి యన నిష్పిష్టతుషంబగు, నుబుపుడు నాఁగను బరఁగుచుండుఁ
గణిశచూర్ణంబు సద్గ్రహణంబు తూర్పునా, వెలయును దృణధాన్యములు చెలంగు
గునుకలు దూసరుల్ గొలివెన్ లనంగను జె, లఁగు రోలన నులూఖలము పేరు
కుంది కుందెన యనఁగను గొబులు వ్రీహ్యులూఖలము ముసల మెసఁగు రోఁకలియన
వఱలుఁ బొ న్ననఁగాను శంబకసమాఖ్య, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 239

సీ. చేటనా శూర్పంబు చెలఁగు మ్రొం టె మొరఁటె, యనఁబ్రహ్వశూర్పాఖ్యయలరుచుండు
జల్లిజల్లెడ యన జాలని విలసిల్లుఁ, గండోల మెసఁగును గంపయనఁగ
సిబ్బి పల్లిక నాఁ బ్రసేవవిశేషమౌఁ, బుట్ట పుట్టిక పుట్టి పుటిక యనఁగఁ
దనరును బిటకంబు దగుఁ గునూలాభిధ, గాదె యనంగను గరిసె యనఁగఁ
దద్విశేషసమాఖ్యలు దనరుచుండు, కొట్టు కూటు పొడక కుమి బొట్ట యనఁగఁ
బరఁగు ఖాతవిశేషము ల్పాఁతర యనఁ, నూబ యనఁగను జెంద్రమశ్చాబకధర. 240

సీ. వంటయి ల్లనఁగను వంటి ల్లనంగ వి, లసిలుచుండును మహానససమాఖ్య
సూపకారంబు హెచ్చును సువార మనంగ, నడరును సూపకారుఁ డడబాల
వంటలవాఁడు సువారంపుపాఁడనఁ, బొయి ప్రొయ్యినా నధిశ్రయణి వెలయుఁ
దచ్చిలానామంబు దనరుఁబొక్కిలియనఁ, బిటకయంత్రాభిద వెలయు దాలి
యనఁగఁ దృంపి యనంగఁ గుండాఖ్య వెలయు, చుండుగుండమనంగనుగొండమనఁగఁ
బరఁగు బంగారధాళి కుంపటి యనఁదగు, బంగల యనంగ బండికుంపటి యగు భవ.

సీ. నిప్పింగలము మల్లె నిప్పుక వైరాలు, లైరవు లనఁగ నంగార మొప్పుఁ
గార్చిచ్చెరగలి నాఁగనుపట్టు దావాగ్ని, మంటనా జ్వాలనామంబు వెలయు
నదరులు మిణుఁగులు లనఁ నా స్ఫులింగము, లొప్పగ పొవ యన ధూమము తగు నిగులు
నీఱు బూడిద యన నెగడును భస్మాఖ్య, పరఁగు నుల్కాభిధ కొఱవి యనఁగఁ
గచ్చిక యనంగ వెలయు దగ్ధపిటకంబు. కుమ్మ నాఁగఁ దుషాగ్నియై కొఱలు బొగ్గు
నల్ల లనఁగను గాళికానామము లగు, మూర్ధధృతగంగ శ్రీమాతృభూతలింగ. 242

సీ. భస్మవిశేషంబు పరఁగును గరు కన, మసి యన మషి యొప్పు మంగల మన
భ్రాష్ట్రాభిధానంబు పరఁగుచునుండును, స్వేదని వెలయును బెన మనంగఁ
గందువు బాణలి కంచుకం టనఁదగు, సిద్దెయం చనఁగను జెలఁగుఁ గుతువు
బొడియయం చనఁగను బొల్చును గుతుపంబు, చనును గుతూద్వయసంగతంబు
సంగడమనంగుతూముఖాచ్ఛాదనంబు, దట్టి యనఁదగుఁ జిరిపినాఁ దనరుఁ దైల
మార్జకము గంటె గరిటెనా మనుము గంబి, మిల్లి యన నల్పకంబియా మిహిరభూష.

సీ. చనును జిత్తెడ యన శష్కులికాప్రముఖ సముద్ధరణసాధకాహ్వయంబు
తండువు తెడ్డునాఁ దనరు మహోతండు, వబకనా నగపనా నలరుచుండుఁ
జట్టువ పొన్నట్టు చట్టువం బనఁగను, దారుహస్తాభిధ దనరుచుండుఁ
దెలె హరివాణంబు తలిగ కంచము తట్ట, చాకీ లనంగఁ గంసంబు దనరుఁ
బళ్లెరము పళ్లె మనఁగను బాత్ర మొప్పు, గిన్నె యన డబ్బురనఁ గోర యన్నఁ జషక
ము తగుఁ జనుఁబత్రపాత్రంబు పుల్లెయనఁగఁ,బత్త్రిచషకంబు దొన్నె దొప్పనమనుభవ.

సీ. తామ్రాదికలశాభిధానము లెల్లెలుపొందుఁ, దంబిగ య్యనఁగను జెం బనంగ
దార్వాదికలశము లదనరు ముంత యనంగఁ, గుండనాఁగ మృదాదిభాండ మెసఁగుఁ
దామ్రాదిభాండము లదనరు బిందె యనంగ, విస్తృతతత్సంజ్ఞ వెలయుచుండుఁ
జెరవ యనంగను జెరవ మనంగను, గ్రాలుఁ గటాహంబు క్రాఁగనంగ
గాజు కొప్పెర యనఁగను గర్పర మగు, నెగడు నీరా డనంగను నీళ్ళచివది
యన నలంజరనామధేయమ్ము సాని, క లన వెళుపాటితిట్టలు వెలయు నభవ. 245

సీ. కడవ యనంగను ఘటమగు ఘల్లిని, కటఘటమోఁ బొంతకడవ యనఁగఁ
బళ్ళాదిభాండంబు పరఁగు దొట్టి యనంగఁ, దతముఖభాండాఖ్య తనరు బాన
పవ్వ కంగాళము బందడ మనికినా, నుత్పంక్తివిన్యాసయోగ్యభాండ
మలరును సేవునా నతిజవగ్రాహ్య జ,లానయనార్హ భాండంబు పంటి
పనఁటి యనఁదగు వర్తులభాండ మెసఁగుఁ, గుండ యన వెస లన నల్పభాండ మెసఁగు
నల్పముఖభాండనామధేయంబు చెలఁగు, బుడ్డి బొంగ బుడిసి నాఁగ భుజగభూష.

సీ. నిమ్నభాండాభిధ నెగడు లోవి యనంగ, నతభాండసంజ్ఞ గూనయనఁ బరఁగు
దుత్త యనంగను దుగ్ధభాండం బొప్పుఁ, దగు గళంతిక కలంత గరిగ యనఁగఁ
బ్రతలాల్పభాండంబు పరఁగుఁ జట్టి యటిక, యన ముష్టిమానభాండాఖ్య పిడుత
యనఁ దనరారు నత్యల్పభాండం బొప్పు, గురిగయ్యుం చనఁగను గురి యనంగ
లడ్డిగ యనంగ వేణుపాత్రంబు చెలఁగు, గొట్టె మనఁ దద్విశేషంబు కొలుచుండు
దీపపాత్రంబు ప్రమిదనాఁ దేజరిల్లు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 247

సీ. సిబ్బియూఁకు డనంగఁ జెలఁగు శరావంబు, పరఁగు దడ్డెము సావ బళ్లె నుల్ల
యననగుఁ దద్విశేషాభిధ శాకంబు, కూర యనంగను మీఱుచుండుఁ
జూర్ణశాకాభిధ శోభిల్లు దుగ్గునాఁ, బప్పుబేడ యన సూపంబు దనరు
నుపదంశసంజ్ఞయై యొప్పుఁ బచ్చడి యన, శాకనాళము పేరు జనును గమ్మ
కాము కాఁ డనఁ దింత్రిణీకంబు చింత, పం డనంగ వెలయును సంబా రనంగ
వేశవారంబు దనరును వెలయు మిరియ, మన మరీచాఖ్య పార్వతీప్రాణనాథ. 248

సీ. ఇంగు వనంగను హింగువు పసుపు బం, దారు నాఁగను హరిద్ర చను సోపు
నల్లజీలకఱనాఁ జెల్లును సుషవిక, మెంతి యనంగను మేంధి యొప్పు
వార్ద్రికంబు చెలంగు నల్ల మనంగను, గుస్తుంభరి దనర్చు గొత్తిమిరి యన
సొంటి యనంగను శుంఠియౌ లవణాఖ్య, యుప్పునా వెలయు నిందుప్పనంగ
నడరు సైంధవలవణము నా బిడాల, లవణ మంటుప్పు చౌటుప్పన విలసిల్లు
నొగి సురక్షార మగును బెట్లుప్పన న్సు, రుప్పనంగఁ గళాభాసితోత్తమాంగ. 249

సీ. తండులక్షాళనోదకము రాజిల్లును, గుడితి యనంగను గడు గనంగఁ
గూరాడు కలినాఁగ మీఱు ధాన్యామ్లము, వఱలు నన్నరసంబు వార్పు గంజి
యనఁగాను గౌబేర మలరు నంబలి యన, విలసిల్లును విలేపి వెలవ యనఁగ
నిస్రావసంజ్ఞయై నెగడు జావ యనంగ, నుష్ణికకాఁడినా నొప్పుచుండు
నటకలి యనంగఁ జెలఁగు నభ్యంగ తైల, హారకద్రవ్యసంజ్ఞ మెట్టినఁగ మెడువ
నంగఁ బులిమెట్టనంగఁ జెలంగుచుండు. నభిషుతాఖ్య నగాత్మజాప్రాప్తసఖ్య. 250

సీ. మీఱు యూషము కట్టు చారు పణిద మనఁ, బాగనఁగా గుడపాక మెసఁగుఁ
గండచక్కెరయనఁ గనుపట్టు మత్స్యంది, గుడము బెల్లము బెరకడ మనఁదగు
శర్కరాహ్వయములు చక్కెర యనఁగను, బంచదార యనంగఁ బరఁగుచుండు
శర్కరాభేదసంజ్ఞలు నవాతు జుమోజు, ఫులకండ మనఁగను బొలుపుగాంచు
సిగరయనఁగను శిఖరిణి చెలఁగు నూర్చు, బిం డన లవణభావితపిష్ట మొప్పుఁ
బులుప యులు పన విరళామ్లకలితపిష్ట, మొనరుఁ దిమ్మన మనఁగ దేమన మగు భవ.

సీ. లవణభావితశలాటువు మీఱు నూరుఁగా, యన మాంసరసమొప్పు నాణ మనఁగఁ
గలవు ట్లనంగను గనుపట్టు శూల్యంబు, తాలింపు తిరుగఁబోఁత పోఁగు పనంగ
సంస్కారము చెలంగఁ జనునుదాలింపు వై, చినది పోరఁటినది పోనటినదన
వఱలును సంస్కృతవాచకంబులుగాను, వడ్కట్టు గాలింపు కడుగు డేర
పఱుపనఁగ శోధనాభిధ పరఁగుచుండుఁ, జిక్కన మిసిమి మిహి జిడ్డు జిగురు జిగట
నునుపు నున్నన నిద్దము నున్నని దన, స్నిగ్ధనామంబు చెలఁగును జిత్స్వరూప. 252

సీ. బోరు లనంగను బొరుగు లనంగను, ధానాసమాఖ్యలై తనరుచుండుఁ
బొరుగులు మొదలుగాఁ బోఁచిళ్ళ వరకులు, బహువచనాలుగాఁ బరఁగుచుండు
గుగ్గిళ్ళనంగను గుల్మాషములు మీఱు, లాజలు దనరుఁ బేలా లనంగ
నటుకు లడుకులు నా నగుఁ బృథుకంబులు, ప్రాలునా నక్షతల్ వఱలుఁ బ్రార్థ
నాక్షతలపేరు పోఁచిళ్ళనాఁగ బియ్య, మనఁగ జాత్యేకవచనమై యలరుఁ దండు
లము దనరు నార్ద్రితండులమ్మమరు నాన, బాలునాఁగను బటదాళ పార్వతీశ. 253

సీ. అక్షుణ్ణతండులాహ్వయము చేరుళ్ళనా, దంగుళ్ళ నాఁగను దనరుచుండు
నాహతతండులాహ్వయము లెసటిపోఁత, లన సడింపు లనంగ నలరుచుండుఁ
బక్వచర వ్రీహిభవతండులసమాఖ్య, యుప్పిళ్ళనంగను నొప్పుచుండుఁ
దండులధూళియాఁ దవుడనఁ బిష్టంబు, పిండినా సత్తునా వెలయుచుండుఁ
జనును జలివిడి చలిమిడి యన విఘృష్టి, త మ్మపూపాభిధానమ్ము దనరుఁ గజ్జ
మప్ప మప్పచ్చి కజ్జాయ మనఁగ మండి, గ లనఁ దగు మండికమ్ములు గరళకంఠ. 254

సీ. సేవె లనంగను జేవికల్ విలసిల్లు, నుత్కారిక వెలయు నుక్కెఱ యన
గారి యనంగను ఘారి దనర్చును, నతిరసంబు చెలంగు నరిసె యనఁగఁ
బొల్చు మాషాపూపము వడ యనంగను, వడియ మనంగను వటక మెసఁగు
గరివడ యనఁగను ఖరవటకం బొప్పు, బూరె యనంగను బూరిక తగు
బుబ్బుద మనంగఁ దనరును బుద్బుదంబు, లడ్డువ యనంగ లట్వ చెలంగుచుండు
సారెసత్తు లనంగను జంతికలన, యంత్రికలు మీఱుచుండు శేషాహిభూష. 255

సీ. చక్కిల మనఁగను శష్కులి విలసిల్లు, సుకుని యనంగను సుఖిని చెలఁగుఁ
బిష్టము చెలఁగును బిట్టనఁ దద్విశే, షము మీఱుఁ దోఁపనా సంకటి యన
నప్పడ మనఁగను నడరు నపూపలి, కుడు మన మోదకం బడరు మఱుఁగుఁ
బూవునాఁగను నేర మూలము దనరును, తిలగోళ మెసఁగుఁ జిమ్మిలి యనంగఁ
దోఁచు మధుపూరితము తేనెతొన యనంగ, రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె
యిడ్డెన యనంగ నిటుకొన్ని యెసఁగుచుండు, భక్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ.

సీ. భక్ష్యసామాన్యంబు పరఁగును బిండివం, టలనంగ నన్నంబు వెలయుచుండు
బువ్వ యోమటి కూడు బోనము వంటకం, బోరె మోగిరమునా నొప్పుచుండుఁ
గలవంటకం బనఁగాను మిశ్రాన్నంబు, చలిదినా శీతాన్నసంజ్ఞ దనరుఁ
బొంచాళి కాకేళిపక్వాన్న నామంబు, గుజ్జనగూడన నొఱలుచుండుఁ
జిమిడిక యనంగ లగడునాఁ జెలఁగుచుండు, నధికపక్వాన్న మలరు మాఁడనఁగఁద్ధి
కాహ్వాయము మెదుకన సిద్ధకమ్మమీఱు, నెందు మెదుకులుపక్కునా నెసఁగునభవ.

సీ. తైలాభిధానంబు దనరు నూనె యనంగ, నేరండతైలంబు మీఱు నాము
దం బనఁ బేఁడనా దనరు గోమయ, సంజ్ఞ పిడకనాఁ దనరుఁ దత్పిష్టకంబు
వెలయుఁ గరీష మేర్పిడక పరంటనాఁ, దచ్చూర్ణ మెరువునాఁ దనరుచుండుఁ
బాడియం చనఁగను బరఁగుఁ బయస్యంబు, పోసనాల్ పాలునాఁ బొల్చు బహుళ
క్షీర మగు గుమ్మ యనఁగఁ దద్ధారవెలయుఁ, జానవా లనఁ జిఱువాలునా నెసంగుఁ
గర్దమీకృతదుగ్ధంబు క్రాలు ముఱ్ఱు, నాఁగఁ బీయూషనామంబు నాగభూష. 258

సీ. మీఁగడ యంచన మీఱు మండాభిధ, నవనీతసంజ్ఞ వెన్న యన వెలయు
నెయ్యి యంచనఁగను నివ్వటిల్లు ఘృతంబు, చమురు మెఱుఁగన స్నేహము దనర్చుఁ
దనరును బక్వఘృతంబు తెలి యనంగ, గసినా ఘృతాదికల్కంబు దనరు
నాతంచనాఖ్య యై యలరుఁ జేమిరి యనఁ, బెరుఁ గన దధిపేరు పరఁగుచుండుఁ
గుంపెరుఁగు నాఁగ ద్రప్సమగుం గల పన, మిశ్రదధి యొప్పుఁ గానన మీఱు మథిత
మడరు దండాహతము చల్ల యనఁగ మజ్జి, గ యనఁ దోడనఁ దగు దధికరణ మభవ.

సీ. ఆఁకలి యన గొద యనఁగ నాకొంట నాఁ, గను క్షుత్తు పేరుగాఁ దనరుచుండు
నన్నాదివిన్యాస మలరు వడ్డన యనఁ, గమి యనఁగా నొప్పుఁ గబళసంబు
కబళంబు కడి యనఁగాఁ జను గవణమం, చన గజాద్రిగ్రాస మమరుచుండుఁ
బిడుచ ముద్ద యనంగఁ బిండంబు వెలయును, దగ డప్పి నీర్వట్టు దప్పి దూప
యనఁ జనుఁ బిపాస మెసవుట యారగింత, యారగింపు కుడుపునాఁగ నలరు భుక్తి
దనరు నాభుక్తి యాబూతి యనఁగఁ దనుపు, తనివి యాపోవుటనఁదృప్తిదగుమహేశ.

సీ. ఎంగిలినాఁగఁ జెలంగు నుచ్ఛిష్టంబు, గోపాలకుం డొప్పు గొల్లవాఁడు
గొల్లఁడు కీలారి గొల్ల కిలారి ప, సులగాపరి యనంగఁ జెలఁగుచుండు
గోమహిష్యాదులనామము ల్పసి తొట్టు, తొడుకు పసరమునా నడరు గోష
లమ్మ మంద యనఁ గిలారమ్మనా గాశి, తము పట్టు పెంటనాఁ దనరుచుండు
నెద్దనఁగను వృషభాఖ్య యెసఁగుచుండు, వెలయు గంగెద్దునా దేవవృషభసంజ్ఞ
బసవఁ డాఁబోతనంగ గోపతి దనర్చు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 261

సీ. నూఁపురమంచన నూఁపురమంచనఁ, గకుదభిధానమై క్రాలుచుండు
గంగడో లనఁగను గనుపట్టు సాస్నాఖ్య, శృంగంబు కొమ్మనఁ జెలఁగుచుండు
దూడనాఁ గ్రేపునాఁ దోఁచును వత్సంబు, దనరు లేఁగ యనంగఁ దర్ణకంబు
గిత్తనా గిబ్బనాఁ గెరలు నార్షభ్యము, వెళ్లయుఁ గోడె యనఁగఁ బెయ్య యనఁగ
గోప్రభృతిపుంస్త్ర్యపత్యము ల్గోవు కుత్త్రి, యావునాఁగను జిత్రగవాఖ్యలందుఁ
జెపుటిగ్గా వనునట్టుల నమరియుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 262

సీ. గొడ్డన్న వంజనా గొంజనా వంధ్యయాఁ, బొదలును సంధిని వెదమొద వన
నీచుకొనినదినా నెసఁగును నపతోక, గేరు వామనగవి గిడ్డి యనఁగఁ
జనుఁ జతుర్హాయనసంజ్ఞ పడ్డ యనంగఁ, దఱుపు నాఁగను వత్సతరి దనర్చుఁ
బ్రథమగర్భిణిపేరు పరఁగును మొదవన, గర్భిణి చెలువందుఁ గట్టిన దన
నమరు బష్కయణి తఱపియావనంగ, జెలఁగు మజ్జిరి యనఁగ నైచికిసమాఖ్య
పొదుగునాఁగను నూధస్సు పొలుచుచుండు, నెమరునాఁగను రోమంథమమరు నభవ.

సీ. చనును గర్భస్రావసంజ్ఞ కట్టుకయనఁ, బొల్చు బీజావాపము వెద యనఁగ
నీనికయంచన నీఁతయనంగను, బశ్వాదిక ప్రసవంబు చెలఁగు
నెనుపసరం బన నెనుమన నెనుపెంటి, యన బఱ్ఱెనాఁగను దనరు మహిషి
వామనమహిషియై వఱలు గేదెయనంగ, మహిషవాచకముగా మనుచునుండు
దున్నయ్యన నెనుపోతన దుంతయనఁగఁ, గీలకము పేరు లంకెనాఁ గేరుచుండు
దామెన యనంగ దామని దనరుఁ గవ్వ, మనఁగ మంథాననామమా నబ్జమౌళి. 264

సీ. తరికంబ మనఁగను దనరును గుటరమ్ము, తరుచుట చిలుకుట త్రచ్చుట యన
మథనాభిధానంబు మను నెంటె యనఁగను, లొట్టియ యనఁగను లొట్టెనాఁగ
లొటిపిట యనఁగను లొటిపిట్ట యనఁగను, లొట్టిపిట్టయనఁ గన్పట్టు నుష్ట్రి
మలరును లొట్టెనుఁగన మహోష్ట్రాభిధ, మేఁక చుచ్చును జింబు మీఁఱు ఛాగి
ఛాగనామంబు జింబోతునాఁగఁ దనరు, గొఱ్ఱె గొఱ్ఱియ యనఁగను గొఱలు మేషి
తగరు పొట్టె లనంగను దనరుమేష, మాశ్రితవృషార్వ మాతృభూతాఖ్యశర్వ. 165

సీ. గాడిద యంచన గర్దభనామమౌ, గోనెయం చనఁగను గోణి పరఁగుఁ
దద్విశేషాభిధ తగును బరకమనఁ, జను నల్పగోణాఖ్య సలక యనఁగ
నత్యల్పగోణియై యలరు విత్త యనంగ, నసిమి గోతము సంచి యనఁగ నల్ప
గోణివిశేషముల్ గొఱలు వంచెయనంగ, నట్టెడ యంచన నాఢకమిత
గోణి తగు ధాన్యపూరితగోణికాఖ్య, యగుచు బెరికనఁ బెడకనా మఱఁ యెనిన
ధాన్యవిరహితగోణిగాఁ దనరుచుండు, నంకె ముండె మనఁజను గోణ్యర్థ మభవ. 166

సీ. తనరు గోణ్యుద్ధారిదండాఖ్య యెత్తన, గోలన బట్టనగోల యనఁగఁ
గంథాస్తరణ మొప్పఁ గందరికం బన, నలరు విక్రయ మమ్మ డమ్మక మన
మారక మనఁగను మారుగడ యనంగ, వినిమయనాభిధ వెలయుచుండు
విలువనా జట్టినా వెల యన రోయన, వెలయుచు నుండును విక్రయంబు
కొనుట దర దారణ యనంగమనుక్రయము, మొదలుబండాలనునఁదగుమూలధనము
మిగితి మిగు లన లాభంబు మీఱుచుండుఁ, గుదువ యనఁగను నుపనిధి పాదలుశర్వ.

సీ. ఒకటి యొక్కటి యొకండొండొక్కఁడనఁగను, నేకసంఖ్యాఖ్యయైయెసఁగుచుండుఁ
బది యన దశసంఖ్య పరఁగు నిర్వది యన, వింశతిసంజ్ఞయై వెలయుచుండుఁ
బొలుచుఁ ద్రింశత్సంఖ్య ముప్పది యనఁగఁ జ, త్వారింశదాఖ్య నల్వది యనంగఁ
బంచాశదాఖ్య యేఁబది యన రాజిలు, నఱువది యనఁగను నలరు షష్టి
దనరు డెబ్బది సప్తతి యన నశీతి, యెనుబది యనంగ భాసిలు నెసఁగు నవతి
తొంబది యనంగ నూఱనం దోఁచుశతము, వేయి యన సహస్రాఖ్యయై వెలయునభవ.

సీ. కరిసె యనంగను గాలుపలం బొప్పు, నరపలం బనఁగఁ గర్షాఖ్య యొప్పఁ
గర్షద్వయాభిధ గనుపట్టుఁ బల మన, నిర్పల మనఁగను నెసఁగు ద్విపలి
ముప్పలమం చన నొప్పుచుండుఁ ద్రిపలి, నలుపలం బనఁ జతుఃపలము దనరుఁ
బంచపలాభిఖ్య పరఁగు నేఁబల మన, వెలయు షట్పలి యాఱుపల మనంగ
నుల్లసిలు సప్తపలినామ మెల్ల మనఁగ, వఱలుఁ బన్నిర్ల మనఁగను ద్వాదశపలి
వీసె యనఁగను గనుపట్టు వింశతిపలి, దడియ మన నల్వది పలముల్ దగును శర్వ. 269

సీ. తనరారు సోల యంచనఁగ నికుంచాఖ్య, యద్దయం చనఁగఁ దదర్ధ మొప్పఁ
దత్తురీయాంశంబు దగును జిట్టి యనంగఁ, గుడుపాభిధానమై యడరు నవల
మానసా ముంతనా మానిక యనఁగను, ద్రవ్వనాఁ బడినాఁ దదర్ధ మెసఁగుఁ
బ్రస్థనామంబుగాఁ బరఁగుఁ గుంచ మనంగ, గుడుపషట్కంబు ముయ్యేడ యనఁదగుఁ
బ్రస్థయుగ్మాఖ్య యిరుసనాఁ బలుకఁబడును, జనును మక్కసనాఁగఁ బ్రస్థత్రయంబు
తూమునా నాఢకాభిధ దోఁచుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 270

సీ. ప్రస్థపంచకసంజ్ఞ పరఁగు నేఁగుస యన, షట్ప్రస్థవే రాఱు సనఁగ వెలయు
నిద్దుమం చనఁగను నెసఁగును ద్వ్యాఢకి, త్ర్యాఢకి ముత్తుమం చనఁగఁ జెల్లు
జతురాఢకీసంజ్ఞ చనును నల్తు మనంగఁ, బంచాఢకియు నేదు మంచుఁ దోఁచుఁ
షష్ఠాఢకీసంజ్ఞ చను నార్దుమం చన, సప్తాఢకీసంజ్ఞ జరుగుచుండు
నేడ్దుమం చనఁగను నెలమితోఁ గనుపట్టు, నష్టాఢకీసంజ్ఞ యలరుచుండు
నెనమందు మనఁగను దనరుఁ దొమ్మందుమ, నంగ నవాఢకీనామ మొప్పుఁ

బందుమంచు దశాఢకి పలుకఁబడును, బొదలు నేకాదశాఢకి పదునొకల్తు
ష్లునఁగఁ బన్నిద్దు మన ద్వాదశాఢకితగుఁ, బుట్టి యన భార మగు మాతృభూతలింగ.

సీ. కాణీ యనంగను గాకణి విలసిల్లు, వెలయుఁ దద్వయ మరవీస మనఁగఁ
ముక్కాణి యనఁగను బొల్చుఁ, దత్త్రియసంజ్ఞ, పణషోడశాంశంబు పరఁగు వీస
మనఁగఁ దద్ద్వితయంబు దనరు బరక యన, మువ్వీసమం చనఁ బొల్చుఁ దత్త్రి
యాఖ్యయై పణచతుర్థాంశంబు పాతిక, యన విరాజిలును బణార్థసంజ్ఞ
యొప్పునద్దుగ యనఁగఁ బాదోనపణము, వఱలు ముప్పాతిక యనంగఁ బణము రూక
యనఁగఁ జెన్నొందుఁ బణదశకాఖ్య చెల్లు, మాడ యన నిట్లు చెప్పెద మాతృభూత.

సీ. దీనారమందు ద్వాత్రింశదంశం బైన, బేడయం చనఁగను వెలయుచుండు
దుగలమం చనఁగఁ దద్యుగళంబు విలసిల్లుఁ, దనరు ముచ్చవ కనఁ దత్త్రికంబు
తచ్చతుష్టయసంజ్ఞ దగుఁ జౌలమం చనఁ, బాదదీనారంబు పా వనఁ దగు
నర్ధదీనారాఖ్య యలరు మాడ యన న్వ,రా యన దీనారమై యెసంగు
నాణె మనఁగను శుద్ధదీనార మొప్పు, హీనదీనారసంపూర్తి కిచ్చునట్టి
ధనము వట్ట మనంగను దనరియుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 273

సీ. ఎడబెట్టనంగను నెఱుసనా బారిము, ద్ర యన దీనారభేదములు చెలఁగు
కా సనఁగాను గాకణిపేరు విలసిల్లు, బైకమం చనఁగఁ దద్ద్వయము వెలయు
దమ్మ మనంగను దార మనంగను, దచ్చతుష్టయసంజ్ఞ దనరుచుండుఁ
దద్ద్వాదశం బైనఁ దగు నేబునాఁగను, జను టంక మనఁగ నిష్కాహ్వయంబు
దద్విశేషాభిధలుగాను దగును డబ్బు, లనఁగ దుగ్గాణు లనఁగ దుడ్లనఁగజగతి
శూలధారి పరాతంకచోళవైరి, పుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 274

సీ. పంపు పాల్ వంతునా భాగంబు విలసిల్లు, నాస్తినా సర్వస్వ మలరుచుంచు
సరకు సంకట మనఁ జనును బణ్యద్రవ్య, మమరు రొక్క మనఁ బైక మన ధనము
గుళిక పూసె యనంగ ఘుటికాహ్వయం బొప్పు, రాపాడి నా ఘృష్టరజము చెలఁగుఁ
దగటనఁ దగడనఁ దనరు లోహదళమ్ము, మనుఁ దప్తలోహాఖ్య మం డనంగఁ
గడ్డి యనఁగ శలాకనాఁగను శలాక, యనరు గుండన నుండనా నమరు గోళ
కాఖ్య రవ యనఁగాను లోహశకల మగు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 275

సీ. పచ్చ యనంగను బరఁగు మరకతంబు, గారుత్మతం బొప్పు గరుడపచ్చ
యనఁ దద్విశేషాఖ్య యగును బేరోదనం, బన నది కృత్రిమం బయిన వెలయు
మాందాళియం చన మౌక్తికం బొప్పును, ముత్తెము ముత్యము ముత్తియ మనఁ
దద్విశేషాభిధ దనరుఁ దార మనంగ, నాణియం చనఁగ సుపాణి యనఁగ

నదియె నెరడైన గొగ్గియం చనఁగ వెలయుఁ, జిప్పముత్తెం బటంచ్రదదే చేయఁబడిన
వీనితూనిక చవి యన వెలయుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 276

సీ. పద్మరాగాభిధ పరఁగు గెంపన నది, వన్నె తగ్గిన గరపక్క యంద్రు
కృత్రిమం బగునది గేరు రవాయినాఁ, దత్కాంతి విడి యనఁ దనరుచుండు
నాకాంతి మెండైన నలరు మొక్కళి యన్, నాకెంపుపని కుచ్చె యనఁగ వెలయు
నతికాంతియౌ కెంపు నలరు జొక్క మనంగఁ, బ్రభపేరు వెలయును బొట్టు మనఁగఁ
బరఁగును బ్రవాళనామంబు పగడ మనఁగఁ, బవడ మనఁగ సిరాజినా వానియెత్తు
కణు జనంగను విలసిల్లుఁ బ్రణుతభక్త, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 277

సీ. పొలుచును వజ్రంబు మూలగా లన మగ, రా లనంగ గురుజరా లనంగ
దత్ప్రతినిధిపేరు తలుపునా విలసిల్లు, మంజాడినాఁ దత్ప్రమాణ మొప్పుఁ
గప్పురా లనఁగను గనుపట్టు నీలము, గ్లొతుపునాఁ దద్భేద మతిశయిల్లుఁ
బటికమం చనఁగను స్ఫటికంబు విలసిల్లు, బరఁగుఁ దద్భేదంబు పలుఁ గనంగ
మానికము రతన మనంగ మణి చెలంగు, నదియు సచ్ఛిద్ర మైనఁ బూసనఁ దనర్చుఁ
గాకిబంగా రనంగ బేగడ యనంగ, నభ్రకము దోఁచుఁ ద్రిశిరః పురాధినాథ. 278

సీ. కాంచనాభిధలు బంగారు బంగరు హొన్ను, పసిఁడి పసిండి పొన్ పైఁడి పయిఁడి
పుత్తడియం చనఁ బొలుపారు నతిశుద్ధ, చామీకరాఖ్యలు చనుఁ గడాని
మేలిమి యపరంజి జాళువా కుందనం, బుదిరినా రజతాఖ్య యొప్పు వెండి
మడికా సనంగను మను నారకూటంబు, పిత్తడియం చన నిత్తడి యనఁ
గాంస్యనామంబు విలసిల్లుఁ గం చనంగ, రాగియం చన వెలయుఁ దామ్రాభిధాన
మయము విలసిల్లు నిను మన నలరుఁ దద్వి, శేష ముక్కనిచెప్పఁగ శేషభూష. 279

సీ. లోహములాభిధ ల్పొరుపారుచుండును, ద్రుప్పనఁ జిలుమనఁ ద్రుక్కనంగఁ
జిట్టమం చనఁగను సింహాణమై దోఁచుఁ, గాచము విలసిల్లు గాజనంగఁ
బింగాని కుప్పి కుప్పియ కుప్పె యనఁగను, దత్కృతచషకాఖ్య తనరుచుంచు
నింగిలీకం బన హింగుళి విలసిల్లు, హరితాళి మొప్పును నరిదల మనఁ
జెలఁగు సిందూరనామంబు చెందిర మన, దూది యనఁ దూల మొప్పును దుట్టె యనఁగఁ
బెర యనఁగ క్షౌద్రపటలంబు పేరు చెల్లుఁ
దేనె యన క్షౌద్ర మొప్పును మైన మనఁగఁ, బొలుచు సిక్థంబు శ్రీమాతృభూతలింగ. 280

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జెయుకతనఁ, బరఁగు శాశ్వతముగ వైశ్యవర్గమిట్లు
నైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 281

## శూద్ర వర్గము.

సీ. శూద్రనామంబులు శోభిలు నాలవ, కొలమువారలని గాఁపు లని పల్కఁ
దద్విశేషమ్ములై తనరుఁ గమ్మని వెల్మ, యని రెడ్డియని రడ్డియని వచింపఁ
బనివాని పేరుగా భాసిలు నౌ జనరే, గుమ్మరవాఁ డొప్పుఁ గుమ్మరి యన
మాలకరి యనంగఁ బూలమ్మువాఁడగు, మీఱు నూసరియన గారకాఁడు
చిప్పె యనఁగను విలసిల్లుఁ జిప్పెవాఁడు, చెలఁగు నంచులవాఁ డనఁ జిత్రకాఁ
చికిలిచాఁ డన శస్త్రిమార్జకుఁడు దోఁచు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 282

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన, నేతకాఁ డనఁగను నేతరి యన
దోఁచుఁ దద్భేదము ల్లొగటవాఁ డనఁగను, సాలీఁ డనంగను సాలె యనఁగ
సాలెవాఁ డనఁ బట్టుసాలెవాఁ డనఁగను, దేంద్ర యనంగను జేంద్ర యనఁగఁ
గైకలవాఁ డనఁగను జర్మకారాఖ్య, పరఁగు గోదరి ముచ్చెవాఁ డనంగ
మంగి యనఁగను మంగలవాఁ డెసంగు, వఱలుఁ జాఁకినాఁ జాఁకలివాని పేరు
ఈడిగ యనంగ నీడిగవాఁడు వెలయు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 283

సీ. కమ్మరి కనుమరి కరువలి యనఁగాను, మీఱుచుండును నయస్కారసంజ్ఞ
కమ్మర మన నయస్కారకర్మం బొప్పుఁ, గంచరవాఁ డొప్పుఁ గంచరి యన
స్వర్ణకారాభిధ పరఁగుఁ బారసి యగ, సాలి సొన్నారి కంసాలి యనఁగ
గ్రావకారుఁడు కాసె కాసెవాఁ డనఁ దగు, వడ్లంగి యన వడ్రవాఁ డనంగ
వర్ధకి విరాజిలుచునుండు వడ్ర మనఁగఁ, బరఁగు వర్ధకికర్మంబు గురుప యనఁగఁ
దగును మేఁకలవాని పే రమ్మలి యనఁ, దంబళి యనంగ నంబినాఁ దనరుచుండు
దేవలుని పేరు త్రిశిరఃపురీవిభాసి. 284

సీ. పాచకుం డొప్పు సువారంపువాఁ డనఁ, గను బూటకూళ్ళవాఁ డనఁగ వంట
పూటవాఁ డనఁగను బొలుపొందు శ్రీహరి, దాసుఁడు దాహరి దాసరి యన
శివదాసనామంబు చెలఁగు జంగ మనంగఁ, దిలఘాతుకుం డొప్పుఁ దెలికవాఁడు
*గానుగవాఁ డన వేణుకారకుఁ డొప్పును, మేదరివాఁ డన మేదరి యన
నెసఁగుఁ బింజారి నాఁగ దూదేకువాఁడు, పరఁగుఁ గుడ్యాదికారి యుప్పరి యనంగ
జలగడుగువాఁడు వెలయును జాలరి యన, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 285

సీ. పదవిజ్ఞుఁ డెసఁగుఁ జొప్పరి జాడకాఁ డన, సంకులవాఁ డన శాంఖికుఁ డగు
సానలవాఁడు పూసలవాఁ డనంగను, మణికారసంజ్ఞమై మనుచు నుండు

---

* గాండ్లవాఁ

పటుమాయకాఁ డన మాయదారి యనంగ, మాయలాఁ డనఁగను మతకరి యన
టకటం కనంగను తవలికాఁ డనఁగఁ గ్రౌ, లాటకాఁ డనఁగను డక్కరి యన
టం కనంగను మాయావి పొంక మగును, గటికవాఁ డన మాంసికాఖ్యలు సెలంగు
వాగురికసంజ్ఞ యగా వలవాఁ డనంగ, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 286

సీ. నటుఁ డొప్పు నట్టన నట్టువుం డనఁగను, దారినాఁ డగు సూత్రధారకుండు
తాళధారి చెలంగుఁ దాళిగిరి యనంగఁ, జను దిమ్మరీఁ డనఁ జారణుండు
గాణయం చనఁగను గాయకాభిధ చెల్లు, వీణెకాఁ డనఁ దగు వైణికుండు
బయకాఁ డనంగను భయకారి విలసిల్లు, సుతికాఁ డనం జను శ్రుతివిధాయి
వెలయు దొమ్మరి యన లఘువిద్యవాఁడు, ఐంద్రజాలికసంజ్ఞ మై యలరుచుండు
గారడీఁ డన క్షుద్రసంఘ ప్రశంసి, పరఁగు బవినీఁ డనంగఁ జెవ్వందిలింగ. 287

సీ. వైతనికుండు సంబళకాఁ డనఁగ జీత, కాఁ డనంగను గూలివాఁ డనఁదగు
భారవాహకుపేరు పరఁగుచుండును బెస్త, మోపరి బోయఁడు బోయినాఁగ
బానిసీఁడన బంటు వరవుఁడు గుండాఁడు, నాఁగ దాసాఖ్యలు గాఁగఁ దనరు
నుడిగము చాకిరి యూడిగం బనఁగను, దాసదాస్యము గాఁగఁ దనరుచుండు
వరవడంబనఁ బసుపన బానిసమన, దాస్యనామంబులై యుండు దాసి యొప్పు
బానిసయనంగఁ దొత్తనఁ బారికయగు, బోనకత్తె యనఁగ మాతృభూతలింగ. 288

సీ. పరఁగుఁ జండాలుండు సురియాళు వనఁగను, మాలఁ డనంగను మాల యనఁగఁ
దోటి యనంగను దోఁచనా నాసాదిఁ, గొసంగి మాదిగ గూబరి యన
మాతంగుఁ డగు వానిచేతనుండెడికత్తి, కొంగవా లనఁగఁ జెలంగుచుండు
మాతంగసదృశుఁడౌ మనుజుండు తగు బోయ, నీఁ డనంగను గొమ్ముకాఁ డనంగ
బోయనాఁగఁ గిరాతుఁడౌఁ గోయ చెంచు, పరికి యేనాది యాకరి పట్రె యెఱుకు
వేఁకరి యెసకరి యనఁ దద్భేదములుగఁ, బొల్చును వినంగ శ్రీమాతృభూతలింగ. 289

సీ. తురక యనంగను దోఁచుఁ దురుష్కుండు, మెంచ యనంగను మ్లేచ్ఛుఁ డొప్పు
వేఁటకాఁ డనఁగను విలసిల్లు మృగయుఁడు, శునకము వేపి కుక్కనఁగఁ దనరు
తద్భేదనామము తగు జోఁగి యనంగ, వనశునకంబు రే చనఁగ నొప్పు
జాగిలం బనఁగను జను విశ్వకద్రువ, యుడుపవేఁ పవు బురకడమనంగఁ
దగును సడికియ యనఁగను శ్వగళరజ్జు, శ్వగళకాష్ఠంబు వెలయుఁ గాపంత మనఁగ
వేఁట యనఁగను మృగయాఖ్య వెలయుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. దొంగ తైక్కలికాఁడు దోఁపరి ముచ్చుజా, బరకాఁ డనంగఁ దస్కరుఁడు వెలయు
మార్గచోరకసంజ్ఞ మను బొలపరియన, దెరవాటుకాఁ డనఁ దేజరిల్లు

మెఱుఁగు వెన్నెఁడువాఁడు ముడియవిడు పనంగ, గండిదొంగనఁ గన్నకాఁ డనంగఁ
దగు సురంగాకారితస్కరనామంబు, బందెకాఁ డనఁ దగు బందికారి
వేసములు వేసి నమ్మించి వెనుక నాచు, కొనిన దొరకోలుసన్నాసి యనఁగ వెలయుఁ
దడికట్రోపరి యనఁగను దనరు సౌక, వాటనోడదకుఁ డనఁగఁ జెప్పందిలింగ. 291

సీ. పరఁగుఁ దెక్కలి యన బందిపో టనఁగను, గిలు వనఁ గాసులంకింపునాఁగ
దావర మనఁగను దావా యనంగను, మ్రుచ్చిమి యనఁగను మ్రుచ్చిలి యన
దోఁగురు నాఁగను దోఁపడ మనఁగను, దోఁపుడు నాఁగను దోఁపు నాఁగ
దొంగటిక మనంగ దొంగతన మనంగఁ, జౌర్యంబు చెల్లు వంచన మెసంగు
జూడుగు ప్రకుక్కికిపరు పిక్కుజూణుఁగు మొరఁగు, డనఁగ గూఢనివసతి పొంచడమనంగ
నలరుఁ గికురింపు కికురింత యనఁగఁ జెల్లు, వంచనకరణ మగుచుఁ జెప్పందిలింగ. 292

సీ. బొండ యనంగను బోననఁ గూటయం, త్రాభిధానంబుగాఁ దనరుచుండు
బందిక ల్లనఁగను బదనశిలాఖ్య యౌ, నుచ్చునా నురియన నొప్పుచుండుఁ
బక్షిబంధనసంజ్ఞ వాగురాభేదంబు, చిక్కమం చనఁగను జెలఁగుచుండు
మీటనా బిస యన మీఁఱుత్పతనకీల, మలరును జవ యన యంత్రభేద
మేత మనఁగ ఘటీయంత్ర మెసఁగుచుండు, మోటనంగను దద్భేద మొనరుఁ జేద
బొక్కెన యనంగఁ దద్భేద మొప్పుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ.

సీ. తంతుసన్తతిసముత్పాదనయంత్రంబు, రాట్నమంచనఁగను రహిఁ కి నెక్కుఁ
దద్బద్ధసూత్రంబు తగు వడియం చన, గిరుకునా భ్రమకంబు పరఁగుచుండుఁ
దగుఁ గదు రనఁగఁ దంత్వాధారసూచిక, తూలంబు విలసిల్లు దూది యనఁగఁ
దూలమ్ముదూకృతి దోఁచు నేకు డనంగ, నగుఁ దూలకణిక యే కని వచింప
వడుకు డనఁగను దంతుసంభవహేతు, కక్రియ చెలంగుఁ దంతువుగాఁ జెలంగుఁ
బోఁగు పోఁ చనఁగా నదె పుత్తడి యన, మను సరిగ యనఁ గండెనా మాతృభూత.

సీ. ఆసునాఁ జెలఁగుఁ దంత్వావర్చనాభిధ, దనరు సూత్రము నూలు దార మనఁగఁ
బురిపిరి యనఁగఁ దత్కరణవేష్టన మొప్పు, జెలఁగుఁ ద్వ్యక్సూత్రంబు నులక యనఁగఁ
బొలుపొందును త్రిసూత్రి మున్నూ లనంగను, ముప్పేట యనఁగను ముప్పిరి యనఁ
దంతుచతుష్కంబు దనరు నెన్నిక యన, షష్టితంతువులు పుంజ మన వెలయుఁ
దాంతవప్రతికృతి పేరు దనరియుండు, సన్య యనఁ దంతువేష్టనసాధనంబు
పరఁగును బరంటె యనఁగను బంటె యనఁగఁ, బంట్రకోల యనంగఁ జెప్పందిలింగ.

సీ. అలరు లాక యనంగ నర్చాభిధానంబు, తగుఁ బడు గనఁగ నాతానసంజ్ఞ
వెలయు వితానంబు పేకయం చనఁగను, వాయదండము నేఁతపు కనఁ దగు

తొట్టినాళి యనంగఁ దురిపేరు విలసిల్లుఁ, గుంచిక తనరును గుంచె యనఁగఁ
బుస్తము చెరి యనఁ బొలుపొందు నేతయం, త్రము మగ్గ మనఁగను దనరుచుండుఁ
దంతునిస్సరణంబుగఁ దనరుచుండు, వెలుపు డనఁ దోఁడు డనఁగను వెలయుచుండు
వ్యూతిచనునల్లికయనంగ నేతయనఁగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 296

సీ. సూదియం చనఁగను సూచియౌ నది గొప్ప, దైన దబ్బన మన నలరుచుండుఁ
గత్తెర యనఁగను గర్తరి గనుపట్టుఁ, జిత్రము దనరారుఁ జిత్తరు వన
రంజన మగు రాణ రహి రంగు రక మన, బొమ్మయం చనఁగను బుత్త్రిక తగుఁ,
బెట్టె పెట్టియ యనఁ బేటిక విలసిల్లు, మంజూష దనరారు మందస మన
నదియె చందుగునాఁ దగు నల్ప మైనఁ, బరఁగు స్కంధాటికాఖ్య కావడి యనంగ
నుట్టి యన శిక్య మొప్పగు నుగ్గ మనఁగ, భాండగళబంధరజ్జు వౌఁ బార్వతీశ. 297

సీ. పాదరక్షాభిధ పరఁగును జెప్పన, మలకడ మ్మనఁగ సమ్మాళి యనఁగఁ
దద్విశేషమ్ములు తగుఁ బాయపోసు పా, పో సూడు ఫుద్దము ముచ్చె మెట్టు
కవును మోచా యనఁగా నదె జీర్ణమై, నపుడు పల్కంబడు నదక యనఁగఁ
బావాలు పావలు పావుకోళ్లనఁగను, బాదుక నామము ల్పరఁగుచుండుఁ
బొలుచు దోస్తాన మనఁ దోలుపొరలతిత్తి, మీఁఱు సందంశకము పేరు కా రనంగ
శంబళి చెలంగు సంబెల స్మెటయన, నల్పమై యున్న నదె సుత్తి యనఁదగుహర.

సీ. తనరును లోహసంతాడనాధారంబు, డాకల్లు పట్టడ డాగలి యనఁ
బెడసాన యనఁగను వేదనిక వెలయు, నొరగల్లనఁగ నికషోపల మగు
సన్నెకల్లనఁగను సన్నకల్లనఁగను, బేషణశిలపేరు వెలయుచుండుఁ
బొత్తర మన దృషత్పుత్రంబు విలసిల్లుఁ, బత్త్రిపరశుసంజ్ఞ పరఁగుచుండు
నాకురాయి యనంగ లోహాతితాప, కుండ మొప్పుచునుండును గొలిమి యనఁగఁ
గొలిమితిత్తి యనంగను జెలఁగు భస్త్రి, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 299

సీ. త్రాసు తరాసునాఁ దనరును నారాచి, తూనికకోలనాఁ దూనుకోల
యనఁ దులాదండాఖ్య యలరును గళ్లైనా, నగుఁ దులామానగుంజాదికములు
కమ్మి యటంచనఁగా లోహలత యొప్పుఁ, గమ్మచ్చునాఁగఁ దత్కరణయంత్ర
మొప్పు దాయి యనంగ నుత్పతనాఖ్యయౌ, నొనరు దారుచ్ఛేది యులి యనంగ
నల్పమైన నదే సేణ మనఁగ సిరవ, మనఁగ విలసిల్లుఁ దంక మొప్పగును గాసె
యులి యనఁగ వర్ధనికి పేరు వెలయుచుండు, బాడిస యటం చనంగఁ జెవ్వందిలింగ.

సీ. ఱంప మనంగను గ్రకచంబు తరగంపె, యనఁ గరపత్త్రిభేదాఖ్య మీఁఱు
దారునిర్మథనసాధనవిశేషము త్రోఁపు, డనఁ దటీమెన యన నలరుచుండు

మంగలకత్తి యనంగ క్షురము తగుఁ, గకపాల యనఁగను గతుపాల
త్నరుఁ గేశోత్పాటి తండస మనఁగను, జిమ్మట యనఁగను జెలఁగుచుండుఁ
దనరియుండును వస్త్రిధావనపదార్థ, సంజ్ఞ చౌకార మనఁగను సబ్బునాఁగఁ
గమ్మనీరన నుపజలాఖ్యగఁ జెలంగు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 301

తిలయంత్రసంజ్ఞమై యలరు గానిగ యనఁ, దిలకల్క మలరును దెలకపిండి
యనఁ బ్రతిబింబాఖ్య యచ్చునఁగను నీడ, యనఁ జాయయంచన నలరుచుండుఁ
గైవడ్డి కైవళి కయివడి కాడువు, మాదిరి పోలిక మాడ్కి పురుఁడు
పోలికి యనఁగఁ బోల్పొందు నుపమపేరు, ప్రతి మాఱు బదు లనఁ బ్రతినిధి యగు
సాటి సాటువ తరబడి సవతు తరము, దీటు సరి పాటి పోటి యుద్ది యనఁ బాడి
యీ డనఁగ సదృశాఖ్యలై యెసఁగుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

తెఱఁగు చందము పగిది విత మనంగను, మీఱుచునుండుఁ బ్రకారసంజ్ఞ
బాడిగ కూలి సంబళము జీత మనంగ, వేతనసంజ్ఞయై ఖ్యాతిఁ జెందు
రోయనఁ బైఁడన రొక్క మనంగను, వేశ్యాభృతికి సంజ్ఞ వెలయుచుండుఁ
గల్లనంగ సురాఖ్య చెల్లును కైపుసా, రాయి సారా నాఁగ రహి దనర్చుఁ
దద్విశేషంబు తద్భస్త్రి దనరుచుండుఁ, దత్తెర యనంగఁ జెలఁగు మేదకముపేరు
పెల్లె మనఁగను మదసంజ్ఞ యుల్లసిల్లు, మబ్బు లాహిరి యనఁగను మాతృభూత. 303

లాహిరీవస్తువు లక్కలయఁ జేర్చిన మందు, మబ్బురాయుం టన మనుచునుండు
బంగు గంజాయినాఁ బరఁగుఁ గళంజాఖ్య, యభినియంచనఁగ నిర్యాస మొప్పు
ద్యూతకారాభిధ దోఁచుచుండును జూద, కాఁడు జూదరి పందెకాఁ డనంగ
సాక్షి యొప్పగు సాకి సాకిరి కరి యనఁ, బూటకాఁ డనఁగను బూట యనఁగఁ
దనరు లగ్నకసంజ్ఞ జూదం బనంగ, నెత్త మనఁగను ద్యూతము నివ్వటిల్లుఁ
బందె మనఁ బన్నిదం బనఁ బణము వెలయు, జట్టికాఁ డన ద్యూతియై చను మహేశ.

అష్టాపదాభిధ లగుఁ జదరంగపుఁ, బలకనా నెత్తపుఁబలకనాఁగఁ
జదరంగ మనఁగను జతురంగ మొప్పగు, నష్టజనద్యూత మలరుచుండుఁ
బగడసాల యనంగ భాసిల్లుచుండును, బాళెయంచన శారిఫలము పేరు
సారెయంచన నడ్డసారెయంచనఁగను, సొగటమంచనఁగను దగును శారి
పాచిక యనంగ గవరనాఁ బాశక తగుఁ, బరఁగు నేకవచనమునఁ బగడ యనఁగ
దుగ యనఁగ రేచ యనఁగను దోఁచు ద్వికము, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ.

తిగ ముచ్చు యనఁగను త్రికముపేరగుఁ దిగ, వంచ చౌకమ్మ తీవంచ యడ్డ
యనఁగఁ జతుష్కాఖ్య యగును జౌవంచనాఁ, బంచకాభిధగాను బరఁగుచుండు

నిత్రిగ చక్రాన నెసఁగును షట్కాంబు, సత యన విలసిల్లు సప్తసంఖ్య
దచ్చియం చనఁగను దనరు నష్టకసంజ్ఞ, బార యనం దగు ద్వాదశకము
అరయ నీరీతి ద్యూతసంఖ్యలు చెలంగు, కోడిపోరన మఱియును గొన్ని గలవు
అదియ పో ప్రాణవద్ద్యూతమా దయైన, పూరిత్రాపాంగ శ్రీమాతృభూతలింగ. 306

సీ. బొంగర మనఁగను బొమ్మర మ్మనఁగను, భ్రమరాభిధానమ్ము పరఁగుచుండు
నష్టోపల మ్మగు నచ్చనగల్లన, చిఱుతనగోటినాఁ జెలఁగు దీర్ఘ
ఖర్వకాష్ఠక్రీడ గంజనకాలన, ఖంజపాదక్రీడగాఁ జెలంగు
నక్షిమీలనకేళి యలరు దాఁగిలిమూఁత, యనఁ గనుమూసి గంతన యనంగఁ
బరఁగు క్షేపణి పోటనబంతి యనఁగఁ, గేరుచుండును గీరనగింజనాఁగ
శేకికాబీజకేళి గౌరీముఖాబ్జ, ముదితద్భృంగ శ్రీమాతృభూతలింగ. 307

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగ శూద్రవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రియీమాతృభూత. 308

ఉ. రంగ మహీనిషంగమ ధరాధరశృంగమసహ్యజామరు
త్సంగమ హృష్యదంగమ భుజంగమరాజసుతామనోబ్జినీ
భృంగమ పాదపద్మనుతగృధ్రవిహంగమ చంద్రమఃకళా
లింగమ మాతృభూతశివలింగమ దైత్యవిభంగచంగమా. 309

పృథ్వి. పటీకృతహరిత్తటీ స్ఫటిక నిర్మలస్వాకృతీ
స్ఫుటీకృతగుణవ్రజా పుషితసర్వలోకవ్రజా
ఘటీకృతఝరీపయఃకణనిరంతరార్ద్రీభవ
త్తటీభవనఖేలనా ధరణిభృత్సతీమేళనా. 310

గద్య. ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాదికతిపయగుణస్వ సామ్యతదితరసకలగుణనిరౌపమ్యా సేతుహిమాచలఖ్యాత మహాోద్దండకవి బిరుద ప్రశస్త సీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యాదిసకలగుణచిరత్న రత్నరత్నాకర శ్రితజనశీకర కోటిసమాఖ్యవంశసుధాపయోధి రాకాశశాంక ఘంటికాతురగ నీలా తపత్త్రి హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరికాదినిఖిలబిరుదాంక బృహ దంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటచోళ పాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథ సభాంకణ బిరు దాయమాన నార్యనుతచర్య వేంకనార్యప్రణీతం బైనయాంధ్రభాషార్ణవంబునందు ద్వితీయకాండము.

# తృతీయకాండము.

## విశేష్యనిఘ్న వర్గము.

క. శ్రీతరుణీశతజనకీ, భూతాత్మ తురంగిత్కోత్మ మురభిత్ప్రముఖో
ద్గీతరణా ఖ్యాతగుణా, భూతగణాధీశ మాతృభూతమహేశా! 1

గీ. చను విశేష్యనిఘ్న సంకీర్ణ నానార్థ, కావ్యయ క్రియాఖ్య లమురువర్గ
ములివి తృతీయకాండమునను గ్రమంబుగా, మహితగుణసమేత మాతృభూత. 2

సీ. మను మేలువాఁ డనఁగను శుభకరసంజ్ఞ, మంచివాఁ డనఁగ శోభించు సుకృతి
వటరియం చనఁగ నేర్పరి యన తవరన, దంటనా జాణనాఁ దగు సమర్థుఁ
డలరు జూటనఁగ జిత్తులవాఁ డనంగ వం, చకుఁ డీవికాఁడునాఁ జనును దాత
తెలివికాఁ డనఁగను వెలయుచుండు నభిజ్ఞుఁ, డాఢ్యుఁడు విలసిల్లు నాస్తికాఁడు
నాఁగఁ గలవాఁడు నాఁగను నచ్చుకుప్ప, యనఁగ విడిముడిఁ గలవాఁ డటన్నఁ దిండి
పోతనఁగ భక్షుకాఖ్యయై పొలుపుఁగాంచుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ.

గీ. పరఁగు దాళీకుఁ డనఁగఁ దీర్పరి యనంగఁ, గార్యకర్తకుఁ బేరుగా ఖ్యాతసంజ్ఞ
యగును బేరైనవాఁడు వాసైనవాఁడు, మంతుకెక్కినవాఁడుగా మాతృభూత. 4

గీ. తనరు నడ్డములేనివాఁ డనఁగ నిచ్చ, నుండువాఁ డన నిరవగ్రహుండు చాలు
మాసి పనుపరి యనఁగను భాసిలుఁ బర, తంత్రనామంబు మాతృభూతాభిధాన. 5

సీ. మదట తొండొరతొండు మదల మాలుగుఁబోతు, చండి సోమరి నలి తిండికాఁడు
దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలిన, వానిపేర్లై పనివాఁ డనంగఁ
గర్మకారుం డొప్పుఁ గర్మదక్షుఁడు వెత, మరి హార్యకాఁ డనఁ బరఁగుచుండు
వఱలు జాల్మ్ఁడు చెఱపనచేట యనఁగను, బలలాశి కాఁచుమేపరి యనఁ దగు
ననద యనఁగ ననాథుండు దనరుఁ బొట్ట, పోసికొనువాఁ డనంగను బొట్టసారు
వాఁ డనఁగ వెలయు నుదరంభరిసమాఖ్య, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 6

సీ. ఆఁకొన్నవాఁ డన నద నైనవాఁ డన, శోభిలుచుండును క్షుధితసంజ్ఞ
వెట్టి వెంబరవిత్తు వెంగలి వీటిఁడి, వెడఁగు వేదుఱు తిక్క వెకలి యనఁగ
నున్మాదిసంజ్ఞయై యొప్పుచుండును మస్తు, వాఁ డిన మత్తుఁడు పరఁగుచుండుఁ
జెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ, బేరజ మన ధూర్తుపేరు వెలయుఁ
గరటి యడిగొట్టు పలువ యేతరి గరాసు, చెనఁటి చెన్నటి కూళ కుచ్చితుఁడు మొండి
కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 7

గీ. మొరసు మోటు పిసాళినా మూఢుఁ డొప్పుఁ, దనరు శాలీనసంజ్ఞ మేదకుఁ డనంగ
నెసఁగుచుండును బ్రియవాది యిచ్చకాల, మారి యన వైశ్యకన్యకామాతృభూత. 8

సీ. అలరుఁ దంటలమారి యన నవినీతుండు, భయశీలుఁడో వెఱపరి యళుకరి
కోళె నాఁగను వెఱఁగుపడువాఁ డనఁగను, విస్మయాన్వితసంజ్ఞ వెలయుచుండు
గాందిశీకుఁ డగు దిక్కా–మెకం బనఁగను, ప్రౌఢుండు ప్రోడనాఁ బరఁగుచుండుఁ
దీయువాఁ డనఁగను దెలియనౌ గ్రహయాళు, ఘతయాళు వగుఁ బదువాఁ డనంగ
మ్రొక్కువాఁడన వందారు వొలుచుచుండు, ఘాతుకుఁడు సొంచువాఁడనఁగాఁ జెలంగు
నుబుకువాఁ డన వర్ధిష్ణుఁ డొప్పుచుండు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 9

సీ. ఉత్పతిష్ణుసంజ్ఞ యొప్పును నెగయువాఁ, డనఁ దాఁటువాఁ డనఁ దనరు లంఘి
విసువాసి యనఁగను వెలయు విశ్వాసి సి, గ్గరి యన హ్రీమదాఖ్యయయి చెలఁగు
హాసుకాఁ డనఁగను నగు భోగి గుమ్మఁడం, చనఁగను జికిలికాఁ డనఁగ సొగసు
కాఁ డనంగను వన్నెకాఁ డనంగను నీటు, కాఁ డనఁగా నలంకారి యొప్పు
నుండువాఁ డన వర్తిష్ణుఁ డొప్పుఁ ద్రోయు, వాఁడు విలసిల్లుచుండుఁ దోపరి యనంగ
మేదురసమాఖ్యయౌ మినమిననివాఁడు, గరగరనివాఁడు నాఁగను గాలకంఠ. 10

సీ. జట్టికాఁ డనఁగను జనుఁ గ్రేత తరుగరి, యనఁగను దత్సహాయాఖ్య చెలఁగు
నగుఁ బ్రధానాభిధ యంకెకాఁ డనఁగను, గోపకాఁ డనఁగను గోపి దనరు
బలువిడి యనఁగను బల్లిదుం డనఁగను, దండివాఁ డన బలాఢ్యుండు చెలఁగుఁ
బరఁగును క్షంత యోర్పరి యనఁ దాలిమి, కాఁ డన జాగరూకాభిధాన
మలరు మెలఁకువకాఁ డన నగును గూర్కు, వాఁ డనంగను నిద్రానువర్తిపేరు
వెలయు మాటలమారినాఁ బ్రేలువాఁడు, నాఁగ వాచాటుఁడై యొప్పు నాగభూష.

సీ. వొలుచు నసత్యుండు బొంకరి యన రజ్జు, ల్లాఁ డనంగను జల్లికాఁ డనంగ
మ్రోసెడిది యనంగ ముఖరాఖ్య తగు నత్తి, వాఁ డన లోహలవాచక మగు
వ్యర్థభాషుఁడు వళావళికాఁ డనం దగు, గెలివివాఁ డనఁగను జెలఁగు రవణుఁ
డజ్ఞుండు తఱు దమ్ముఁ డంభస్తనంగను, గఠినాత్ముఁ డొప్పును గడుసరి యన
వెలయు నగ్నుండు దిసమొల బిత్తలి యనఁ, దనరు వెలిఁబడ్డవాఁ డనఁగను బహిష్కృ
తుండు బరికాయ కొంటెనాఁ దోఁచు భ్రష్టుఁ, డాతతదయారసోపేత మాతృభూత.

సీ. కొండెకాఁ డనఁగను గొండెగీఁ డనఁగను, గొండియుఁ డనఁ బిశునుండు వెలయుఁ
జిట్టుకట్టె యనంగఁ జెలఁగును శఠుఁడు, సంకరుఁడు రాజిలును బల్గాకి యనఁగ
కొద్దికాఁ డనఁగను క్షుద్రుండు తగు ఖలుం, డొప్పు నాట్లఁ డనంగ నులిపికట్టె
యనఁగను బొట్లని యనఁ జెట్లకొఱవినాఁ, దగు నవస్థాభిధ తగనివాఁడ
నంగ స్త్రీభాషి దోఁచు నాఁడంగి యనఁగ, నాగడీఁ డనఁ బరిహాసకాఖ్య చెల్లు
నలరు నొప్పనివాఁడునా నప్రకాశ్యుఁ, డొప్పు మిడిమేల మన దుస్సహుఁడు మహేశ.

సీ. వశ్యక్రియావేది వలలు మందులమారి, యన వేఁడువాఁ డన యాచకుఁ డగు
నగచాట్లమారి నాఁ దగును గస్తాత్ముండు, వెలయు దరిద్రుండు పేద యన బి
కారి యంచన బరికట్టైనా నతి దరి, ద్రుఁడు నిరుపేద నా నడరుచుండు
రవణము చొక్కము రకము చొక్కాటము, రాణ చొక్కాటము నాణెము చొక
గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య
యలరు వలచినది యనఁ బ్రియంబు పేరు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 14

సీ. మక్కు మాసినదినా మలినంబు విలసిల్లు, సుద్దమం చనఁగను శుద్ధ మొప్పు
నిచ్చలం బనఁగను నిర్మలంబై తోఁచు, రత్తలాటారంబు రిత్త బీదు
సొళ్ళు నా రిక్తాఖ్య శోభిల్లుఁ గన్నాకు, మేల్బంతి నికరము మేటి మేలు
తర మాణి యంచనఁ దనరు శ్రేష్ఠుఁడు సింగ, మనఁ జందమామ యంచనఁగ మిన్న
యనఁగ బెబ్బులి యన మదహత్తి యనఁగఁ, బైకడను నిల్చి శ్రేష్ఠమై పరఁగుచుండు
హాసదు నాఁగను దొడ్డవాఁ డనుట కొప్పు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 15

సీ. బహుత నన్యులఁ దెల్పుపట్ల హేమాహేము, లనుపల్కు ఘ్రాజ్యార్థ మగుచునుండు
నుపసర్జనాఖ్యమై యొప్పును సందడి, కాంద్రునాఁ జిల్లరవాంద్రు నాఁగఁ
పెద్ద యేచా టుబ్బు పెను పేరు బలు దొడ్డు, దొడ్డ వలుద నాఁగఁ దోఁచుఁ బృథువు
సైకంబు కొంచెము సన్నంబు తోడెము, చిరుకి ముద్దస దులె చిఱుత లేఁత
కొద్ది యన్నువ యనఁగను గొఱలు నల్ప, మలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ దట్ట
మనఁగఁ దంపర యన వర్తులాఖ్య చెల్లు, బటు వనఁగ వట్టు వనఁగను బార్వతీశ.
పలపల యన వెలితి యనన్, బలచన యన విరళసంజ్ఞ భాసిల్లును ని
స్తులతరగుణోత్తరంగా, విలసత్కరుణాంతరంగ వృషభతురంగా. 17
వెడఁద యన విశాలమగున్, నిడుద యనన్ వాసి యనఁగ నెగడును దీర్ఘం
బడరును సమున్నతాభిధ, పొడవం చని పల్కు మాతృభూతమహేశా. 18
ఒప్పును సదాటు నాఁగ వక్రోన్నతంబు, వంక రన సొట్ట యనఁగను వక్ర మెసఁగుఁ
జనును బుజునామధేయంబు చక్కని దన, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 19
ఒమ్ము గాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ, స్థూల మగుఁ బెక్కు నాఁగను దోఁచుబహుళ
మగును గణనీయమా నెంచఁదగినది యన, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 20
దండ చేరువ చెంగట యండ సరస, ప్రాపు చక్కి కురంగట పజ్జ చెంత
కెలన దా పంజ దగ్గఱ క్రేవ పొంత, యంచ యొద్దనా నికటాఖ్య యగు మహేశ.
ఏడుగడ నా నియంతసం జ్ఞెల్ల యనఁగఁ, దనరుచుండును సర్వాఖ్య దవ్వు నాఁగ
దూరనామంబు గాఁగను దోఁచుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 22

గీ. గట్టి కటికి యనంగఁ గన్పట్టు దృఢము, క్రొత్తమిహిహాస యనఁగ మోఱునునవంబు
ప్రాఁత యనఁగఁ బురాణాఖ్య పరఁగుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

సీ. మను మెత్తనిది గోము మవ్వ మనంగను, మృదుసంజ్ఞ ప్రథమ మౌ మొదటిది యనఁ
గడపటిది యనంగ నడరు జఘన్యంబు, తెల్ల మనంగ రాజిల్లు స్ఫుటము
పరఁగు వీసరము లేబర మన వ్యర్థంబు, నైచ్చ పెల్లదనము హెచ్చు మిగితి
మిక్కిలి యెక్కువ మెం డగ్గలము పెచ్చె, దుగు నాఁగ నధికంబు దోఁచుచుండుఁ
దక్కువకొఱంత పొచ్చెముతగ్గ కుందు, కొదువ లొచ్చు కొదుకయనఁ బొఱలు న్యూన
మడరుఁ దక్కటి యెడ కడ కడమ తక్కు, వేఱు పెఱ యన నితరాఖ్య ధూరవైరి.

సీ. ఒంటి యనంగను నొప్పు నేకాకియై, సగటు నాఁగను సరాసరి యనంగ
సామాన్య మెసఁగు నుచ్చావచంబులు దోఁచుఁ, బలువితంబు లనఁగఁ బలువగలన
బరిదెగినది విడివడినది యనఁగను, వెలయుచుండును విశృంఖలసమాఖ్య
ప్రతికూలనామమై పరఁగు నడ్డ మనంగ, వామంబు వెలయు డాపల యనంగ
వలపల యనంగ దక్షిణం బలరుచుండు, నిరుగడలు నూరె లిరుపక్క లిరు మెయులన
నుభయపార్శ్వాభిధానంబు లొనరుచుండు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 25

సీ. ఇరుకట మనఁగను బరఁగు సంకటసంజ్ఞ, గహనంబు జీఁబు నాఁగను జెలంగు
చిన్నరిపొన్నరి చిన్నారిపొన్నారి, యనఁగను ముద్దుగుల్కునది తోఁచు
నకృతలక్ష్యాభిధ యలరును జీరికిఁ, గొననిది సడ్డసేయనిది యనఁగఁ
జలపాది యనఁగను సంకల్పసాధియౌఁ, బొలుచును మలతన మురిగొనునది
యగును బిరుదాఖ్యఁ దన బిరుదాడి యనఁగ, గక్కసం బగు బిరుదులు గలుగు నాతఁ
డుల్లరపు బిరుదైన రాజిల్లుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 26

సీ. అప్రయోజకసంజ్ఞ యలరుచుండును గొఱగానివాఁ డనఁగఁ గిగ్గాడి యనఁగ
బారెఁడు మూరెఁడు పట్టెఁడు జేనెఁడు, దుత్తెఁడు పుడిసెఁడు బెత్తెఁ డనెడి
యివి మొదల్గాఁగల వెల్లను వ్యామాది, పరిమితార్థములుగాఁ బరఁగుచుంచు
రూకంత కొసంత పోకంత యీఁగంత, యిసుమంత దోమంత యేనుఁగంత
యనెడి శబ్దంబు లీరీతి నలరుపదము, లన్నియుఁ బణాదిమాత్రంబు లగుచునుండు
నవ్యయీభావ మని కొంద ఱంద్రు వీనిఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 27

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగును విశేష్యనిఘ్నాఖ్యవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 28

---

## సంకీర్ణవర్గము.

సీ. కోవురంబనఁ జెట్టకొన కెక్కి పైరులఁ, జూచుట కర్థమై తోఁచియుండు
నల్లారుముద్దునా నగు జనసమ్మతి, యదువకా పనఁగను నద్దెకాఁపు

నల్లిబిల్లి యనంగ నలరుఁ బెనంకువ, నిలకడ దనరును నిట్టల మనఁ
గస్తిలు పనఁగను గస్తీటు విలసిల్లు, సెసకమం చనఁగ నుల్లసిలుఁ జలము
అలరు దొంతరవళులప్పే రంబ్బె లనఁగ, నీరతార లనంగను దాలుమాలు
లలరుచుండును గాజురా యన షూలాషు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.　29
అదను నాఁ దటి నాఁగ నలరును సమయంబు, గద్దింపు వెలయును గద్దన యన
సొనవెట్టు నాఁగను దనరును పొంచడం, బడరును జూఅ యంచనఁగఁ గొల్ల
చెచ్చెర యనఁగను జెలఁగును సులభంబు, పస యన స్ఫురణంబు పరఁగుచుండు
సైద మనంగను జనును గోధుమపిండి, క్రమ మొప్పుచుండు సరవి యనంగఁ
జిటికిరింత యనంగను జిటిక యనఁగ, వ్రేల్మిడి యనంగఁ ద్రుటిపేరు వెలయుచుండు
సవసవ యనంగఁ గొద్దిగాను వినుట తగు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ.　30
భుజయుగంబున జందెముల్ పోల్కి మెలిని, బెట్టి యున్నట్టిదుప్పటి గట్టిగాఁగఁ
గట్టు కట్లొప్పెసఁగు నరిక ట్టనంగ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.　31
బద్దపరికి యనఁ బలుచనిబిళ్లయౌ, నెడరు నా సందుక ట్టెసఁగుచుండుఁ
బంపు నా నభిచారవాచకం బౌను దూ, ర్పార యంచనఁగను బవన మొప్పు
నఱజాతి యనఁగను నలరును జెడుజాతి, బన్నిక యనఁగను బన్నుట దగుఁ
జెల్లుబడికిఁ బేరు చెలఁగును రప మనఁ, గందువ యనఁ జనుత్యాగ మెసఁగు
నెద్దులను కాళ్లు గట్టి క్రిం దేయు టొప్పుఁ, గోలగ్గర యనఁగ దిగ్గోలనంగ
వెలయుఁ దినరోజు మునుము నా నలరు కోయు, పయిరుపనుముందు పైరు గాఁ బార్వతీశ.
పరఁగు నాకస్మికంబు డబ్బా టనంగఁ, దనరుఁ బెడకంత యనఁగను దప్పుత్రోవ
ప్రబలుముఱ్ఱోవ నాఁగ దుర్గంధపదవి, వ్యగ్రతయుఁ దోఁచుచుండుఁ జూవరమనభవ.
నెములియీఁకలఁ బేనుదారములపాగ, నెట్ట మని పల్కఁ గాఁ దగుఁ దెట్టుకొఱవు
ముండ్ల నల్లినతడకయై పొలిచియుండు, తడుకుఁ బెండె మనంగఁ జంద్రార్ధచూడ.　34
గాదె పోలిక నుండెడి కాఁగు పేరు, రంజణి యనంగ వెలయు నాగ్ధనసమాఖ్య
యడరు రజన యనంగను గడెన యనఁగ, లంప యన దొంగమేపు చెలంగు నభవ.　35
ఘటవిశేషంబు లై రేనికగవ లనఁగ, బూజుగు లనంగ బుడ్లనఁ బొలుచుచుండు
గాజులను గూర్చు చేరులు గాఁ జెలంగు, చుండు మల్లార మనఁగను సోమభూష.　36
చెంపలనుమూసికట్టుట చెలఁగు గౌద, కట్లనంగను గడూఘులోఁ గలుగుజాలి
యలరుచుండును జూమ్మచుట్లనఁగ భక్త, పోషకాపాంగ శ్రీమాతృభూతలింగ.　37
పల్లముల నిరువంకలఁ బరఁగు పట్టు, త్రాళ్లు వెలయుచునుండు లాలసరు లనఁగ
వెనుక మోఁచేతులను గట్టిపెట్టు టొప్పు, లాఁకకట్టు లనంగఁ గైలాసవాసి.　38

గీ. కీలుకీలున విఱుచుట గేరును విట, తాట మనఁగాను మెకమెకపాటునంగ
నాఁకలికి నూర్వ్యజాలనియార్తి చెల్లు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 39

గీ. బెత్తలు భుజంబులందును బెట్టుకొనెడి, యార్ద్రపటములు మాలుగు లనఁగ వెలయు
వ్రేఁగు లనఁ బరువులపేరు వెలయుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 40

గీ. సోయగంబు సొబగుఁ జోక మురువు కొమరు, చెలువు తీరు సొగ సొలుపు చెన్ను
చక్కఁదన మనంగ సౌందర్య మొప్పును, మహితగుణసమేత మాతృభూత. 41

గీ. వన్నె హెచ్చినయట్టిక్రొంబసిఁడికడ్డి, కత్తిరించిన తావునఁ గానిపించు
నిగ్గనఁ జేరు నక్కానా నెగడుచుండుఁ, దను కనఁగ వజ్రకాంతిమై తనరు నభవ.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు నిచ్చలు సంకీర్ణవర్గమిట్లు
నైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 43

---

## నానార్థవర్గము.

సీ. గారన నేనుఁగు కాహళి విలసిల్లు, డంబు నాఁగను గాంతి డంబము నగుఁ
జెలి యనఁ జెలికాఁడు చెలికత్తెయును దోఁచుఁ, జెట్టనాఁ జెనఁటియుఁ జేయి వెలయు
స్తనకవాటాంగము ల్దనరు గుబ్బ లనంగ, నావు నెద్దును దొడ్డు కనఁగ వెలయుఁ
జిన్న నేజయు నమ్మ చెలఁగును గొరకనాఁ, జెలఁగుఁ జోటి యనంగ శిశురుపములు
బాలకేళీనతుల్ చెంగనా లనఁ దగుఁ, గచ్చ తెల్లును మగఁటిమి గండనఁబడు
నల్పకుసుమంబు వినతియు నడరు చిన్ని, పూవనుకొనంగ శ్రీమాతృభూతలింగ. 44

సీ. పక్షశౌర్యంబులు పరఁగుఁ డాక యనంగఁ, దెమ్మనాఁ బెల్లయుఁ దేమ వెలయు
వత్సకృత్రిమపుణు ల్వాఁలును దఱుపునా, నలితిండి యొప్పును నలి యనఁ దగు
నవలక్షణభగాఖ్యలలరు దూబ యనంగ, నాచునా దొంగయుఁ బ్రాచి దనరు
ఘర్షణపికటముల్ గనుపట్టు టొకునా, నోలినా వరుసయుఁ నుంకువ తగు
నిచ్చము చిలుకుటయుఁ దోఁచు బ్రచ్చన యన, నెల్లినా ఛత్రమును రేపు నుల్లసిల్లు
నట్టునాఁ గేహ తద్దేశనామ మెసఁగుఁ, బ్రభుగుహాఖ్యలు సామినాఁ బరఁగు నభవ.

సీ. రోషజుగుప్సాఖ్య లొప్పు నేవ యనంగఁ, గొఱత నాఁ దక్కువ కొఱ్ఱు వెలయు
స్థైర్యయత్నంబులు చనుఁ గడంక యనంగఁ, గొఱ యన నొప్పు తక్కువ చెలంగు
బీసునేలయు రైక వెలయుఁ గంచెలయనఁ, గ్రోలునాఁ బానంబు క్రోవి దోఁచు
నికటఖళూరిక ల్నెగడును గరిడినా, నావు పొట్టియు గిడ్డి యనఁ జెలంగుఁ
గట్టుతేళ్ళనఁ గంటక క్షుద్రులగుదు, రలరుఁ జుట్టము కూర్మి గాదిలి యనంగ
నేతుల యనంగ దగుపాటియింతి చేఁట, లల్లువనితయుఁ దోఁచుఁ బళ్యల్ల లాట. 46

సీ. సాస్నయుఁ బెద్దడో ల్చను గంగడో లనఁ, బడగనా టెక్కెము ఫణము దనరు
నష్టిమయూరాఖ్య లలరు నెమ్మి లనంగఁ, బసి యన ధేనువు పవన మెసఁగు
మందు రోష్ణీషము ల్మనును బాగా యన, గుఱుతు పక్కియుఁ దగుఁ బులుగు నాఁగ
సస్యభేదాంబుగ ల్చనుఁ బాలవెల్లి నా, బాటనా దిక్కు త్రోవయుఁ జెలంగుఁ
గుసుమితామ్రంబులును మచ్చగుజ్జములును, మనుచునుండును బూచినమావు లనఁగఁ
గ్రొత్తముట్టిన నూలుపోఁగును సమర్త, పొలుచును వినంగ శ్రీమాతృభూతలింగ. 47

సీ. మొసలియు డేగయుఁ బొల్చు బైరియనంగ, రాజరాత్రులు రేలు నాఁగఁ దనరుఁ
బ్రణతియుఁ గౌముది బరఁగు వెన్నెల యనఁ, బూవునా సొగసును బుప్ప మొప్పు
వేగంబు పాళెము వెలయు వేళ మనంగ, వైరవేగము లగు వేర మనఁగ
లూటినా దవుడపుండును దండు వయి దోఁచు, నాటనాఁ గ్రీడ నాట్యమ్ము చెలఁగు
వ్యాసటిక డేగయుఁ జెలంగు వేసడ మనఁ, జెల్లుఁ బైమేడ యొప్పు మేలిల్లనంగ
మెఱుఁగురిక్క లనంగను బరఁగు మిన్న, సైనచుక్కలు పగడంబు నచలవాసి. 48

సీ. సమమిత్రసంజ్ఞలై చను బోటిగాఁ డన, ముకుళంబు నిగ్గు పూమొగ్గనఁ దగుఁ
బునరర్థరజతము ల్పొల్చు వెండి యనంగఁ, బరఁగు జీనియు గుంట పల్ల మనఁగ
ప్రహదధౌతవస్త్రంబు లమరును మడుఁగునా, నధరపాదాభిధ లడుగనఁ దగుఁ
బొలమరి యనఁగఁ గాఁపును వితమరి దోఁచు, భగినియుఁ దల్లి యప్ప యన వెలయుఁ
దావి కట్టిన యట్టిచందనపుచెక్క, పొడియుఁ గమ్మయు జాబనఁ బొల్చియుండు
జొరుకు లనఁ జెట్లచీమలు నుసులుదోఁచు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 49

సీ. ఓడ భిక్షాభేద మొప్పును జోగునా, న్నలుఁగునాఁ బరిఖాహ మాయుధ మగు
షట్సంఖ్య నూఁగారుఁ జనుచుండు నారునా, నాలునా ధేను భార్యాఖ్య లమరు
విటతాట మనఁ గీల్కు విఱిచి పెట్టుటయు ద, య్యము పట్టియుండుట యమరియుండు
సత యనఁ బల్లము సప్తసంఖ్య చెలంగు, నాళయు వృత్తమా నక్కఱ యన
నుదకసంభూతిబల మగు నూట యనఁగ, నుపహతియుఁ దావు నెట్టన నొప్పుచుండుఁ
జంద్ర నవనీతఘుటికలు చనును వెన్న, ముద్ద యని పల్క శ్రీమాతృభూతలింగ. 50

సీ. కలుష దేశమ్ములు చెలఁగుఁ గలంకన, నెవ యన భయమును హృదయ మెసఁగు
బండిషంపటి చిల్కు పరఁగు గొల్లె మనంగ, నోరయిక కోశంబు నొర యనఁ దగు
సారోహణ శ్రేష్ఠములరు నెక్కుడు నాఁగఁ, గలుపునాఁ జెరుగును గాద మొప్పు
ధనురగ్ర గుణములు దగు గొనయం బన, నొప్పుఁ గచాటను ల్కొప్పు నాఁగఁ
బంట యొబ్బిడి సేయించుపని వసంత, మును విభాసిల్లుచుండు నామని యనంగ
నానవా లనఁగాను జిహ్వాంబుఁ గాఁచు, పాలు నయి యొప్పుచుండును నీలకంఠ. 51

సీ. కొమ్మనా వాద్యభేదమ్మును శృంగమౌఁ, గందునా శిశుకళంకములు దోఁచుఁ
జిలుమువా లనఁగను జిలుముపట్టినకత్తి, యులిపికట్టె యనఁ జెన్నలరుచుండు
ధాతవస్త్రంబు కేదారమౌ మడి యనఁ, గుండు నాఁగను హయగోళము లగు
వ్యంజన శ్వాసము ల్వఱలు నూరు పనంగ, వనిత శాఖయుఁ గొమ్మ యనఁ జెలంగుఁ
గై వడి యనంగఁ దగు రీతి కరజవంబు, రాయి సాగాయి కల్లునా రహి వహించుఁ
గమ్మ యనఁగను జాబును గర్ణభూష, పొల్పుచుండును శ్రీమాతృభూతలింగ. 52

సీ. ఖట్వాంగరేఖలు కనుపట్టుఁ గోడునా, ఘటికాగ్గళంబులు గడియ యనఁగ
బవనపిశాచము ల్వరఁగు గాలి యనంగ, గట్టునాఁ దీరనగంబు లలరు
వృత్తాంతదంభము ల్వలయును గబు రన, బంతినాఁ గందుకపంక్తు లెసఁగు
నరసంఘనికటముల్ పరఁగుఁ జేరువ యన, నండతారకలు గ్రుడ్డనఁగ మీఱు
ఘూకకర్ణైకదేశము ల్గూబనఁ దగు, గంట యనఁ బైరుదుంపయు ఘంట యొప్పు
నుపలరాశియు నణుకువాఁ డొప్పుచుండుఁ, గుంట యని పల్కఁగ సుగంధికుంతలేశ.

సీ. శ్రవణైకదేశ మాచ్ఛాదనగేహంబు, మీఱుచునుండు గుడార మనఁగ
యవనాశ్వభేదంబు లలరుఁ బటాణినాఁ, దొలినాఁగఁ బూర్వంబు బిలము దోఁచు
బంధువు ల్వలయము ల్వరఁగుఁ జుట్ట లనంగఁ, దెఱవనా బయలును స్త్రీ దనర్చు
దంతక్షతంబు రత్నం బగుఁ గెంపునా, దండనా నికటంబు ధామ మొనరు
బొందళము యుగి జో డనఁ బొల్పుగాంచుఁ, జెలఁగు విరళంబు సాంద్రంబు జీబునాఁగ
గందపట్టె యనంగను జందనాను, లేపన కవాటపట్టిక ల్మీఱు నభవ. 54

సీ. కంఠభూషాలతికలు దోఁచుఁ దీఁగనా, స్థూలము గుణ మొప్పుఁ దోర మనఁగ
మార్గకుష్టంబులు మనుచుండుఁ దెన్నునాఁ, బాలునా క్షీరంబు భాగ మెసఁగుఁ
గాంతిధ్వజంబులు కనుపట్టు డాలునాఁ, జంద్రమాసంబులు చను నెల యన
శిశువు కనీనిక చెలఁగుఁ బాప యనంగఁ, బలుకునా శకలభాషలు దనర్చు
దోఁపు నాఁగను దగు నల్లతుమ్మచెట్టు, బట్టపేరును శృంగారవనముపేరు
బాళియును గోటవెలిమంటపంబు దోఁచుఁ, దమక మనఁగను మాతృభూతాభిధాన.

సీ. జాతసూతకమును సమ మగుఁ బురుడునాఁ, బెంపునా నాశంబు వృద్ధిదోఁచు
నెమ్మినా బర్హిసఖ్యమ్ములు దనరారు, నాడునా దేశ దినమ్ము లెసఁగు
శయ్య విస్తారంబు చనుచుండుఁ బరుపునాఁ, బగలునా ద్వేషదివాఖ్య లెసఁగుఁ
దావునామంబులు దనరును బేరునా, బాసనా శపథంబు భాష వెలయుఁ
బోఁగనాఁ దంతువును గర్ణభూష మీఱు, వెలయు శిశువత్సములు పసిబిడ్డ యనఁగ
సింహపూర్ణోదమానము ల్సెలఁగును నెఱి, సరి యటంచని పలుకాఁడఁ జంద్రచూడ.

సీ. కంఠభూషణమును గనకాక్షినామంబు, పైఁడికంటి యనంగఁ బరఁగుచుండు
స్వర్ణోపకారము ల్చనును మేలిమి యన, మూలనాఁ గచకోణములు దనర్చు
నౌదుంబరంబు హాలాగ్రమా మేడినా, బడుగునా శవము దుర్బలుఁడు దోఁచు
సౌందర్య కరవిభూషలు చను మురువునా, మెఱుపును గాంతియు మెఱుఁ గనఁదగుఁ
గర్ణభూషణమును దటాకజలనిర్గ, మస్థలంబును బొగడనా మనుచునుండు
నన్యమును క్షుద్రపటలంబు నలరుచుండుఁ, బెఱ యనంగఁ బరాంతకవిభువిభంగ. 57

సీ. పుష్పచాపంబును బుష్పగేహంబును, బూవిల్లు నాఁగను బొదలుచుండుఁ
బేఁటయం చనఁగను విపణిప్రదేశాఖ్య, యేకసూత్రాఖ్యయై యొసఁగుచుండు
మఱుఁ గనఁగాను బ్రమాణభేదంబును, ధౌతవస్త్రంబును దనరియుండుఁ
గలవాలనిహతియు సరసీరుహాక్షియు, వాల్గంటి యనఁగను బరఁగుచుండుఁ
గోపరీతులు మోడినాఁ గొఱలుచుండు, వేఁట యన మేషమృగయలు వెలయుచుండుఁ
దోఁచు జఠరామయంబునఁ దూమునందు, బల్లయను నట్టిమాట పళ్యల్ల లాట. 58

సీ. కంటకావృతియును గాంతియుఁ వెలుఁ గనఁ, బవనశైత్యంబులు వలి యనఁ దగుఁ
బరిమళవీథులు వాడయం చన మీఱు, వెలియటం చన బహిశ్శ్వేతము లగు
ఖడ్గదీర్ఘంబులు గనుపట్టు వాలునా, యతివేగములు వడి యనఁ దనర్చుఁ
బ్రత్యుపకారంబు గ్రామమా వీడునా, సరి యనఁగ్గా దాను సమము లొప్పు
సాక మనఁగను వ్యాజ ముత్సవము దోఁచు, నల్పరవమును రతి సంచునాఁ దనర్చు
నల్పమార్గంబు మల్లవిద్యావిశేష, మొప్పు సందన శ్రీమాతృభూతలింగ. 59

సీ. ముఖపతితాహారమును దంతవసనంబు, వాతెఱయం చన ఖ్యాతిగాంచుఁ
బులిసినవంటకంబును పులిహోరంబు, పులికూడు నాఁగఁ బెం పొందియుండు
స్త్రీమత్స్యభేదముల్ దీర్ఘలోచనములు, వాలుగన్ను లనంగ వఱలుచుండు
యమనిష్ఠధాటియు నాయుధభేదంబు, జముదాడి యంచన నమరియుండు
నభ్రగంగ శిరస్త్రోద మలరును దల, యే రనంగ నఖక్షుతశారికాభి
ధానములు గోరువంక నాఁ దనరియుండుఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 60

సీ. కబళపరిమళ తుత్యర్థములయందుఁ, గనుపట్టుచుండును గడి యనంగఁ
జంద్రకమ్ములును లోచనములు రంధ్రము, ల్చెన్నొందుచుండును గన్ను లనఁగఁ
గబరియు శిఖయును గార్ముకాగ్రంబును, గొప్పని పల్కఁగా నొప్పుచుండు
శ్యామలవర్ణంబు సాక్షియు మర్యాద, పరఁగుచునుండును గరి యనంగ
నిగ్గు చిరుగడ్డ కుటిలంబు నెఱియనఁ దగు, వ్యథగొలుసుగొప్ప వెలయును శారియనఁగ
బిందునక్షత్ర తిలకము ల్వెలయుచుండుఁ, జుక్క యనఁగఁ బరాంతకచోళవైరి. 61

సీ. ధనురగ్రమధ్యన్యస్తావయవమ్ములు, గొలుచునుండును గోపునాఁగఁ
బడిగలు మడిలోనఁ బడిన యెన్నులు నేటి, కడనేల లొప్పును బడిగ లనఁగఁ
దామర లొక్కొండమీఁదఁ గలనేలలును జూ, దమ్ములు వెలయు నెత్తమ్ము లనఁగఁ
జంద్రమః క్షత్రియ సర్వంసహాపతుల్, దాజిల్లుచుందురు రాజనంగఁ
బ్రసవ ఖర్జూర సలిలసంప్లావనములు, వెలయు నీత్ర యనంగను గలికి యనఁగఁ
గొంగ దలయీఁక దంటయుఁ, గోమలి యనఁ, బొలుచునువినంగ శ్రీమాతృభూతలింగ.
సీ. కచబంధమును శిఖ గంధమూషికమును, శోభిల్లుచుండును జుంచునాఁగ
నల్ప తరక్షు బాలాభిధానంబు, చిఱుత యంచనఁగను జెలఁగుచుండు
రాజిల్లు సంవత్సరాంతంబు లాంగల, పద్ధతి చాలునాఁ బరఁగుచుండుఁ
వాజినీగర్భంబు వాచవు లుమ్మ త్తెంపు, తూనిక చవులునాఁ దోఁచుచుండుఁ
దిలకభూషావిశేషబిందులు చెలంగు, బొట్టనంగను జంపునాఁ బొల్చియుండుఁ
సముద యాలస్య ఝల్లరీసంజ్ఞ లగుచు, ధార్మికనిధాన మాతృభూతాభిధాన. 63
సీ. ఆహార మాఁకలి యవనిపన్నగములు, పరఁగుచునుండును నెర యనంగ
స్వశ్రేయసార్థ ప్రశంసార్థములయందు, మీఱుచునుండును మే లనంగ
వేఁటసాధనమును వీచియు యవనిక, దేజరిల్లుచునుండుఁ దెర యనంగ
గాదెబొట్టయును దుగాసారమును ముద్దు, గుమ్మయు వెలయును గుమ్మ యనఁగ
గజవిశేషంబు ముందువెన్కలనుజూడఁ నట్టివాఁడును గెంపులయందుఁ బాట
మునఁ దలుక్కను జిగి దగు మొక్కలీయన, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.
గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు నిచ్చలు నానార్థవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 65

## అవ్యయ వర్గము.

సీ, అగ్గడ యక్కడ యచట యచ్చట యాడ, యందలి పానపాన యయ్యెడ యట
యందునాఁ దత్రార్థమై విరాజిలుచుండు, నెగ్గడ యెక్కడ యెయ్య డెచ్చ
టెచ టెందు నాఁగఁ బెంపెసఁగు యత్రార్థమై, యిక్కడ యిచ్చట యిచట యీడ
యియ్యె డిం దనఁగఁ బెంపెక్కు నత్రార్థమై, యద్దిర యయ్యారె యార మేల్ సె
బాసు మర్ఝూ బలారె సేబాసు నాఁగ, నలరుచుండుఁ బ్రశంసార్థములుగ మీఁద
పై పయిని నాఁగ నూర్ధ్వాఖ్య పరఁగుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.
సీ. దిగువ క్రింద యనంగఁ దగు నధస్సంజ్ఞమై, యొగి లెస్స యనఁగ సాధూక్తిఁ దనరు
కట్టా యనంగను గటకటా యనఁగఁ గ, టా యనంగ బతార్థమై యెసంగుఁ
దద్దయు నాఁగను దనరు భృశార్థమై, పరఁగు నప్యర్థంబు మరి యనంగ
నినుఁలు చార్థంబు గా దనరును సవి సావి, యని యన నిత్యర్థమై తనర్చుఁ

బరిపరి యనంగఁ జిందఱవందఱ యన, నలరుచుండును గణశోర్థ మగుచుఁ బాట
ఫ్పాట యనఁ, గొద్దికొద్ది యన్పాట చెలఁగు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 67

సీ. సుఁడి సుమీ సుండి సూ సుమ్మి యనంగను, నిశ్చయార్థకముగా నెగడుచుండు
వారక యనఁగను మీఱు నిరంతరా, ర్థముఁ గదయనఁ గిలార్థమ్ము చెల్లు
నంతయం చనఁ దావదర్థమౌ నెంతనౌ, యావదర్థంబుగా నతిశయిల్లు
నేతావదర్థమౌ నింతయం చనఁగను, బలునాఁగ నానార్థ వాచక మగుఁ
దనర్చు నొండొండు నాఁగ మిథఃపదార్థ, మొప్పు నొకపరియొక తేప యొక్కసారి
యొక్కమాటన సకృదర్థ మొనరు నంత, నట యన నథార్థ మగును సూర్యావతంస

గీ. మగుడ క్రమ్మఱ క్రమ్మటి మరల సారె, వెండి మాటికి తిరుగనా వెలయును బున
రర్థముగఁ ద్రిక్క యనఁ దక్క యన వినార్థ, ముగను రాజిల్లు శ్రీమాతృభూతలింగ.

సీ. చీటికిమాటికి మాటిమాటికిఁ బలు, మరు వేమ రనఁగ సదార్థము లగు
నెట్టకేలకు నాఁగ నెసఁగుఁ జిరార్థంబు, తగువృథార్థంబు వితా యనంగఁ
గూడ యనంగను దోడుత యనఁగను, రాజిల్లునౌ సహార్థంబుగాను
ఓయన వేమినా నొప్పుఁ గిమర్థంబు, నైతె యనంగను ద్వ్యర్థమలరుఁ
గనుక కనుకను కాఁబట్టి కాన కాఁగఁ, గావున యనంగ నన్నియేకార్థము లగు
నడరును గదాచిదర్థ మొక్కెడ యొకప్పు, డనఁగను సుగంధికుంతలాప్రాణనాథ. 70

గీ. వేయనఁగ సయ్యన యనంగ వెస ననంగఁ, గ్రచ్చర న గ్రక్కునయనంగఁ గ్రన్ననయన
నప్పళి మన బిరానా నొప్పుచుండు, ఝుడితిపదతుల్యములు గాను జంద్రచూడ. 71

సీ. తగు నవిచ్ఛిన్నార్థముగను హారోరాహారి, యనఁ గాక యనఁగ నుతార్థ మెసఁగు
నోరనా సాచ్యర్థ మొప్పును సహసార్థ, ముగ విరాజిల్లు గొబ్బున యనంగ
సంబోధనార్థమై చను నో యనంగ నో, రీ యోరి యనఁగను రేసముఁ లు
నోమె యోపె యనంగ నొప్పు స్త్రీసంబోధ, నార్థమై యొసి యోసియనఁగఁ జేటి
కాదిసంబోధనార్థమై యలరుచుండు, వలె యన నివార్థకంబుగా వెలయు వంటి
బోని యనఁగ వదర్థంబుగాను దనరు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 72

సీ. ముఁ జ మున్ను మును ముందు మొగి ముంగల యనంగ, ధీగనుబురఃపురార్థములు గాను
దొలుత తొల్లి మునుపు తొలియనఁగను బురార్థము ప్రోల యెదుట నాఁదగుఁ బురోర్థ
మైదనా వెంబడి యన బడి యనఁగను, వెంటయం చనఁగ వెన్వెంట యనఁగ
వెనుకయం చనఁగను బృష్ఠార్థకం బొప్పుఁ, బదపడి పిదప తర్వాత పిమ్మ
టనఁగఁ బశ్చాత్సమార్థమై యలరుచుండు, ముందువెనుకలునా నత్తిముట్టి యనంగ
నడరుచుండును రెండు నేకార్థములుగ, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 73

సీ. ఇంచుకంత యొకింత యించుక యిసుమంత, యన నీషదర్థమౌ నటుల నట్లు
నాఁ దదర్థం బెట్లునా నెటులం చన, నలరుచునుండు యథార్థముగను
నిటులునా నిట్లునా నేవమర్థం బొప్పుఁ, దోడుతో ననఁగఁ దోడ్తో ననంగ
సద్యస్సమంబుగాఁ జను లేదు వే దనఁ, గను గాదుకాదు నాఁగను నజర్థ
మొప్పుచుండును మిన్నక యూరక యనఁ, నెసఁగుఁ దూష్ణీంసమంబుగా నెల్లవేంట
కనిన నంతటి కనిన నేకార్థములుగఁ, బొలిచి యుండును శ్రీమాతృభూతలింగ. 74
గీ. మంచిదే యనంగ వల్లె యనంగను, రెండు సమము లగుచు నుండు నౌను
హైసరే సరే యటం చనంగ యథార్థ, ముగను బొల్చు మాతృభూతలింగ. 75
గీ. తనరు నంతట యన సమంతాత్సముగ, నలరు నెల్లప్పు డనఁగ సదార్థ మగుచు
న యన నే యన నేవకారార్థ మెసఁగు, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 76
గీ. అలరు మెల్లఁగ నన శనైరర్థ మగుచు, నంతరర్థము లోలోన యనఁగఁ దనరు
వెలపట బయట వెలినాఁగ వెలయును బహి, రర్థముగ మాతృభూత దయాసమేత. 77
గీ. దండ మనఁగ నమోర్థమై తనరుచుండుఁ, బొరు గిరు గనంగ నికషార్థముగఁ జెలంగు
నెప్పు డనఁగ యదార్థమై యొప్పుచుండు, నప్పు డనఁగఁ దదార్థమౌ నజ్జచూడ. 78
గీ. పరఁగు నిప్పు డనంగ సంప్రతి సమముగ, నొప్పు నేకత్ర తుల్యమై యొక్కచోట యన
నెనయు సర్వపదార్థమై యేమఁగడయు, నాఁగ దేహవిభూషితానాదినాఁగ. 79
క. ఒక్కొకలన నొకపెట్టన, నెక్కుమ్మడి యనఁగ నొక్కయూక యనంగా
నొక్కంతగా ననం బెం, పెక్కును యుగపత్పదార్థ మిందువతంసా. 80
తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు నిచ్చలు నవ్యయవర్గమిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 81

---

## క్రియా వర్గము.

గీ. ముందుగాఁగ నకర్మకములను దెలిపి, వెనుకను సకర్మకములను వివరపఱిచి
ప్రకృతులను బ్రత్యయముల నేర్పఱుతు నిందు, మాతృభూతజగత్త్రయీమాతృభూత. 82
సీ. వెలసెఁ దనరెఁ దగెఁ జెలఁగెఁ జెలంగెను, బరఁగెను బొనరెను మెఱసె నమరె
తవణిల్లెఁ గొఱలె నడరెను బరిఢవిల్లె, గ్రాలెను వఱలెఁ దురంగలించె
నొనరె నెసఁగె నారెఁ జనెఁ నలరె ననంగ, నొప్పె నన్మాటగాఁ జెప్పఁబడును
నసియాడె జవ్వాడె నాడె నూఁగెఁ గదలె, వణఁకెనా విలసిల్లు వడఁకె ననుట
పండెఁ బన్నుగొనెను బరుండెఁ బవ్వళించె, నత్తమిల్లెఁ బడుండెను నవుళె ననఁగ
నలరి యుండును శయనించె ననుట కాఖ్య, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 83

అఱచె వాపోయె నేడ్చెను మొఱలిడె ననఁ, దనరు రోదనమును జేసె ననుట కాఖ్య
లగ్నమయ్యెను లోనయ్యె ననఁగ స్వవశ, మయ్యె ననుట దనర్చు వేదాంతవేద్య. 84
ఎడసెఁ బురివిచ్చె నెడమయ్యెఁ గెడసెఁ జెంగెఁ, బాసెఁ గేడించె నాఁగను బరఁగుచుండు
వీడె ననుటకుఁ దొలఁగెనా వెలయుచుండు, నొదిగె ననుట శశాంకకళోత్తమాంగ.
పఱచె వెళ్లెను బరువెత్తె జరిగె నుఱికెఁ, గదలె ననఁ బాఱె ననుమాటగాఁ జెలంగుఁ
జనె నరిగెఁ జేఁగె వెడలెను సాగెఁ బోయెఁ, దరలె సన నడచె ననుటకుఁ దనరు నభవ.
వెచ్చనై చనుటకు విచ్చేసె వేంచేసె, నరుదెంచెఁ జనుదెంచె నరుగుదెంచె
ననఁ జెలంగుచునుండుఁ జనె గంతుగొనెఁ గూలెఁ, బెద్దనిద్దురవోయె బిద్దెఁ ద్రెళ్లె
మడిసె బ్రుంగె సమసెఁ గెడసె ముగిసె నీల్గెఁ, దెరలెను దోరెను దీఱె వెల్లెఁ
గ్రుంకె సేఁగెను బోయె డింకవేసెను మ్రగ్గె, ననఁ జచ్చె ననుమాట కాఖ్యలయ్యె
వెళ్లె వెలువడె ననఁ దగు వెడలె ననుట, మసలె జాగిడెఁ దడసె నా మనుచునుండు
జాగుచేసె ననుటకును జాఱె వీడె, ననఁగఁ జ్యుత మయ్యె ననుటగా నలరు నభవ.
మ్రొగ్గె డొంకెఁ గుందెఁ దగ్గె డీలయ్యెను, స్రగ్గె ముడిఁగె డొంకె సమసె స్రుక్కెఁ
గ్రుంగె డస్సె డిందెఁ గుదిసెఁ దూలె నణంగె, ననఁగఁ దగ్గె ననుట యలరు నభవ.
మీఱె హెచ్చరిలెను మించె రెక్కొనె హెచ్చె, నెచ్చెఁ బెరిఁగె ననఁగ వృద్ధిఁ జెందె
ననుట కాఖ్యలగుచు నలరారుచుండు సు,గంధికుంతలాంబికాసమేత. 89
తనరు ఖ్యాత మయ్యె ననుటకుఁ బేరుగా, నెగడె ననఁగ వెలయు నిండె ననఁగఁ
బూర్ణ మయ్యె ననుట పొలుచు నెఱసెఁ బర్వె, ననఁగ నొలసె ననుట యద్రిగేహ.
ఆగిలె విచ్చె విఱిగెఁ బగిలె ననంగను, ఛిరిసె ననుట కాఖ్య వెలయుచుండుఁ
బిగిలెఁ బీలె ననఁగఁ బెంపొందుచుండును, జినిఁగె ననుట కాఖ్య సితసమాఖ్య. 91
అంజె నళికె వెఱచె నదరెఁ దద్దిరె దద్ది, రిల్లె జడిసె ననఁగఁ జెల్లు భయముఁ
జెందు ననుటకాఖ్య చేతఁ జలించెనం, చనుట బెదరె ననఁగ నలరు నభవ. 92
తడిసె నానె ననఁగఁ దనరు నార్ద్రంబయ్యె, ననుట కాఖ్య తెగియె నరె ననఁగ
ఛేద మయ్యె ననుట చెలఁగుచునుండు సు, గంధికుంతలాంబికాసమేత. 93
అచ్చివచ్చె ననంగ నైవచ్చె ననఁగ మే, లై వచ్చె ననుటయూ నావటిల్లె
ననఁగను గలిగెనం చనఁ దోఁచుఁ గడతేరె, ననఁ గృతార్థం బయ్యె ననుట కొప్పు
నీడుమీఱె ననంగ నీడేరె ననఁగను, వయసు వచ్చె ననుట వఱలు నెందు
నంత్యంబు నెఱవేఱె ననుటయుఁ దోఁచును, బొంగె నుప్పతిలె నుప్పొంగె ననఁగ
నుబ్బె ననుటకు నర్థమై యొప్పుచుండు, నలరు ననువయ్యె ననుట జొబ్బిలె ననంగఁ
బరఁగుఁ జాలుకయ్యె ననుమాట యొరిమె ననఁగ, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ.

గీ. ఒడ్డగిలె నాఁగ నొకదిక్కు కొరిగె ననుట, యొసఁగు బెండగిలెను నాఁగ నెత్తువడియె
ననుట తగు నొల్లఁబోయె నాఁగను దనర్చుఁ, జిన్నపోయె నటంచనఁ జిత్స్వరూప.

గీ. ఓసరిలెఁ దగ్గ తఱిగెనా నొప్పుఁ దక్కు, వాయె ననుమాట కలచెనా నలరు వలచె
ననుట కసిదేరె నాఁగను ఖ్యాతిఁ జెంది, యుండుఁ గప్పట్టె ననుట సూర్యోత్తమాంగ.

సీ. ఓహటించె ననంగ నోడె నంచును దోఁచుఁ, గూఁకె నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట
కోలుపోయె ననంగ బేలుపోయె ననంగ, మోసపోయె ననుట పొలుచుఁ దీఱె
ననఁగను నిలిచె నంచని పల్కఁగాఁ దగుఁ, గొరగొట్టె ననఁగను గిలకిలఁబలి
కె ననెడిమాటయాఁ గేకసల్గొట్టెనాఁ, గేకలు వేయుచుఁ గేలుదట్టి
నవ్వుట చెలంగుఁ గర్వాడె నాఁగ మేపు, మేసె ననుట దనర్చును మెఱయుఁ గసిమ
సంగెఁ జెలరేఁగె నాఁగను సమము లగును, భూషితభుజంగ శ్రీమాతృభూతలింగ. 97

గీ. డాఁగురించె వఱిఁగె డాఁగె ననంగను, దాఁగి యుండె ననుట గాఁగఁ దోఁచుఁ
జదుకుపడె ననంగఁ జదికిలఁబడె నను, మాటగాఁ దనర్చు మాతృభూత. 98

సీ. చేకుఱెఁ జేకూఱెఁ జేకూడె నంచన, నేకార్థములు గాఁగ నెసఁగుచుండు
వసమరె వేసారె విసివె నటంచన, నేకార్థములు గాఁగ నెసఁగుచుండు
బొబ్బెట్టె వాపోయె బొబ్బరిల్లె ననంగ, నేకార్థములు గాఁగ నెసఁగుచుండుఁ
గుదురుపడెను నెలకొనెను డెక్కొనె నన, నేకార్థములు గాఁగ నెసఁగుచుండు
వెచ్చె ననఁ గందె ననఁగను వేఁగె ననఁగఁ, గమలె ననఁగను దనరు నేకార్థములుగ
వేగె నాఁగను దెలవాఱె నాఁగ వేవె, ననఁగ నేకార్థములు గాఁగఁ దనరు నభవ. 99

గీ. డిల్లపడె ననంగఁ జెల్లును ధృతివీడె, ననుట జాగుచేసె ననుట కొప్పుఁ
దడసె ననఁగ మిడిసిపడె ననుటకుఁ దగు, మిడుకుమాలె ననఁగ మిహిరభూష. 100

సీ. ఆశ్చర్యమును జెందె ననుమాట కర్థమై, తటకాపడె ననంగఁ దనరుచుండు
ననిచె నాఁగఁ జిగిర్చె ననుటయు వికసించె, ననుటయు నర్థమై యలరుచుండు
మోహరించె ననంగ మొనఁజేసె నని తోఁచుఁ, బల్కెక్కె ననఁ దగుఁ బండె ననుట
నివ్వటిల్లె ననంగ నిండారె ననఁ బూర, టిల్లెనా సమములై యుల్లసిల్లుఁ
దొప్పరిలఁబండె నాఁగను దోఁచుఁ దట్టు, విఱుగఁబండె ననుటకును బిఱుదివిచె న
నంగ వెనుదీసె ననుట దనర్చియుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 101

గీ. వగచె దురపిల్లె వందురెఁ బల్లటిల్లెఁ, బొక్కె నన నంగలార్చెనాఁ బొల్చియుండుఁ
బలకఁబాఱెనన న్దెల్లఁబాఱె ననుట, కలరియుండును మాతృభూతాభిధాన. 102

గీ. బీరువోయెఁ జొంగను మీఱు వ్యర్థ, మాయె ననుటయు మెల్లనపోయె ననుట
గుంపుగూడె ననం బలు కొప్పుచుండు, మల్లడిగొనె ననంగను మాతృభూత. 103

పెనఁపడె ననఁ దగును దవడనరాలు, పట్టుకొనె ననుటకు బడల్పడియె ననఁగఁ
జాఁపచుట్టఁగఁ బడె నని తోఁపఁబడును, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 104
చెలఁగుఁ బరివోయె ననఁగను జెదరె ననఁగ,నయిదుపదిచేసె నన ముందరడుగు వెనుకఁ
బెట్టె ననుటకుఁ బేరుగా వెలయుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 105
చేను కావించెఁ బైరిడెఁ జెట్లు గొట్టె, ననెడుమాటకుఁ బొదికొట్టె ననఁగఁ జెల్లు
మస్తరించె ననంగను మనును [illegible], లప్పళించె నటంచుఁ జంద్రార్ధచూడ. 106
పురలొప్పె నాఁగ శాత్త్రియు, మెఱయించె నటంచుఁ దోఁచు మీఱుచు నుండుఁ
సారిగె నన సాగసె ననఁగను, సురిగె నన న్వాడె ననుట సోమవిభూషా. 107
ఒరులు చెప్పిన వెనుకఁ దా నొకటి చేసె, ననెడిమాటకు మొండొడ్డె ననఁగఁ దోఁచు
మల్ల చఱచె ననంగను మను భుజంబు, లప్పళించె నటంచు సూర్యావతంస. 108
అతిశయముఁ జేసె ననుమాట కాఖ్యగాను, బొలిచియుండును బొంఫిరివోయె నాఁగఁ
గనులు చెదరంగఁ జీఁకట్లు గ్రమ్మె ననుట, కలరు మిఱుమిట్లు గొనె నన నద్రినిలయ.
వినిపించె ననెడిమాటకు, వినిచె ననం జెల్లుచుండు వీఁగె ననంగాఁ
దనరును గర్వించె నటం, చని త్రిశిరఃపురనివాస యాదృతదాసా. 110
సోలె ననఁగను దగు వాడి వ్రాలె ననుట, మనును సొమ్మలవోయె సొమ్మసిలె ననఁగ
మూర్ఛఁ జెందె నటం చని పొంచెననఁగ, దాఁగుకొనియుండె ననుమాట దగు మహేశ.
అఱచె అంఘిలె ననఁ గూసె ననుట వెలయు,సరిగె నెదిరించె ననుమాట చనును మాఱు
మసలె ననఁగను రొప్పెనా మనును వ్యాఘ్రము, మారవముఁ జేసె ననుట చంద్రార్ధచూడ.
లంబనంబాయె ననుటకై వ్రాలె ననఁగఁ, బొలుచుఁ దగ్గుఁ బొడమె ననంగఁ బుట్టె ననుట
కాయె నయ్యె ననంగఁ జెన్నలరుఁ గలిగె, ననెడిమాటకు మాతృభూతాభిధాన. 113
మల్లి మరలెఁ దిరిగె మగిడె ననంగను, గ్రమ్మఱిలె నటంచుఁ గానఁబడును
వినిచె ననఁగఁ దోఁచు వినఁబడె నంచని, మహితగుణసమేత మాతృభూత. 114
చిక్కుపడియె దొరకెఁ జేపడె నగపడెఁ, దవిలెఁ బట్టువడియెఁ దగులువడియె
నబ్బె ననఁ గృహీత మయ్యె ననం దగు, మహితగుణసమేత మాతృభూత. 115
దోఁపువోయె ననుట దోఁచు నులిపడె న, నంగ దిమ్మపడె ననంగ డిందు
వడియె ననుట దోఁచు విడఁబడె ననఁగను, దనరు విడువఁబడియె ననుట కభవ. 116
పొదివెఁ గవిసెను గ్రమ్మె నాఁ బొలుచు నావ, రించె ననుమాటగాను మలంచెఁ జుట్టె
గిరికొనెను బ్రమ్మె బరికొనె గ్రిక్కిఱెసె నన, వెలయు వేష్టించె ననుటకు వేదవేద్య.
మెసవెఁ దినియెఁ గుడిచె మెక్కెఁ దోసేసెను, నమలె నారగించె భుజించె
ననుట కాఖ్య లగుచు నలరారుచుండును, మాతృభూత భక్తమాతృభూత. 118

సీ. పొందె హత్తెఁ గలిసెఁ జెందెఁ దార్కొనెఁ గూడెఁ, బెరసెఁ గ్రిక్కిఱిసెను బెనఁగె దొరసె
నందెఁ గదిసెఁ జేరె నన నంటె నని తోఁచు, వాక్రుచ్చె నుడివెను బలికె నాడె
ననె ననఁగ వచించె నంచును విలసిల్లు, వినియెను జెవిదోరపెట్టె నాఁగ
నాలకించెను వినె నాలించె ననఁగను, బూనెఁ దాల్చెఁ దొడిగె మోచె నాఁగఁ
దార్చెనా గొదగొనె ననఁ దనరు నావ, హించె ననుమాటగా వెడలించె రొప్పె
వీచెఁ దఱిమెను దోలెను వెళ్ళఁదన్నె, ననఁగ నుచ్చాటనముఁ జేసె ననఁ దగు భవ.

గీ. అడ్డగించెఁ దటాయించె నానె నాఁగె, నిలిపె నరికట్టె ననఁగను వెలయుచున్నఁడు
వారణముఁ జేసె ననుటకు మీఱుచుండుఁ, దన్నె ననఁ దాఁచెననుటకై దాతృవంద్య.

గీ. పురిగొలిపె నంచెఁ బుత్తెంచెఁ బుచ్చె నంపెఁ, బంచెఁ బంపెను బంపించెఁ బనిచె ననఁగ
నలరు నంపించె ననుమాట కర్థమగుచు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 121

సీ. కనుఁగొనెఁ దిలకించెఁ గాంచెఁ జూచెను గనె, ననఁగను గనియె నంచనఁ జెలంగు
నానె నంచనఁ గ్రోలె ననఁ ద్రావె ననఁగ నా, స్వాదించె ననుటకై వఱలు చుండుఁ
బీల్చె జుఱ్ఱె ననంగ వెలయుఁ దద్భేదమై, వెదకె నారసె రోసె వెలచె నెమకెఁ
బరికించెను దడవె నరసె ననంగ న, న్వేషించె ననుటకు వెలయుచుండుఁ
దూకొనెను జొచ్చెఁ జొరఁబాఱె దూరె దూసె, ననఁదటాకించెననుమాటకర్థమగును
గాఁడె గ్రుస్సెను దొలిచెను నాఁడె ననఁగ, నాటె ననుమాట కర్థమౌ నాగభూష.

సీ. నుగ్గాడెఁ బరిమార్చె నులిమెను దెగటార్చెఁ, జదిపెఁ జంపెను సదమద మొనర్చెఁ
జక్కాడె నురుమాడెఁ జాఁగఁబడలాడెను, బిలుకుమార్చెను ద్రుంచెఁ బీఁచ మడఁచెఁ
దెంచె మన్నిగొనెను దెంపె వెంపరలాడె, మారిమసంగెను మడిపెఁ దునిమె
గ్రగ్గులుకొఁడును గావించె ముగియించె, నులిచెను బగదెంచె నురుముఁ జేసె
నడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె,ననుటకుసమాఖ్యలై సాకె మనిచెఁ బెంచెఁ
బెనిచె బ్రతికించెఁ గాచె నేదె నన నొనరుఁ, బ్రోచె ననుమాట శ్రీమాతృభూతలింగ.

సీ. అదలించె గద్దించె నడలించె ననఁగను, గదిమె నంచనుమాటగాఁ జెలంగుఁ
గొనియాడెఁ బొగడెను గొండాడె నగ్గించె, ననఁగను వినుతించె ననుట దోఁచు
మొత్తెఁ గొట్టెను వ్రేసె మోఁదెను మరిపెనాఁ, బ్రహరించె ననుటకుఁ బరఁగుచుండు
వెలయును దేలించె బెల్లించె నూటించె, ననఁగ నెక్కించెనం చనెడిమాట
యెంచెను లెక్కించె నెన్నె ననంగను, నెగడుచునుండు గణించె ననుట
కద్దగెఁ గిట్టెను డాసెను గదిసెఁ గవిసె, జేరె దగ్గఱె ననఁ దారసించె ననఁగ
వెలయుఁ గోపాస్య బెదవిని విఱిచె ననుట, కవుడుగఱచె నటంచు నహార్యనిలయ.

గీ. అరసెనాఁగ విచారించె ననుట కొప్పుఁ, బూనెఁబట్టించెఁ జమరెనాఁ బొలుచు నలమె
ననుట కెదిరించె ననుటకు నలమె ననఁగఁ, బొలుచుచుండును శ్రీమాతృభూతలింగ.

గీ. ఎలిచెఁ దలఁచె ననం జను నెంచె ననుట, చీఱె నన నుత్తరించెనాఁ జించె ననఁగ
ఛేదనముఁ జేసె ననుటకుఁ జెలఁగుచుండు, భూతిలసితాంగ శ్రీమాతృభూతలింగ. 126

గీ. ప్రామెఁ దొలిచెను వెలచెను దోమె రుద్దె, ననఁగ నిర్మల మొనరించె ననుట యొప్పు
నెసగొలిపెరేఁచెనాఁగను నెసఁగుచుండుఁ, బ్రేరణముఁ జేసె ననుమాట యిందుజూట.

గీ. తెలచె నెరఁగె నెఱంగెఁ జాగిలెను మ్రొక్కె, నన నమస్కారమును జేసె ననుట కొప్పు
మీఱె ననఁ గడచె ననఁగ మించె ననుట, పొలిచి యుండును శ్రీమాతృభూతలింగ.

గీ. గనుపుగొట్టె ననంగను దనరు నూఁచ, ముట్టుగాఁ గొట్టె ననుమాట పట్టుకపడె
ననెడిమాటకుఁ దగుఁ గచ్చుకొనె ననంగఁ, బుంగవతురంగ శ్రీమాతృభూతలింగ. 129

గీ. పెట్టెఁ గిలిండె నాఁగను వెలయుచుండు, నుంచె ననుపల్కు నకు నేదె నుజ్జగించె
ననఁగ విడిచె ననెడిమాట కతిశయిల్లు, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. 130

క. ఒప్పించె నొప్పగించెను, నొప్పరగించె నన మూఁడు నొకయర్థంబాఁ
గప్పె నన మూసె ననుచుం, జెప్పంబడుఁ గవులచేతఁ జెవ్వందీశా. 131

సీ. గానెమారెఁ జదిపె నాఁగను గొట్టె నని తోఁచుఁ, దఱిగె ననంగను నఱకె ననఁగ
గోరాడెఁ జిరిమెను గొండాడె నాఁగను, దుమ్మురేఁచె నటంచుఁ దోఁచుచుండుఁ
జెనకె నంటెను సోఁకెఁ జెనసె ముట్టె ననంగఁ, దాఁకె నటం చని తనరుచుండు
జెరివెఁ దాఁచెను దాపెఁ జెక్కుదూర్చె ననంగఁ, జొనిపె నటంచని తనరుచుండు
నెసఁగు నొడియించె ననఁగఁ దీయించెననుట, చీరె ననఁ బిల్చె ననుపల్కు చెల్లుచుండు
రాల్చె జాడించె ననఁగను రహికి నెక్కు, విదలిచె నటన్న పల్కుగా వేదవేద్య! 132

సీ. నివిరెను దడవెనా నిమిరె నంచని యొప్పు, నచ్చె ననం దగు నమ్మె ననుట
సోడుముట్టె ననంగ శోభిల్లు నంతట, వ్యాపించె ననుట యియ్యకొనె నూల్కొ
నె ననఁగ సమ్మతించె ననుట రాజిల్లు, వంచె ననందగు వండె ననుట
వంచె ననుటయును వానించె ననఁగను, బైని దేలించుట పరఁగుచుండుఁ
బాఱఁజూచె ననంగఁ దప్పకయె చూచె, ననుటకును దోఁచు నోనాడె ననఁగ నోవ్వ
నాడె ననుట చెలంగుఁ దనర్చు వీడె, మానె నన విడిచె ననుట మాతృభూత. 133

గీ. ఓసరించె ననఁగ నోరఁజేసె ననుట, వెలయు విలిచె న్ననఁగ బిలిచె ననుట
యలరు విలిచె ననఁగ నమ్మె నంచనఁ దోఁచు, మహితగుణసమేత మాతృభూత. 134

గీ. పోఁజె ననఁగ వెలయు ముంటఁ జీల్చె ననుట, చెప్పె ననుట ఫలముఁ జెందె ననుట
పరఁగుఁ బొరసె ననఁగ మఱువెట్టె ననఁదగు, మఱుఁగు బెట్టె ననుట మాతృభూత.

సీ. వంచించె ననుటకుఁ బండించె ననఁగను, గికురించె ననఁగను గేరుచుండు
దీకొనె ననఁగను డీకొనె ననఁగ నె, దుర్కొనె నంచును దోఁచుచుండు
బురపురఁ బొక్కెనాఁ దలుచుగా వెతలను, జెందె నంచనుమాట చెలఁగుచుండు
వార్చినాఁ గడిగె నుపాసించెఁ గొడస్గెను, ద్దేశించె నాఁగను దేజరిల్లు
వెలయు వెన్నాడె నాఁగను వెంబడించె, ననుటకు వెలార్చె వెదచల్లె ననఁగఁ జల్లె
ననుటకుఁ జెలంగు వినఁడాయె ననెడిమాట, కలరు బెడచెవిఁబెట్టె నంచని మహేశ.

గీ. మించు రిక్కించె ననఁగ నిక్కించె ననుట, చనును పొరువఁ జూచెనాఁ జక్కఁగాను
జూచె ననుటకు సలిపెనాఁ దోఁచుఁ జేసె, ననెడిమాటకు మాతృభూతాభిధాన. 137

క. పటుతాళించె ననంగను, నటునిటు బెళుకంగఁ జూచె ననుటకుఁ దోఁచుఁ
జిటికె ననంగను విలసిలుఁ, జిటికలు వేసె ననుమాట చెవ్వందీశా. 138

గీ. అడిగెఁ బితికె వ్రాడె నడ్డగించెను గోసె, ననఁగ నిట్లు కొన్ని యగు ద్వికర్మ
ధాతువులుగఁ దెలియఁ దగు వాని నెల్లను, మహితగుణసమేత మాతృభూత. 139

సీ. ప్రోఁచుచున్నాఁ డనఁ బ్రోఁచుచున్నావనఁ, బ్రోఁచుచున్నా ననఁ బోలుచు లట్టు
ప్రోఁచె ననంగను బ్రోఁచితి వనఁగను, బ్రోఁచితి ననఁగను బోలుచు లిటు
ప్రోఁచు ననంగను బ్రోఁతు వనంగను, బ్రోఁతు వనంగఁ బెంపొందు లట్టు
ప్రోఁచుఁ గాత యనంగఁ బ్రోఁతువు గాతనాఁ, బ్రోఁతును గాతనా బోలుచు లిజ్జు
లార్థముల పురుషక్రియలందు నేక, వచనములఁ దెల్పితిని బహువచనములను
జూచి యన్నిటి కిట్లు లెంచుకొనవలయు, నాశ్రితనిధాన మాతృభూతాభిధాన. 140

గీ. ప్రోవఁబడె ననఁ గర్మార్థమునఁ జెలంగుఁ, జనును బ్రోపించె ననఁగ ణిజర్థరీతి
నలరుభావార్థమునఁ బ్రోఁచుటాయె ననఁగఁ, దక్క నీరీతిఁ గనుఁగొనఁ దగుమహేశ.

గీ. భావమునఁ బ్రోవుప్రోఁచుట బ్రోవడ మనఁ, బరఁగుఁ గర్మార్థమునఁ బ్రోవఁబడినదియన
వలలుఁ గర్త్రర్థమునఁ బ్రోఁచువాఁ డనంగ, మను సుబంతంబు లీజాడ మాతృభూత.

తే. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ, బరఁగు శాశ్వతముగఁ గ్రియావర్గ మిట్లు
గైకొనుము దీని భక్తసంఘాభిమాని, మాతృభూత జగత్త్రయీమాతృభూత. 143

---

గీ. అశ్రుతగ్రామ్య విస్మృత వ్యర్థసులభ, శంకితాలస్య నిరుక్తశబ్దవితతిఁ
దక్క రచియించు నీకృతి దయను గొనుము, మాతృభూత జగత్త్రయీమాతృభూత.

చ. చరణనమజ్జనాఘనవిశారద శారదచంద్రదయుక్తిర
స్ఫురణచణాయమానముఖసారస సారసమంచితోక్తి ని

ర్భరకవితార సైకసులభాయితరూపక రూపకంఠసుం
దరలతికాసమానదయితాభరణాంగ రణాంగణప్రియా. 145

సకలభువననాథా సంతతస్వావబోధా
మకుటఘటితసోమా మంగళాధారనామా
సుకవిహృదయగేహా సుందరస్వచ్ఛదేహా
యకలుషనిజచర్యా యాశ్రితామోదకార్యా. 146

ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాదికతిపయగుణస్వామ్య తదితరసకలగుణనిరూపమ్యాసేతుహిమాచలఖ్యాత మహోద్దండకవి బిరుదప్రశస్తసీతారామార్యవర్యతనూజాత శౌర్యధైర్యస్థైర్యాదిసకలగుణచిరత్నరత్నరత్నాకర శ్రితజనశ్రీకర కోటిసమాఖ్యవంశసుధాపయోధి రాకాశశాంక ఘంటికాతురగ నీలాతపత్త్రి హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరికాదినిఖిలబిరుదాంక బృహదంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విపులయశోబంధుర కర్ణాటచోళపాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాథమహీనాథ సభాంకణ బిరుదాయమానార్యనుతచర్య వేంకనార్యప్రణీతం బైనయాంధ్రభాషార్ణవంబునందు సర్వంబును ద్వతీయకాండము.

సంపూర్ణము.